# శ్రీ వాసవికన్యకా పురాణ
# తోహరాగానము

ACC NO. 31136




రచయితలు:

నిఖిలానందగుప్త

మహిళామాత

శివరామగుప్త


సర్వవిధ సహాయకులు:

పలుకూరి రామమూర్తి, ధర్మపత్ని అన్నపూర్ణమ్మగార్లు

కాకినాడ.


ప్రకాశకులు:

ఎన్. రామయ్యశ్రేష్ఠి, హిందూపురం.

# శ్రీ భగవాన్ స్వామి చిద్గగనానంద మహర్షులు



నిఖిలానందగుప్త, మహిళామాతగార్ల
సద్గురువు.



ఓం

# గ్రంధప్రశంసపీఠిక

ప్రేమస్వరూపులారా!

మన భారతభూమి ధర్మానుష్ఠాన సదాచారుల గన్న పవిత్రమాత యని వేనోళ్ల బొగడబడినది. ఇట్టి భారతభూమిలో ద్వితీయ మదరాసు అని పేరుకొన్న కాకినాడ పట్టణములో ఆదర్శగృహస్థులగు శ్రీమాన్ పలుకూరి రామమూర్తి, ధర్మపత్ని శ్రీమతి అన్నపూర్ణమ్మగార్ల గృహమున ప్రప్రధమున శ్రీకన్యకా పురాణం తోహరగూపం రచింపబడి కాకినాడ జగన్నాధపురం బెంగుళూరు కంటోన్‌మెంట్, చింతామణి, బంగారుపేట, కోలారు, హోసూరు గ్రామములలో పురాణం జరుపబడుచు తుని గ్రామమునకు శ్రీయుత బొండాడ నూకరాజుగుప్తగారిచే శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయములో 1–12–55 ధ్వజస్తంభ ప్రతిష్ఠ మహోత్సవమునకు ఆహ్వానింపబడి సదరు నూకరాజు గుప్తగారిచే నిర్మింపబడిన కన్యకాపరమేశ్వరి సత్రంలో బసచేసి తిమి. ఈసమయమున పురాణములు మొదటి ముద్రణముగియుట చేత హిందూపురంలో యున్. రామయ్యగారి సంకల్పమున ద్వితీయ ముద్రణము సదరు కాకినాడ ప్రధమ ముద్రకుల స్వగృహస్థులే అన్ని విధముల తోడ్పడుటవలన తుని గ్రామం సత్రములో నూతన భావములతో రచింపబడి మరు ముద్రణ జరిగినది. ఈ గ్రంధప్రశంస—

ఆర్యవైశ్యులకు పవిత్ర చరితము
వీర్లకు కాదు ఆంధ్రులకు

ఆంధ్రంబునకే అనిన దోషము
భారతభూమికి వుపయోగం॥ 1

భారతభూమికి మాత్రమె కాదు
యదార్థంబును చెప్పినచో
విశ్వమానవ మత గ్రంధమని
వాసవి చరితము తెలియండి॥ 2

రాజ్యాంగమున ధర్మ నీతులు
సత్యము ఆచరణము లుడుగ
ఆసమయమునకు నీతి గాధ యని
ముక్తకంఠమున దెలిపెదను॥ 3

సమాజమునకు వోర్పును గూర్చు
సభలకు సుఖము సమగూర్చు
సంఘుంబులకు భీషణ గూర్చు
సర్వ సౌఖ్యములు సమగూర్చు॥ 4

ఈయుత్కృష గ్రంధమును మేమేమని కొడియాడగలము. ఈ గ్రంధముపై అభిప్రాయములు ఇచ్చిన వ్యక్తులకు చంద్రునకు నూలుపోగువలె సముద్రునకు అర్ఘ్యమువలె సూర్యునకు హారతివలె మా వందనములు చేసెదము.

ఇట్లు
**ఎన్. నిఖిలానందగుప్త**
**మహిళామాత**
పుత్రుడు **ఎన్. శివరామగుప్త**
గీతాప్రచారకులు

జగన్మోహినీ కేశవస్వామి



సమయమంతుల నాగేశ్వరరావుగారు, వారి కుటుంబము.
(ర్యాలి)



రచయితలు, గీతాప్రచారకులు
శ్రీ ఎన్. నిఖిలానందగుప్త, మహిళామాత
పుత్రుడు శివరామగుప్త

# సంపాదకుల అభిప్రాయములు

ఆర్యవైశ్య మహాశయులారా !

శ్రీ గీతా శ్లోక మనుసరించి 'శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అన్న రీతిగా శ్రీ నిఖిలానందగుప్త, మహిళామాత గార్లు కర్ణాటక రాష్ట్రమున జన్మించి, ఆంధ్ర వాఙ్మయమందు కృషిచేసి ఆంధ్రప్రాంతమందనేక గ్రామములు పర్యటించి ఆర్యవైశ్య గీతా సమాజములను స్థాపించి, గీతానర్గళ సేవ చేయుచూ, వైశ్యకుల దేవతయైన శ్రీవాసవ కన్యాకాపరమేశ్వరీ అమ్మవారి పురాణము కూడ ప్రచారము చేయుచున్నారు. శ్రీ వాసవీ పురాణమును కేవలం గానం చేయడమేగాక ప్రతి ఘట్టమును వేషధారణలతో దృశ్యరూపంగా ప్రేక్షకులకు జూపి శ్రీవాసవీమాత దివ్యగాథను ప్రచారము చేయుచున్నారు. శ్రీవారు శ్రీ భగవద్గీతనూ, శ్రీ వాసవీ పురాణముగూడ పండిత పామరుల కర్థమగు సులభశైలిలో తొహరా రూపంగా మధు రాతి మధురంగా రచించారు.

తుని పట్టణంలో శ్రీ అమ్మవారి ఆలయంలో శ్రీవారి పురాణకాలక్షేపం జర్గుచున్న సమయంలో నాకు శ్రీ గుప్తగారి పురాణ కాలక్షేపము విను భాగ్యము లభించినది. 102 గుండములు, 102 దంపతులు ఆహుతులు, శ్రీవాసవీ మాత జననం వగైరా ఘట్టములు— నా మనస్సున వేషములతో ఆనాటి

గుండ ప్రవేశము ఆనాటి సన్నివేశములు ప్రత్యక్షమైనట్లు తోచినవి. శ్రీగుప్తగారు రచించిన శ్రీవాసవీ పురాణములోని తోహరాలు చదివితిని. మిక్కిలి చక్కగా రచింపబడినవి. ఈసద్గ్రంథమును వైశ్యులెల్లరును ఆదరించుటయే గాక ప్రతి ఇంట ఒక గ్రంథము నిడుకొని శ్రీ వాసవీమాత దివ్యగాథను గానము చేసికొనుట ముఖ్యధర్మము. ఇవిగాక శ్రీగుప్తగారు అనేక భక్తిరసపూరిత గ్రంథములు రచించిరి. శ్రీగుప్తగార్ని ప్రతి గ్రామమందలి వైశ్యులు ఆహ్వానించి మన కులదేవత పవిత్రగాథను వారి ద్వారా విని వారిని ప్రోత్సహింతురని ఆశించుచున్నాను.

ఇట్లు
తాడికొండ నరసింహమూర్తిగుప్త
సంపాదకుడు
"వైశ్యమిత్ర"

పెంటపాడు
ప॥ గో॥ జిల్లా
30-12-1955

## తుని ఆర్యవైశ్య భక్తమండలి



శ్రీ కక్కిరాల వీరవెంకట సత్యనారాయణగుప్త, శ్రీ బొండాడ నూకరాజు గుప్త, ఎస్. ఎస్., ఎస్. ఎమ్. ఎమ్.
శ్రీ పెనుగొండ సుబ్బారావు గుప్త, శ్రీ కోయకొండ రామలింగయ్య గుప్త (తుని)

గీతా తోహరాగాన నిష్కామ సేవకులు



కడ్మిశెట్టి చిదంబరం, అచ్చియమ్మగార్లు (అనకాపల్లి)

ఓం

# భగవద్గీతా మహిళాసంఘం, తుని

సోదర సోదరీమణులారా !

భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నులునూ, సంఘసేవా తత్పరులునూ స్వార్ధరహితులునూ అగు శ్రీ నిఖిలానందగుప్తా మహిళామాతగార్లు శ్రీ వాసవీకన్యకా పురాణమును తోహార రూపమున సామాన్య మానవకోటికి స్త్రీలకు అర్ధమగునట్లును గానముచేయుట కనువగు సులభశైలిలో గ్రామ్యభాషలో మధురముగా రచించిరి. మా గ్రామమున కన్యకాపరమేశ్వరి ఆలయములో శ్రీ పుణ్యదంపతులు శ్రీకన్యకాపురాణ పఠనమును ప్రత్యక్షరూపమున వేషధారణములతో సప్తాహము జరిపించి తుని పురవైశ్యులచే గానము చేయించి రెండు నెలలు ఆనందాబ్ధి నోలలాడించిరి. ఇంత ఆనందము మా కన్యకాపరమేశ్వరీ ఆలయ ప్రతిష్ఠసమయమునకూడ ఎరుగము.

మన ఆర్యవైశ్యులెల్లరు మన కన్యకాపురాణము చదివి తరించవలెను. అంతియేగాక యీ శుభదంపతులచేత గానము చేయించి అపరిమితానందము పొంది తరించెదరుగాక. వీరు రచించిన శ్రీ కన్యకాపురాణము గీతాసంగీతము యితర పవిత్ర గ్రంధములు స్థిరస్థాయిగా వుండి మానవకోటికి మోక్షదాయకమగుగాక యని కోరుచున్నాను.

ఇట్లు

చక్కా సత్యవతి

భగవద్గీతా మహిళాసంఘం, తుని.

ఓం

# శ్రీ దివ్యజ్ఞాన సమాజం

ఈ తోహరాగానము రచియించిన వైశ్యకులతిలకు లయిన శ్రీ గుప్తా, మహిళామాతగార్లు వైశ్యకులోద్ధారకులనిన నతిశయోక్తి కాదు. ఈ గ్రంథ రచన ద్రాక్షా పాకము, ఆర్య వైశ్యులకు మిక్కిలి వుపయోగము. వీనిని విన్నను, పాడినను అపరిమితానందము పొందెదరు. వీరి పరిశ్రమ శ్లాఘనీయము. వేమేల ఈకన్యకాంబాచరిత్ర ఈరీతిగా యొనర్చినవారిని చూచి యుండుటలేదు. ఈగ్రంథము ఆచంద్రతారార్కము వెలయుగాక.

ఇట్లు

**పెనుగొండ లింగయ్య**

వశిష్టాలాడ్జి, తుని.

ఓం

ఈ తోహరాగానము పండిత పామరులకు గ్రాహ్య గ్రంథము. ఆంధ్రభాషా వధూటి కొక నూతనాలంకారం. ఇట్టి గ్రంథమును రచించిన యస్. గుప్త, మహిళామాతగార్ల కృషి వర్ణనాతీతముగను యియ్యది శాశ్వతమై అజరామరమై అనంత కోటివత్సరములు ఆర్యవైశ్యు లున్నంతవరకు వారి ప్రతిభకు నిదర్శనమై వర్ధిల్లుగాక.

ఇట్లు

భవదీయ విధేయులు

**రాజయోగి వట్టి బసవయ్య, తుని**

# పలుకూరి రామమూర్తిగారు, కాకినాడ



శ్రీ నిఖిలానందగుప్త, మహిళామాతగార్లు మా యింట బసచేసి యీ యుద్గ్రంథమును రచింప బూనుట మా యదృష్టము. శ్రీ వాసవికన్యకా పురాణము వంటి పవిత్రగ్రంథము అందరకు అందుబాటులో నుండవలెనను నుద్దేశముతో దీని నచ్చొత్తించుటకు ప్రోత్సహించితిమి. దానికి తగినట్లుగా భక్తవరులు చూపిన యాదరణవలన అనతికాలములోనే యీ గ్రంథము ద్వితీయ ముద్రణకు వచ్చినది. ఈ పురాణమును ప్రచురించుటయందు యథాశక్తి సేవ చేయుటకు శ్రీ గుప్తగారు మాకు అవకాశ మిచ్చినందులకు మే మెంతయు ధన్యులము. వారు లేకున్న సమయములో దాని నచ్చు వేయించుటచే జరిగిన పొరపాటులను భక్తవరులు క్షమింతురని యాశించుచున్నాము.

ఇట్లు

పలుకూరి రామమూర్తి

# ముద్రాపకుల మనవి

శ్రీ నిఖిలానందగుప్త, మహిళామాతగార్లు రచించిన శ్రీ వాసవి కన్యకాపురాణ తోహరాగానం వంటి పవిత్రగాథను అచ్చొత్తు భాగ్యము మాకు కల్గినందుకు మేము ధన్యులము. శ్రీ గుప్తగారు ఈగ్రంథము అచ్చువేయుట ప్రారంభమైన నాటి నుండి గ్రామములో నుండుటకు సావకాశము లేకపోవుట చేతను అన్నియు మేము చూచుకొనుట చేతను కొన్ని పొరపాటులు జరిగియుండవచ్చును. అవి మరు ముద్రణలో సవరించుకొనగలము. కావున భక్తవరులు మమ్ము మన్నింతురుగాక.

ఇట్లు

కాకినాడ 1-3-'56

తల్లాప్రగడ రామచంద్రరావు
ప్రొప్రయిటరు, సత్యమాంబా ముద్రణాలయం.

# శ్రీ వాసవికన్యకా పురాణ ప్రతిభ తోహరాగానము

## తునిగ్రామము శ్రీవాసవి కన్యకాపరమేశ్వరీ స్తోత్రము

నిఖిల లోకానీక నిర్మాణ సంధాయి
తలవాకి లిల్లయ్యె వలపు చిలుక
సత్కవీంద్ర స్ఫుట స్వారాజ్య విభ్రాజి
తంబై యలరు పట్టి రాజహంస
నానాకళాజాల నందనోద్యానంపు
సామ్రాజ్య మేలు వసంత లక్ష్మి
ఆనంద మధుర వీణాలాప సంపద
నోలలాడించు రాజ్ఞీలలామ

కూర్మి నోంకార పీఠిపై కొలువుదీరి
భువనంబులు పదునాల్గు బ్రోచు వాణి
అనుపమ ప్రేమ నాదు జిహ్వాగ్ర సీమ
ఎల్ల వేళ వీడువక వసించు గాక॥

వనరుహాసన త్రివిక్రమ రుద్రమూర్తులే
సాధ్వీమ తల్లికి చంటి కూన
లఖిల సృష్టి స్థితి హారణ కృత్యంబు లే
యమ్మకు పిననాటి బొమ్మలాట
లగణిత ాంభోజ గర్భాండ భాండంబు లే
ప్రౌఢ కాటల నాటి పుట్ట చెండ్లు
ఘనతర గ్రహ తారకా మండలంబు లే
నాతికి నూత్న రత్నాల కాంతి

అమ్మహాదేవి యార్తుల కమృత వల్లి
అఖిల జీవంబులకు జీవ మైన తల్లి
తుని పురంబున వెలసి భక్తుల బ్రోవ
వినుతి గన్న శ్రీవాసవి కన్యకాంబ॥

పవిత్రాత్మ స్వరూపులారా!

శ్రీదేవి చరిత్రము పురాణ ప్రవచనము గాను వేడుకల రూపమునను కాకినాడ, జగన్నాథపురం, బెంగుళూరు కంటోన్మెంటు, చింతామణి, బంగారుపేట, కోలారు, హోసూరులలో జరుపబడినది. శ్రీవాసవాంబ సప్తభజన అయిదు చోట్ల జరిగినది. వాసవి సప్తాహములు చింతామణి, కోలారులలో మాత్రమే జరిగినవి.

తునిగ్రామములో ఆర్యవైశ్యతిలక ప్రియుడైన, అనేక ధర్మసంస్థల నెలకొల్పి ధర్మకార్య మానవ సేవాధురంధరుడై ఆదర్శప్రియుడగు శ్రీయుత బొండాడ నూకరాజు గుప్తగారు శ్రీ అమ్మవారి దేవాలయములో ధ్వజస్థంభ ప్రతిష్ఠ ది1-12-55న దిగ్విజయముగా జర్పిరి. ఈ మహోత్సవమునకు మమ్ముల నాహ్వానించి శ్రీ వాసవీపురాణము చెప్పింప సంకల్పించిరి. ఆ సమయములో నిత్యపూజలు, ఘట్టములు, తెల్పిన వెంటనే తుని ఆర్యవైశ్య శ్రేష్టులు తక్షణం వాగ్దానము చేసి 7-12-55 లగాయతు 27-1-56 తేదీవర్కు శ్రీ వాసవి కన్యకా పురాణముపై తదితర పట్టణములకన్న వర్ణనాతీతమగు భక్తిశ్రద్ధల కనపర్చి నడపిరి. అంత్యమున శ్రీ వాసవీసప్తభజన ఏర్పాటు

చేయుట శ్రీయుత పెనుగొండ లింగయ్యశ్రేష్ఠిగారివంటి పురుషులకు భాగ్యముకాదా! తప్పక కష్టములకోర్చి నిద్రాదేవిని సప్త దినంబులు జయించి భజన చేయగలమని ఒప్పుకొనిరి. తదుపరి ఆర్యవైశ్య భక్తమండలివారి ఉదార సేవా భాగ్యమున ప్రారంభించిరి. మూడవ మారు జరిపిన సప్తాహము సర్వేశ్వరీ ప్రేరణతో తుని సప్తాహవర్ణన వ్రాయబడెను. ఈ గానము పఠన చేసినవారు ఇహపరసౌఖ్యమును పొందెదరు గాక.

వాసవి భజన ఎంతో వింతా
చూచి వర్ణము గారంపి
తుని సప్తాహము వేడుక లన్ని
విన గన సత్తివి గాంచంపి॥ 1

తుని నగరమున సప్తదినంబులు
ఈశుని గాంచే సప్తాహం
ఇంతింత నని వేడుక లలరిన
జేసిన దానికి దెల్పెదను॥ 2

కొప్పర్తివారి వంశోద్భవులు
కళ్యాణగుణముల గరిష్ఠులు
కన్యక పరమేశ్వరి కోవెలకు
శ్రీగాజ నెపి వ్యక్తంపి॥ 3

దేవస్థానము ధర్మకార్యములు
ధర్మయుక్తముగ నడుపుచునూ
ధర్మసంస్థలా శక్రటరీ యగునూ
ధర్మాత్మండై యుండెనుగా॥ 4

అన్నివిధముల పురుషులకన్న
స్త్రీలేమిన్నల (గాత)నియే
అదేరీతిగా వాసవిగాథలో
సేవజేసెనూ స్త్రీమాత॥ 5

తృతీయదినము ఓర్పు నేర్పులతో
గోగుల చిట్టెమ్మను మాత
వాసవి సప్తాహంబులో పాల్గొని
విరివిగ త్యాగము చూపెనుగా॥ 6

విదుర బ్రహ్మచారిణియైన
గౌగుల చిట్టెమ్మ జామాత
కాపుగంటి పాపారావును
భార్యా సత్యవతమ్మయును॥ 7

వయోవృద్ధిని, జ్ఞానవృద్ధిని
విద్యాభివృద్ధియు నేర్పియు
జ్ఞానవృద్ధికై వాసవి ప్రీతిగ
భక్తిప్రపత్తుల చేసెనుగా॥ 8

సూరమ్మా యను సాధ్వీమణియు
సమయమంతులా సోమరాజు
పార్వతి పరమేశ్వరుల రీతిగా
చతుర్థదినమున జరిపిరిగా॥ 9

భక్ష్యభోజ్యముల లేహ్యాశోష్యముల
బహు దివ్యంబగు భోజనము
భజన మాతలకు భక్తులందరకి
భక్తిప్రపత్తుల విందండీ॥ 10

పంచమదినమున పూజచేసిరి
మాంద్రకులోద్భవు లయినట్టి
కొలిమేరుగ్రామ సద్ గృహస్తులు
సత్యానందం శ్రీమాత॥ 11

పుత్రుడు రాధాకృష్ణమూర్తియు
సతీమణీ రవణమ్మయును
రాధాకృష్ణుల రీతిగ వీరు
దేవి అర్చనా జరిపిరిగా॥ 12

బందరు సత్యనారాయణయ్య
పుత్రులయిదుగురు సహానముతో
దివ్యతరంబుగ పూజను జేసి
విందును విరివిగ జేసిరిగా॥ 13

షష్ఠీదినమున సర్వేశ్వరి సేవ
పుత్రులయిదుగురు పట్టుగను
త్యాగము జూపి తన్మయత్వమున
సర్వసేవలు జేసిరిగా॥ 14

సప్తమదినమున సత్యానారాయణాయ్యా
వెలుగూర్ వంశోద్భవుండును
పాయక్ రావ్ పేట దాసరివారి
నాగరాజు శ్రేష్ఠి సేవండీ॥ 15

వాసవి దేవి అగ్నిని జేరి
నిజరూపంబు బొందియును
కైలాసంబున ఈశుని జేరియును
సౌఖ్యసంపదల నలరారే॥ 16

ఈ ఘట్టంబు పురాణమందు
నూతన పద్ధతి జరుపబడె
వాసవి దేవి సంకల్పంబున
తుని నగరమున జరిగెనుగా॥ 17

# శ్రీ వాసవి పురాణములో ముఖ్య ఘట్టములు

## తుని ఆర్య వైశ్య మండలి

— ఉదార సేవా సహన గానము —

శ్రీ కన్యకా పరమేశ్వరి పురాణ ప్రవచన నిమిత్తమై కలశ స్థాపన

### ఊరేగింపు

బొండాడ నూకరాజు గుప్తగారు
భాగవతోత్తాము డగుటచే
బాగుగ సేవాజేసి పుత్రునితో
భవ్యసంకల్పంబున జేసే॥ 1

### వైశ్య పురుషుల విమాన గమనము

వెలుగూర్ సత్యన్నారాయణయ్య
ఎంతో వింతగు ఘట్టంబు
ఎన్నడు గానని వింతవిమానము
ఎంతో వేడుక జేయించే॥ 2

### దక్ష యజ్ఞ దిగ్విజయము

తేలుగుంటా వెంకట్రాజుగారు
తత్వజ్ఞాన కారణమా
తను తా తెలిసెడి జ్ఞానము గలిగె
తన్మయత్వము సేవండీ॥ 3

మ న్మ థ వి జ య ము

నిజరూపంబు చైతన్యంబని
ఖిన్నతనొందని ధైర్యముతో
లాహిరి వస్తువుల్ విషయంబులవి
నంద నందనుని గురి గనెను॥ 4

పా ర్వ తీ ప ర మే శ్వ రు ల క ల్యా ణా ము

పోలిశెట్టి వెంకట్రాజుగారు
పుణ్యపురుషులై ఉండుటచే
పార్వతి పరమేశ్వరుల కల్యాణాము
ప్రజ్ఞతో శీఘ్రమే ఒప్పుకొని॥ 5

కు సు మాం బ కు సు మ శ్రే ష్ఠి వి వా హ ము

పెనుగొండ కామరాజు భక్తుడు
ప్రయత్న పడినా దొరకనిదా
ప్రపంచ రూపిణి మాతా పిత్రుల
పెండ్లి జేసెను దివ్యముగా॥ 6

పు త్రా కా మే ష్ఠి యా గం

బండారు అప్పలరాజు భక్తుడు
భాగ్యంబైనా ఘట్టంబు
బాగుగ పుత్రాకామేష్ఠి చేసి
భవ్యకీర్తిని బొందెనుగా॥ 7

వాసవాంబ కుసుమశ్రేష్ఠికి నిజరూపము జూపుట

పల్లపోతుల వెంకట్రావు
పద్మము బోలిన కన్యకను
పంచయజ్ఞముల గృహస్థుడగుట
ప్రసాద మొందెను ఈశ్వరిచే॥ 8

వాసవాంబ విరూపాక్షుల ఉయ్యాలోత్సవము

దాసరి నాగరాజ శ్రేష్ఠి
దేవీ ఉయ్యాలోత్సవము
దైవప్రీతిగా సేవచేసియు
ధన్యుడాయెను ధరలోన॥ 9

ఉద్యానవనమున వాసవికన్యక నిజరూపము జూపుట

భవిరి శెట్టి నారాయణమ్మ
భళిభళి యనెడి పుత్రిగని
భాగ్యదేవతా వాసవి రూపము
బాగుగ వేడుక జేయించె॥ 10

వైశ్యపురుషుల సభకు వాసవాంబ విశ్వరూపము జూపుట

పెనుగొండప్పలరాజు భక్తుడు
ప్రజ్ఞాప్రతిభల వెదజల్లు
ప్రపంచ రూపిణి వాసవి రూపము
ప్రజలకు వేడుక చూపించె॥ 11

వీరకంకణ ధారణ, కన్యక పూజ

శ్రీమాన్ చక్కా శ్రీరామమూర్తి
శ్రీమంతుండు సాహసుడు
శ్రీకన్యకాంబ సచ్చరిత్రిలా
శ్రేష్ఠఘట్టము చేయించె॥ 12

వైశ్యదంపతుల అగ్నిగుండ ప్రవేశ మహోత్సవము

ఆర్యవైశ్య భక్తమండలి
ఆదరణము ఆనందముచే
అంతిం తనని కైంకర్యంబు
అనాయాసముగ జేసిరిగా॥ 13

వాసవాంబ పట్టాభిషేకము

కట్టారంగనాయకు లనెడి
కర్మరంగము గృహస్తుడు
కల్యాణంబగు పట్టాభిషేకము
కరవు దీరగా గావించె॥ 14

పంచ కలశారాధన

సమయమంతుల పెద గున్నయ్యా
సత్పాత్రికల గన్నారూ
సద్యోఫల సౌఖ్య మిచ్చెడి
సర్వేశ్వరి సేవ బహు చేసె॥ 15

## నౌకా పూజ

మామిడి వెంకట రమణ శ్రేష్ఠి
మించిన ఘట్టము చేయించే
మాయను బాపే నౌకా పూజ
మాటాడకనే ఒప్పుకొనే॥ 16

నవమ దినంబున నాణ్యముగను
చక్కా వెంకయ్య శ్రేష్ఠి గారి
సత్పుత్రుండు సూర్యనారాయణ
శ్రేష్ఠి చేయించె శ్రేష్ఠముగను॥ 17



# శ్రీ కన్యకా పరమేశ్వరీ స్తోత్రమాలిక



ఓం శక్తి ఓం శక్తి ఓం శక్తి ఓం
ఓం శాంతి ఓం శాంతి ఓం శాంతి ఓం

ఇచ్ఛా శక్తి క్రియా శక్తి వాసవాంబా
జ్ఞానశక్తి దివ్యశక్తి కన్యకాంబా
తల్లి వలన జగము లన్ని సృష్టి జెందెను
సృష్టి జెందె తల్లి వలన వృద్ధి పొందెను
ఆదిశక్తి మూర్తులకు ముక్తి కాంత
మూర్తు లంతా దేవి నెపుడు వేడుచుందురు
అమె కరుణ తప్పగానే అంత్య మొందును
అట్టి దేవిని దిట్టముగా నమ్మి కొల్వండి॥



# పొట్టి శ్రీరాముల పాటలు

పావనమూర్తి పొట్టి శ్రీరాములు
దేశసేవకుడు తెలియండి
అతని నిర్యాణముగూర్చి వైశ్యులు
పురాణంబున బాడిరిగా॥ 1

దేశముకొరకై సర్వము వదలి
కీర్తినిలపిన వైశ్యుడుగా
ఆంధ్రుల విజయపతాకంబు
పొట్టి శ్రీరాములు నమ్మండి॥ 2

త్యాగమూర్తియగు పొట్టి శ్రీరాములకు
శాంతిని మీరు బల్కండి
అతని చరిత్రను స్మరించగానే
ఎట్టివారికి వింతలుగా॥ 3

ఆంధ్రులు అమరవీరు లనుటకు
కీర్తినిదెచ్చిన వైశ్యుండు
విజయవాడ పొట్టి శ్రీరాములు
భారత ద్వితీయ పుత్రుడుగా॥ 4

అందరిలోన ఆత్మను దెలసిన
అధ్యాత్మవేత్త యితడండీ
అధ్యాత్మ మర్మము బాగుగదెలసి
నిరసన వ్రతము జేసెనుగా॥ 5

ఇట్టి వ్రతమునుబూని ప్రాణములు
ఆంధ్రుల సుఖముకు త్యజించెగా
ఆంధ్రుల విజయపతాక మితడు
వైశ్య శిఖామణి నమ్మండీ॥ 6

వైశ్య పురాణ శ్రవణములోన
కాకినాడలో ఆంధ్రులును
పొట్టి శ్రీరాముల పాటలు బాడి
వుపన్యాసములు జెప్పిరిగా॥ 7

పురాణ కాలక్షేపము నిలిపి
పొట్టి శ్రీరాముల త్యాగమును
కథకు బదులుగా కాలక్షేపము
కాకినాడలో జరిపిరిగా॥ 8

ఆంధ్రుల హృదయ గృహాంబులందు
శ్రీరాముల ఆత్మజ్యోతియును
వ్యాపించుటచే ఆంధ్రులందరికి
రాష్ట్రము వచ్చును నమ్మండి॥ 9

నమ్మకముండి ప్రయత్నించిన
ఫలితము విఫలము గాదండి
త్యాగముచేత రాష్ట్రంబొచ్చును
ఆంధ్రులు త్యాగము జూపండీ॥ 10





ఏలూరు పాపారావు, ధర్మపత్ని బంగారమ్మ గార్లు
ఆర్య వైశ్య ప్రెసిడెంటు, తుని



పెనుగొండ తిరుపతయ్యగారి కుమారుడు
లింగయ్యగారు, ధర్మపత్ని వెంకటరత్నమ్మగారు





శ్రీ వాసవీ కన్యకా పురాణ మహోత్సవ
సందర్భమున తత్ప్రవర్తకులు యన్. నిఖి
లానందగుప్త మహిళామాత గార్లకు
తూర్పుగోదావరిజిల్లా తునిపౌరవైశ్యశిఖా
మణులు సమర్పించిన

## -- పద్య నవరత్నములు --

రచయిత:- మామిళ్ళపల్లి సూర్యనారాయణశాస్త్రి
కిర్లంపూడి.

వాసవీపురాణము: 7--12--55 తేదీని ప్రారంభింపబడి
27--1--56 తేదీని పవళింపుసేవతో పూర్తి అయినది.



క. శ్రీవాసవాంబరో! నిన్
సేవించిన భక్తతతికి సేమంబులనీ
వేవేళ నొసంగు చుందువు
భావంబునం గొల్చుమమ్ముఁ బాలింపగదే ౧

శా. అమ్మా! శాంకరి! వాసవాంబ! సతతావ్యాజాత్మ శుద్ధిన్ ద్వదీ
యమ్ముల్ మేల్ చరితమ్ములన్ తునిపురస్థాగ్రేసరుల్ వైశ్యులం
దమ్మాఁకీవి వినంగ నిఖిలానందార్యుఁడుం జెప్పడెం
దమ్మందుం గరునించినావు త్రిజగత్సౌభాగ్య సంధాయినీ! ౨

క ఈతఁడె నీయజ్ఞంబును
రాతిరి పవలనక యెంతొరమణన్ మహిళా
మాతరొ! నిఖిలానందా!
ఖ్యాతిఁగఁ జేయించితిరి దయన్ దరియింపన్. 3

శా. శ్రీమచ్ఛిద్ధగనర్షిచంద్రునకు నచ్ఛిష్యత్వముంబూని బల్
ధీమత్త్వంగని సంతతమ్ము గురుభక్తింజేసి కర్ణాట స
చ్ఛీమాంధ్రాభిద దేశముల్ దిరిగి వాసిన్ వాసవీదేవతా
నామాకార విశేషముల్ దెలిపి యానందమ్మునుం గూర్పరే. ౪

య్య గారు, ధర్మపత్ని వెంకటరత్నమ్మ గారు

3

శా. నవ్యంచైతనరారు హెూమములు, సన్మానంబులున్, వ్యాసముల్
భవ్యంబుల్ సమకూర్చు గీతములు, మేల్ పౌరాణికీ గాధలున్.
దివ్యశ్రద్ధయు ధూపదీపములు భక్తిన్ దంపతీపూజలున్
కావ్యప్రస్తుత కీర్తిగాంచె తుని వర్ణ్య ప్రాభవోపేతమై. ౫

మ. ఒకనాడా? మఱిపక్షమా? యొకనెలా? యోచింపగా మాసమా?
ప్రకటంబైచనె నాల్గుమాసములు, వర్ణించు జూడంగ బ్రే
క్షకులా వాక్కి పలుఃల్లసిల్ల, సుమనస్సంతాన మువ్పొంగ, భ
క్తి కరం బెల్లెడలం జెలంగఁ బురిఁ గీర్తిప్రాభవం
బొప్పఁగా ౬

గీ. ఇంతగాబోధఁ జేయు మీరుణముదీర్ప
గొలఁదుఁలమె? నిఖిలానంద గుప్తవర్య!
శ్రీమతి! మహిళామాత్ర సతీమతల్లి!
ఉన్నయంతలో మీకిడ నొప్పుకొనరు
మేరువిడినను గైకొనర్వారు మీరు. ౭

గీ. చంద్రునకు నొకనూలుపోఁచ నిడునట్లు
వైశ్యచంద్రులు మీకు నీపద్యరత్న

ముల నమర్పించినార మమోఘములివి
గొనుడు మీరుస్వార్థ త్యాగఘనతనుంట.

క. ఎక్కడి యాతునిపట్టణ
మెక్కడియా బెంగుళూరు ఋతవాగ్గతితో
నెక్కడికేతెంచిన మీ
కక్కజముగ మ్రొక్కులివియె ఆర్యవతంసా!

తుని,
26-1-1956.

ఇట్లు,
వైశ్య మండలి.



లక్ష్మీప్రెస్, తుని

మ్యా గారు, ధర్మపత్ని వెంకటరత్నమ్మ గారు



బొండాడ నూకరాజుగుప్తగారు, ధర్మపత్ని మహాలక్ష్మమ్మగారు (తుని)
పలుహూరి రామమూర్తిగారు, ధర్మపత్ని అన్నపూర్ణమ్మగారు
ఎన్. నిఖిలానందగుప్తగారు, వీరి కుటుంబము.

బొండాడ సూర్యరాజుగుప్తగారు



తుని శ్రీకన్యకాపరమేశ్వరీ ధర్మసత్రం





# శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ సప్తాహ మహోత్సవ జ్ఞాపకార్థము.

ప్రకాశకులు: శ్రీ ఏలూరు పాపారావుగారు, తుని

## శ్రీమద్భగవద్గీతా ప్రతిభ.

---

1 (కళ్ళు తెరచి కనరా వరస)

గీత గీత యనుడీ గీతా సుగుణ భరితమండీ
వేగమె మోక్షమిచ్చునండీ ॥ప॥

తుచ్ఛమైన దేహం నమ్ము టవ్యర్థమైన భావం
గీతయె త్రోవ చూపు మంత్రం ॥ప॥

సద్గురు వరులచె బోధను వినియూ
సత్య స్వరూపంబును దెలసియునూ
గీతా గీతా గీతా యనుచూ......
గీతను త్రాగీ పదమును త్రిప్పి ॥1॥

త్యాగీ పదమును త్యాగిని జేసీ
త్యాగత్వమునూ వేగమెపొందీ
తత్వమార్గమును బాగుగ దెలసిన.....
తీరని ఆనందం బేనండీ ॥2॥

హరిచే స్వయముగ నాటిగ బడినది
వ్యాసునిచేతా పెంపొందినదీ
శృతి బీజంబిది రత్నప్రాయమూ......
ప్రబోధ యనెడీ మొక్కైనండీ ॥3॥

వివిధంబైనా శాస్త్రములనెడూ
కొమ్మల చేతా కూడగబడినది
శ్రీకృష్ణుని పాదద్వయములకూ........
అలంకరించిన సరోజమండీ ॥4॥

జ్ఞానేశ్వరులకు ముక్తి ప్రదాయిని
చింతామణియే గీతా మాతా
చిద్గగనర్షుల పరిబోధమాతా
శివరాంగుప్తా అర్చిత గీతా ॥5॥

2 (కళ్ళు తెరచి కనరా వరస)

జ్ఞాన జ్యోతి బాగా ఎత్తుడి చెలియలంత వేగా
చిద్గగనార్య ఋషులు రాగా ॥ప॥
గోకుల బృందావన చరులంటూ। మనపాలిటి
సద్గురు వరులంటూ। శిష్యుల చాలా ఉన్నారంటూ
మనకందరకూ నోములపంటా ॥1॥

బలిఘట్ట గ్రామంబున వెలసీ। మద మత్సరముల
నశింపజేసీ। ఏజన్సీలకు భక్తిని జెప్పీ........
బ్రహ్మానందాశ్రమ మేర్పరచీ ॥2॥



పల్లపోతు వెంకట్రావు, సత్తిమ్మగార్లు
శెక్రటరీ: శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానం, అనకాపల్లి.

3.

ప్రాణాయామా యోగము చేతా। మదువు
మధ్యలో శయనించియునూ। భాగవతంబును
బాగుగ చదివీ.... భక్తులకంతా ప్రభోధ జేసీ ॥3॥

లోక శాంతికని సంకల్పించీ
బహ్మానందాశ్రమమును జేరీ
చాతుర్మాస్యా దీక్షనుబూనీ........
గీతోపన్యాసంబులు జెప్పీ ॥4॥

భక్తులందరితో దీక్ష ముగించీ
గీతా సంఘంబుల నేర్పరచీ
శివరాంగుప్తా హృదయాబ్జమునా........
వెలసిన గురువర మహానుభావా ॥5॥

3 (బృందావనమది అను వరస) నారీమణులకు నీతి

ముద్దుల పుత్రీతోయజ నేత్రి సత్య సుశీలా సావిత్రీ ॥ప॥
నిర్మలమైనా నీతులుజెప్పెద బాగుగ వినవేనాతల్లీ ॥అ.ప॥
పుట్టిన యింటికి అత్త గృహముకు। నీవేకీర్తిని తేవాలీ।
అత్త మామల సేవయె మాదీ।
పతి అజ్ఞే దైవపు ఆజ్ఞా ॥1॥

# 4.

నీ పతి నడతల మాటలయందూ।
సందేహంబును పడబోకూ।
చెడుపగు త్రోవల నడచిన నీవూ।
సహన శీలము చూపాలీ ॥2॥

ఇరుగు పొరుగూ వారితో కబుర్లు
మితమున విడచుట సతి ధర్మం
డబ్బును వృథాగ కర్చు పెట్టకు
సద్గృహకృత్యమునడు పాలీ ॥3॥

అరుణోదయమునకు ముందుగ లేవుము।
పగటిలో నిద్రను మానాలీ।
ధనవంతులమని మురియగ బోకూ
భారత మాతా సత్పుత్రీ ॥4॥

మీరా ద్రౌపతి, పార్వతి రుక్మిణి।
సతి అనసూయా సావిత్రీ।
సక్కుబాయీ కస్తూరీబాయి।
పాతివ్రత్యము నడుపమ్మా ॥5॥

భారత దేశపు కీర్తియునీదీ।
భారత జ్యోతీ నీవమ్మా।
భాగ్యము ధనమూ అశాశ్వతంబూ।
కీర్తియె శాశ్వత మైనదిగా ॥6॥

యన్.యన్. శివరామగుప్తగారురచించి మైసూరు దేశము కు వెళ్ళు వేళ వినుపింపగా ఈ ఉదారులు ముద్రణ వేయించిరి. వీరికిభక్తిజ్ఞానములుగలుగుగాక! ఇట్లు: N. నిఖిలానందగుప్త.

---

మల్లిక్ ప్రింటింగ్ వర్క్సు, తుని. 25—1—56

# శ్రీ వాసవికన్యకా పురాణ తో హారాగానము

ఓం  ఓం

శ్రీ కన్యకాపరమేశ్వరీ ప్రసన్నము

## శ్రీ వా స వాం బ స్తో త్ర ము

శ్లో॥ కైలాసాచల సన్నిభే గిరిపురే సౌవర్ణశృంగే మహా
స్థంభోద్యత్ మణిమంటపే సురతరు ప్రాంతేచ
సింహాసనే ఆశీనాం సకలామరార్చిత పదాం
భక్తార్తి విధ్వంసినీం వందే వాసవకన్యకాం
స్మితముఖీం సర్వార్థదా మంబికాం ॥

1. నమస్తే వాసవీదేవి ♦ నమస్తే విశ్వపావనీ
నమస్తే వ్రతసంబద్ధా ♦ కౌమారీ తే నమోనమః

2. నమస్తే భయసంహారీ ♦ నమస్తే భవనాశినీ
నమస్తే భాగ్యదాదేవి ♦ వాసవీ తే నమోనమః

3. నమస్తే ధృతసంధానా ♦ నమస్తే భద్రరూపిణీ
నమస్తే పద్మపత్రాక్షీ ♦ సుందరాంగి నమోనమః

4. నమస్తే విబుధానందా ♦ నమస్తే భక్తరంజనీ
నమస్తే యోగసంయుక్తా ♦ వణిక్కన్యా నమోనమః

5. నమస్తే బుధసంసేవ్యా ♦ నమస్తే మంగళప్రదే
నమస్తే శీతలాపాంగి ♦ శంకరీ తే నమోనమః

6. నమస్తే జగన్మాతా ♦ నమస్తే కామదాయినీ
నమస్తే భక్తనిలయా ♦ వరదే తే నమోనమః

7. నమస్తే సిద్ధసంసేవ్యా ♦ నమస్తే చారుహాసినీ
నమస్తే ధృతకళ్యాణి ♦ శర్వాణీ తే నమోనమః

8. నమస్తే భక్తసంరక్ష ♦ దీక్షాసంబద్ధ కంకణా
నమస్తే సర్వకామార్థ ♦ వరదా తే నమోనమః

శ్లో॥ దేవీ ప్రణమ్య సద్భక్త్యా ♦ సర్వకామార్థ సంపదాన్
లభతే నాత్రసందేహో దేహాంతే ముక్తిమాన్ భవేత్

——•••——

# ఇష్టదేవతాది ప్రార్థనము

ఉ. క్షోణితలంబు నెన్నుదురు
సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ
సుందర వేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ
చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుక
వారిజపుస్తకరమ్యపాణికిన్.

శా. తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకముచే
తం బూనితిన్ నీవు నా
యుల్లంబందు నె నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కునను సం
ప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ
పూర్ణేందుబింబాననా.

చ. జలనిధి కన్యకాఘునకు
చస్థలిపచ్చలతాళి గోపికా
విలసితహారమధ్య మణి
విశ్వజగద్వ్యలయ ప్రకాశకో

స్ఫురలమహనీయరత్న మని
వారిత కాళియ భోగిభోగమం
డలగిరినజ్రిమై వెలయు
సంతతమూజు భజింతు నామదిన్.

౬. శారద నీర దేందు ఘన
సార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజ
తాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సిత
తామర సామరవాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ
గానఁగ నెన్నఁడు గల్గు భారతీ!

౭. అంబ నవాంబుజోజ్జ్వల క
రాంబుజ శారదచంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రక
టస్ఫుటభూషణ రత్నదీపికా
చుంబితదిగ్విభాగ. శ్రుతి
సూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబరవీధి విశ్రుతవి
హారిణి నన్ గృపఁ జూడు భారతీ!

ఉ॥ అమ్మలఁ గన్నయమ్మ ముగు
రమ్మలమూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మ కడు
పాఱడిఁ బుచ్చినయమ్మ తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మ
నమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మ
హత్త్వకవిత్వ పటుత్వసంపదన్.

మ. హరికిం బట్టపుదేవి పున్నెములప్రో
వర్థంపుఁ బెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్
తో నాడుపూఁబోఁడి తా
మరలం దుండెడిముద్దరాలు జగముల్
మన్నించునిల్లాలు భా
సురతన్ లేములు వాపుతల్లి సిరి యి
చ్చున్ నిత్యకల్యాణముల్.

ఉ. నమ్మితి నామనంబున స
నాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల
మేలు భజింతుఁ గ దమ్మ మేటిపె

ద్దమ్మ దయాంబురాశివి గ
దమ్మ హారిం బతిఁ జేయు నమ్మ నిన్
నమ్మినవారి కెన్నఁడును
నాశము లేదు గదమ్మ యీశ్వరీ.

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప నమయిం
పఁజాలు సామర్థ్యముల్
బ్రహ్మోపేంద్ర నగేంద్ర చాపులకు సం
పాదించుచున్ వారికిన్
బ్రహ్మాత్మైక్య వివేకమిచ్చుచును సం
భావించుచున్ బ్రోచు నా
బ్రాహ్మీ మంగళదేవతా గిరిజలన్
బ్రార్థింతు నశ్రాంతమున్



# శ్రీ వాసవి కన్యకా పురాణ తోహరాగానము

## ప్రథమో ఽ ధ్యాయః

గణపతి ప్రార్థన ముందుగ జేసి
భారతీదేవిని గొనియాడి
భాగ్యవంతులౌ వైశ్యభక్తులకు
భావంబులనూ దెలిపెదను॥ 1

చదువరిగాను శాస్త్రము దెలియదు
కవిత్వమసలె యెరుగనుగా
చిద్గగనార్యుల చింతనజేసి
వ్రాసెదనేనని దెలియండి॥ 2

కర్మము, కాయము, కలమూ దేవిది
కారణకార్యము లన్నియును
వాసవిదేవియె చేయించెనని
వైశ్యులు వివరము గనరండి॥ 3

వైశ్యులపాలిటి వాసవిదేవి
పురాణమిపుడు పాటలుగా
తునినగరమున కన్యకాంబయె
రెండవమారు కల్పించె॥ 4

తునినగరమున కన్యకాంబయె
కన్యకపరమేశ్వరీ సత్రిం
ఆవరణంబున ఆవేశించి
ఆదర్శంబుగ జేయించె 5

తునినగరమూన అమ్మలు అయ్యలు
ఆదరంబుగ వేడుకతో
వాసవిపూజలు వరుసగ జేసి
వన్నెకెక్కిరీ వింతగనూ॥ 6

వైశ్యులారా వాసవిచరితము
పాటలు బాగుగ బాడుచునూ
వాసవి దేవి పూజలు జేసి
పుణ్యవంతులై ప్రబలండీ॥ 7

తునినగరమున ఈ పురాణము
కాలక్షేపము సమయమునా
నల్లపేట రామయ్య శ్రేష్ఠి
రెండవముద్రణ సంకల్పం॥ 8

వైశ్యులారా వాసవిచరితము
భక్తితో మీరు వినరండీ
వినినవారికి కైలాసంబున
స్థానముండును నమ్మండి॥ 9

అంబా అంబా అంబా అంబా
అంబా అంబా యను మనసా
అంబా అంబా అంబా యనిన
ఆపద దీరును ఓమనసా॥ 10

దేవీ దేవీ దేవీ దేవీ
దేవీ దేవీ యను మనసా
దేవీ దేవీ దేవీ యనినా
ధన్యులమగుదుము ఓ మనసా॥ 11

కాళీ కాళీ కాళీ కాళీ
కాళీ కాళీ యనరండీ
కాళీ కాళీ కాళీ యనిన
కోర్కెలు దీరును నమ్మండీ॥ 12

మాతా మాతా మాతా మాతా
మాతా మాతా యను మనసా
మాతా మాతా మాతా యనిన
మర్మము దెలియును ఓ మనసా॥ 13

చెండీ చెండీ చెండీ చెండీ
చెండీ చెండీ యనరండీ
చెండీ చెండీ చెండీ యనిన
చింతలు దీరును నమ్మండీ॥ 14

దుర్గా దుర్గా దుర్గా దుర్గా
దుర్గా దుర్గా యను మనుసా
దుర్గా దుర్గా దుర్గా యనిన
దోషము తొలగును ఓ మనసా॥ 15

బాలా బాలా బాలా బాలా
బాలా బాలా యను మనసా
బాలా బాలా బాలా యనిన
భాగ్యము గల్గును ఓ మనసా॥ 16

గౌరీ గౌరీ గౌరీ గౌరీ
గౌరీ గౌరీ యనరండీ
గౌరీ గౌరీ గౌరీ యనిన
జ్ఞానము గల్గును నమ్మండీ॥ 17

త్రిపురా త్రిపురా త్రిపురా త్రిపురా
త్రిపురా త్రిపురా యను మనసా
త్రిగుణదోషములు పోవలెనంటె
దేవిని స్మరణా జేయండీ॥ 18

కన్యక కన్యక కన్యక కన్యక
కన్యక కన్యక యను మనసా
కన్యక కన్యక కన్యక యనిన
కర్మము తొలగును ఓ మనసా॥ 19

పరమపావనము పుణ్యానిలయము
నైమిశారణ్యా నామకము
పుణ్యక్షేత్రమునందున వింత
మహాత్ములారా వినరండీ॥ 20

వైరములేని మృగజాతులును
దట్టమైన బహువృక్షములు
ఫలపుష్పంబులు విరివిగనుండు
అన్నికాలముల ఫలించుననూ॥ 21

ఇట్టివనమునా బ్రహ్మావిదులగు
వసిష్ఠ గాలవ వ్యాసుండు
శరభంగుండు శక్తి శుకుండు
శతానందుడు గౌతముడు॥ 22

అధికజ్ఞానము శ్వేతకేతువు
చవనుడు భృగువు అత్రియును
ఆపస్తంబుడు మాండవ్యుండు
తిత్తిరికపిలుడు కణాదుడు॥ 23

విశ్వామిత్రుడు మైత్రేయుండు
కుద్దాలకుడు కపిలుండు
సుతీక్ష్ణుండు తిత్తిరిఋషియు
శౌనకుడాది మహర్షులూ॥ 24

దీర్ఘయాగము జేయుటకొరకు
గోమతినామము నదివద్ద
గుంపులుగూడి యోచించిరిగా
ఆసమయంబున ఈ వింతా॥ 25

కృష్ణాజినము నార చీరలు
నాణ్యాంబుగను ధరించియు
భస్మోధారణ దేహకాంతియు
శివునిబోలినా సూతుండు|| 26

వచ్చుచుండు టా ఋషులుగాంచియు
ఎదురుగబోయీా తలవంచి
అర్ఘ్యము పాద్యము ఇచ్చినవారై
ఉచితాసనమున వుంచియును|| 27

మహామతియగు సూతా నీచే
ప్రాచీనములగు పురాణముల్
చెవులకు ఇంపుసొంపుగ మేము
వినిన పురాణములివిగావా|| 28

భాగవతంబు బ్రహ్మకై వర్తము
బ్రహ్మపురాణము బ్రహ్మాండం
భవిష్యోత్తరము మత్స్యపురాణము
నారద మార్కాండేయంబు|| 29

విష్ణుపురాణము అగ్నిపురాణము
వామన వాయవ్యంబులను
వరాహా కూర్మము లింగము పద్మము
గరుడస్కాంద పురాణముల్ || 30

పదిపురాణముల్ శివపరంబుగా
నాల్గుపురాణాల్ విష్ణుపరం
రెండుపురాణాల్ బ్రహ్మపరంబే
సూర్యాగ్నులువి రెండుండు॥ 31

అష్టాదశ పురాణంబులలో
స్కాందపురాణం విచిత్రము
అందులో ఉత్తర భాగమునందు
నీతినియమము కథలుండు॥ 32

సనత్సుజాత సంహితయందు
వైశ్యవంశము చరిత్రము
సంక్షేపముగా జెప్పియుంటివి
విరివిగ మేము విందుమనా॥ 33

భక్తిశ్రద్ధగా వినిన గోరిన యా
శౌనకుడా దీ రుషులకును
సూతుడు వైశ్యవంశ చరిత్రను
జెప్పుటకొరకై ఇటుజేసె॥ 34

ఓమునులారా మీరు సమస్తము
దెలసి అధికులునై యుండి
నాపైనున్న వాత్సల్యమునా
నాతో విన నిపు డడిగితిరి॥ 35

పవిత్రమైన వాసవిచరితము
బుద్ధికిదోచిన వక్తవ్యం
విస్తారముగా దెలిపెదనయ్యా
మహాత్ములారా వందనముల్॥ 36

చిత్స్వరూపుడగు పరమాత్మకును
వ్యాసదేవునికి ప్రణామముల్
వాణీగణపతి త్రిమూర్తులకును
నావందనముల్ ఇకవినుడూ॥ 37

ఇది స్కాందోత్తర ఖండము నందలి సనత్సుజాత సంహిత యందు వైశ్యవంశ చరిత్రగూర్చి శౌనకాది మహర్షులు సూతుని ప్రశ్న జేయుట.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## ద్వి తీ యో ఽ ధ్యా యః

శౌనకులారా శ్రిద్ధగమీరు
ఏకాగ్రిమున వినుడనియు
సూతమహర్షి ఇట్లుజెప్పెను
గోదావరినది తీరమునా॥ 1

జితేంద్రియుండు శాంతస్వరూపుడు
సర్వధర్మముల నేర్పరియు
శిష్యులగూడి సర్వవేదములు
పఠనపాఠనాల్ జేయునుగా॥ 2

సాలంకాయనఋషి ఆశ్రిమము
చూతవృక్షముల ఆవృతము
కలకల కూసెడి పక్షులగుంపులు
ఝుం అను తుమ్మెద సమూహము॥ 3

అలపరంపరల ఆడెడి హంసలు
సామగానము కోయలలు
బ్రిహ్మసూత్రిముల పలికెచిలుకలు
రమణీయంబగు ఆశ్రిమము॥ 4

ఈఆశ్రిమముకు నొకసమయమునా
సత్యవంతులు శాంతులును
జితేంద్రియులును వేదవిదులగు
వైశ్యమహర్షులు రాగానూ॥ 5

పండితుడైన ఋషివరుడపుడు
మణిగుప్తాది వైశ్యులను
విధ్యుక్తంబుగ ఆహ్వానించి
తియ్యనిమాటల నిట్లనియె॥ 6

మహాత్ములారా కుశలమ మీకు
మీరొచ్చుట నేధన్యుడను
ఎచటికిబోవుచు, ఇచటికొస్తిరని
సాలంకాయనఋషి అడిగె॥ 7

మణిగుప్తుండు మొదలగువైశ్యులు
మిక్కిలి సంతసమును జెంది
ఋషినిగాంచియు ఇట్లుబల్కిరి
మునిశార్దూలమ కృతార్థులు॥ 8

బహుజన్మములా తపఃఫలమునా
మీదర్శనము మాకబ్బె
కామధేనువు కల్పవృక్షము
చింతామణి సన్నిధియనిరి॥ 9

పలుకునేర్పరులు వైశ్యవర్యులు
కొందరు ఇట్లు వినుమనిరి
బ్రహ్మకుండమునుండియు మేము
వెడలి క్షేత్రములు దర్శించి॥ 10

అటుపై వెడలి హేమకూటము
పారియాత్రము మేరువును
వింధ్యము క్రౌంచము వెంకటాద్రియు
గంధమాదనా హిమవంతం॥ 11

పర్వతంబులా కంధరంబులు
గొప్పవృక్షముల దృశ్యమును
సిద్ధసాధ్యగంధర్వుల గాంచుచు
అటుపై తిరుగుచు మునిగితిమి॥ 12

పావనమైన గంగాయమునా
శారద రేవ చర్మణ్వతి
సింధు శరావతి చంద్రభాగయు
గోమతినర్మద కావేరీ॥ 13

కృష్ణ పినాకి తామ్ర పర్ణి నది
సముద్రంబులా స్నానములు
చేయుచు తిరుగుచు గౌతమి స్నానము
చేయుటకై మేమొచ్చితిమీ॥ 14

ఓమునిశ్రేష్ఠా! మాభాగ్యమునా
జన్మరాహిత్య కారణమౌ
మీపద కమలాల్ గంటిమిగాన
సర్వఫలితముల్ గల్గెనని॥ 15

పులకాంకితులై గద్గదస్వరమున
హర్షాశ్రులచే కపోలముల్
తడియుచుండ ఆనందమునా
మణిగుప్తాదులు ఇట్లనిరి॥ 16

కలియుగంబునా వైశ్య వంశము
ఎట్లు పరివర్తించునో మరియు
వైశ్యవంశముకు అగ్నిప్రవేశము
అటుపై వైశ్యులవర్తనము॥ 17

నూటారెండు గోత్రములెట్లు
నిర్ణయమాయె యాకథను
కూలంకషముగ జెప్పుట తమరే
అర్హులుయని ప్రార్థింపగనూ॥ 18

సాలంకాయనరుషి సంతసమున
వైశ్యులు వినుడని వినయమునా
యోగ్యమైనది పాపహారియు
సకలసంపదల నిచ్చునది॥ 19

ఈపుణ్యంబగు పురాణకథను
విని వినిపించిన పాడిననూ
వారిచేతిలో కల్పవృక్షము
చింతామణి ధేనువులుండు॥ 20

కృతయుగంబునా శుంభుని శుంభులు
మహిషాసురుని ద్రుంచియును
త్రేతాయుగమున దృష్ఠరాజుల
జంపియు పరశునిమాతయగుచూ॥ 21

ద్వాపరయుగమున కృష్ణసోదరై
కంసాసురుని ద్రుంచియునా
మహాశక్తియే కలియుగంబునా
కుసుమశ్రేష్ఠికి కూతురుగా॥ 22

వాసవికన్యక నామంబునను
వైశ్యవంశము రక్షణకు
విష్ణువర్ధనునిద్రుంచి వైశ్యులా
కైలాసంబు జేర్చెనుగా॥ 23

వాసవిచరితము విచిత్రమైనది
మీశ్రేయస్సుకు జెప్పెదను
వినుడు వైశ్యులని సాలంకాయన
ఋషి దెల్పినదే ఈకథయు॥ 24

మణిగుప్తాది వైశ్య ఋషులు సాలంకాయన ఋషిని వైశ్యవంశ వృత్తాంతము అడుగుట.



# శ్రీ .వాసవికన్యకా పురాణ తోహరాగానము

## తృ తీ యో ఽ ధ్యా యః

పూర్వ కాలమున ఆది శేషుడు
పాతాళమున ఈచరితం వర్ణనగా
ధర్మనందనుడను వైశ్యోత్తమునికి
ఈచరితంబె దెల్పెనుగ॥ 1

దేవతలందరు వినుచు నుండగా
నారదమునియు విని వచ్చి
నాకు దెల్పెను ఈచరితంబు
ఇంత వరకు నేదాచితినా॥ 2

ధర్మనందనుడు ఆది శేషుడూ
పాతాళంబున ఈచరితం
సంవాదంబు జరుగుట జూడా
పరమాశ్చర్యం బైనదిగా॥ 3

ఆది శేషుడు చెప్పిన చరితము
విశేషంబుగా దెలుపు డనా
సాలంకాయన ఋషి దివ్యముగా
వైశ్య ఋషులకు వివరించే॥ 4

ఆర్యావర్తా పుణ్యభూమిలో
నర్మదా నదీ తీరమునా
ప్రతిష్ఠాన మను పురంబు నందు
ధర్మండను వైశ్యుడు గలడు॥ 5

ధర్మాఖ్యుండు దానధర్మముల
అగ్రగణ్యుడై మెలగుచును
పున్నతభవనము భోగభాగ్యముల
అన్నిగలిగియు శోకకారత॥ 6

పుత్రులు లేకా పరితపించుచు
యమునానది తీరముజేరి
అచ్చట భూమింజయుడను ఋషిని
ధర్మాఖ్యుండుగని వేడె॥ 7

మహాత్మ నాకు పుత్రులు లేరు
మీదయచేత గల్గవలె
ఏమిదెల్పినా అటుజేతునని
పరిపరివిధముల ప్రార్థించె॥ 8

సరళ స్వభావము ధర్మాఖ్యుని గని
ఈరీతిగను వినుపించె
దివ్యదృష్టితో జూచితి నేను
ఇట్లు జేసినా ఫలమనియె॥ 9

కార్తీకమాసము త్రయోదశిలో
ప్రారంభించుము ఈవ్రతము
ఏక వత్సరము అనుష్ఠించినా
పుత్రుడగునని దెల్పెనుగా॥ 10

ధర్మాఖ్యుండు భార్యతో గూడి
యమునానది తీరంబుననూ
పర్ణకుటీరము నిర్మించియును
ఈవిధదీక్ష జేసెనుగా॥ 1

బ్రహ్మచర్యము ఏకభుక్తము
దర్భపాన్పుపై పరుండుటా
కృష్ణమూర్తికి షోడశపూజ
శ్రద్ధాభక్తుల సల్పెనుగా॥ 12

వత్సరాంతమున వోకదినంబునా
స్వప్నములోన అచ్యుతుడు
సిద్ధసాధ్య గంధర్వ మునులతో
ప్రత్యక్షంబై అగబడెను॥ 13

లక్ష్మీనాథునిగాంచి ధర్మాఖ్యుడు
దండప్రణామములను జేసి
తులసీహారము మెడలో వేసి
బహుప్రార్థనలా జేసెనుగా॥ 14

స్వప్నము లోనే ధర్మాఖ్యుని గని
వరము కోరుమనె విష్ణువుగా శ్రీధరుడు
ధర్మాఖ్యుండు పుత్రునిగోరా
అనుగ్రహించి వెళ్ళెనుగా॥ 15

ధర్మాఖ్యునికి మెలుకువగల్గి
భార్యతో వివరము దెల్పియును
మాభాగ్యమని వుభయులు వెడలి
తమ పట్టణము జేరిరిగా॥ 16

వెంటనె భార్య గర్భము దాల్చి
మహాకళలతో నొప్పెనుగా!
ధర్మాఖ్యుండు శ్రీమంతంబు
బహు వేడుకతో జరిపించే॥ 17

నవమాసంబులు నిండగ భార్య
శుభముహూర్తమున ప్రసవించే
వార్తను వినియు సచేల స్నానము
ధర్మాఖ్యుండు జేసియును॥ 18

విధవిధదానాల్ విప్రుల కొసగి
జాతకర్మముల్ జేయించి
నామకర్ణ మహోత్సవంబునా
సభికుల ఆజ్ఞ అడిగెనుగా॥ 19

సభికులు విప్రులు యోచించుచును
నిశ్చేష్టితులై యుండగను
అంతలో అంతర్వాణి బల్కెను
ధర్మనందుడని నామ మనె॥ 20

విప్రులు వెంటనె ధర్మనందు డని
నామకరణము జరుపగను
విరివి దానముల్ విందులు జరిపె
ధర్మాఖ్యుం డుత్సాహామునా॥ 21

ధర్మనందనుడు సాధుశీలుండై
బాలచంద్రుని వలె పెరుగగను
పండ్రెండేండ్లలో ఉపనయనంబు
విధ్యుక్తంబుగ జరిపిరిగా॥ 22

అటుపై ధర్మాఖ్యుండు పుత్రుని
విద్యాభ్యాసము జేయుటకు
భార్గవ వంశము చవన మహర్షికి
అప్పగించెను సుపుత్రుని 23

ధర్మనందనుడు బహు వేడుకతో
నాల్గువిధములా గురుసేవా
ఆశ్రమంబుకు ఫలపుష్పాలు
సమిధలు దర్భలు దెచ్చెనుగా॥ 24

సర్వవిద్యలు స్వల్పకాలమున
నేర్చిన శిష్యుని గాంచియును
గురుడు శిష్యునితో ఇట్లు బల్కెను
నీగృహంబునకు జనుమనెనూ॥ 25

ధర్మనందనుడు ఓగురువర్యా
మీసన్నిధినే వుందునుగా
తల్లితండ్రుల ఆజ్ఞని నుడివి
సేవజేయుచు నుండెనుగా॥ 26

మహనీయంబు ధర్మప్రదంబు
కీర్తి పుణ్యములు ఇచ్చునదై
వంశ సంతాన వృద్ధిని ప్రసాదించెడి
ఈకథ విన దుఃఖము దొలగూ॥ 27

ఆదిశేషువు ధర్మపుత్రునకు జెప్పుట. ధర్మనందనుని చరిత్ర, విద్యాభ్యాసము, గురుసేవ.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## చ తు ర్థో ఽ ధ్యా యః

ధర్మనందనుడు వొక సమయంబున
సమిధలు పుష్పంబుల కొరకు
గొప్ప అడవికి పోయిన వాడై
ఫలపుష్పంబుల వెదకుచును॥ 1

సమిధలు కొన్ని మోపు కట్టియు
సంగ్రహించియు ఫలములను
పువ్వులు త్వరత్వరగాను గోయుచు
బుట్టలో వోయుచు నుండగను 2

భయంకరంబగు ఆర్తధ్వని విని
ఇటునటు అడుగుల వేయుచును॥
ఏకాగ్రమునా ఆలకించగా
ఈ శబ్దంబులు వినబడెను॥ 3

ఓ కిరాతుడా! విప్రుడ నేను
అంగీరసుడు నా పేరు!
తీర్థసేవాతత్పరుండను
బాధింపకు మని వినబడెను॥ 4

ధర్మనందనుడు దీనాలాపాల్
విని ధర్మంబులు దలపోసి
అచటికి పోవ నిశ్చయించియు
కృష్ణాజినము కప్పుకొని॥ 5

నడుముకు వస్త్రము బిగించుకొనియు
చేత కోలను బట్టుకొని
పూలబుట్టను కొమ్మకు వేసి
త్వరత్వరగాను పరుగిడుచు॥ 6

వృక్షమునుండి మరియొక వృక్షము
అడవినుండి యింకొక యడవి
దుర్గమయడవి వింధ్య సమీపము
విప్రుని వద్దకు జేరియును॥ 7

దుఃఖించుచును ధర్మనందనుడు
లుబ్ధని గాంచి ఇట్లనెను
మూర్ఖా! పాట! నరాధముండా!
ఈ విషయము నీ వెరుగవుగా॥ 8

అందరిలోన విప్రులు శ్రేష్ఠులు
విప్రులందు వేదములు
వేదంబులలో దేవత లుందురు
విప్రులు దేవతులొకటేగా 9

అప్పుడైనను బుద్ధివంతుడై
క్షమాపణంబున పూజించి
సుఖవంతుడవు కమ్మనగానే
వ్యాధుడు క్రోధముతో ఇట్లు 10

పిల్లవాడవై దుర్బుద్ధివినై
    నిర్భయంబుగా బలికెదవా
వీనితోపాటు నీ ప్రాణములా
    యిపుడె దీసెద చూడు మనా? 11

మంచిది వ్యాధా? అట్లె జేయుము ?
    విప్రులు గోవుల కొరకెవరు
ప్రాణము విడచిన బ్రహ్మ
    లోకమని మనువుచేతనే వింటినినా 12

ఈమాటలకు కిరాతు డపుడు
    ధర్మనందుపై దయగల్ల (తోడా)
నీకు పూజ్యుడు బ్రాహ్మణుడైనా
    నామర్యాదా వినుమనెను 13

వింధ్య పర్వతము కంధరంబునా
    మా కుల దేవత శక్తికినై
ప్రతి వత్సరము నరబలి యిచ్చుట
    మా కుల ధర్మము దెలియుమనె 14

ధర్మనందనుడు ఈ పలుకులు విని
    ఆంగీరసుని విడిపించి
పాశంబులను మెడను వేసుకొని
    దేవికి నను బలి యివ్వుమనే 15

ధర్మనందనుని కిరాతు డపుడు
వెంట నిడుకొని వెళ్ళుచును
దారిలో మృగముల జంపుచు వాటిని
శిరము భుజములా పైనుంచి 16

ఘోర మృగంబుల అడవిలో నడువగ
మధ్యాహ్నంబు ఆయెనుగా
సూర్యుడు మిట మిట మండుచుండగా
ధర్మనందనునికి యిట్లాయే 17

ఆకలిదప్పిగల్గిన వాడై
కంఠ శోషణతో శ్రమగల్గి
వ్రాలుచు పృథివిపై బడె వ్యాధుడు
కొరడచె గొట్టుచు గదరించి 18

దుష్టబుద్ధి కులాధముండా
నడువు నడువుమని శీఘ్రమని
భయంకరంబగు వాక్యంబులచే
బర బర బాలుని లాగెనుగా॥ 19

ముండ్లలో రాళ్లలో త్రిళ్లతో లాగగ
బాలుడు వ్యాధుని బ్రతిమాలి
నడువగ లేక శ్రమంబు చేతా
మరలా మూర్ఛితు డాయెనుగా॥ 20

మూర్చ దేరియు ధర్మనందనుడు
వ్యాధుని బ్రతిమాలుచు తనలో
కర్మఫలంబు అనుభవింతు నని
గురుధ్యానంబున నుండగనూ॥ 21

ఆ సమయంబున ఆకాశమున
ధూళిధూసరిచె గప్పబడె
నేమని గాంచ ఆశ్చర్య మగు
కిలకిల ధ్వనులు వినబడెను॥ 22

వేటకి నిమిత్తము రాజు వొచ్చి రని
కటకట బాలుడ ఏమి కని
రాజు మనల గాంచిన నిప్పుడే
సంహారించును నిజమనియు॥ 23

ధర్మనందనుని పాశబంధముల
వదలించియు వొక బిలంబునా
వుంచిన వాడై నే నొత్తు నని
రాతిని గప్పె ద్వారముకు॥ 24

అచట నుండక వ్యాధుడు పరుగిడి
పోయి వృక్షము నెక్కియును
చెట్టుకొమ్మలలో దేహాము దాచి
కదలక లుబ్ధుడు దాగెనుగా॥ 25

మహనీయంబు కీర్తిప్రదంబు
బలప్రదంబు పరిశుద్ధం
రహస్యమైన పూర్వపు కథను
విని పఠించినా పుణ్యుల నే॥ 26

ధర్మనందనుని దుఃఖము. దైవీకముగా విపుదల. కిరాతుని నిర్దయయు.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

పంచమో౽ధ్యాయః (5)

వైశ్యులు సాలంకాయన మునిని
ఈ రీతిగను అడిగిరిగా!
ఆ రాజెవ్వడు? ఎందుల కడవికి
వొచ్చెనో మాకు దెల్పు డనా॥

సాలంకాయన ముని వివరించె
శ్రద్ధగ వినుడి శ్రోతలని
మగధ దేశపు రాజగు భద్రుడు
వేటాసక్తతో విటనముకు॥ 2

వివిధ సైన్యము ధనుర్ధారులగు
కిరాత సంఘంబుల తోడా
వేటకుక్కలు వస్తుజాలముల
వేటి నిమిత్తము బస జేసె! 3

ఆ సమయమునా పరిజను లందరు
వివిధ మృగములా వధించియు
ధనములు వస్త్రాలు భూములు మొదలగు
బహుమతు లొందిరి భద్రునిచే॥ 4

రాజు స్వయముగా వేటాడగను
భటులు భేషని పొగడిరిగా
ఆ సమయంబున గుంపులో చెదరి
పరుగిడి [illegible] యెను కుందేలు॥ 5

రాజు చలమునా గుఱ్ఱము నెక్కి
శశము వెంబడి వేగముగా
పరుగిడి పోయి శశమృగంబును
వింటిచె వధించి రాజంత॥ 6

రమ్యంబైన వృక్షము క్రింద
విశ్రమింపగా భటసంఘం
మంత్రి వచ్చియు మనోహరంబగు
పానీయంబుల నిచ్చియును॥ 7

మృదు మధురంబగు వాక్కుల బాగడి
భక్ష్యభోజ్యముల బెట్టిరిగా
రాజు శయ్యపై పవళించియును
వృక్షము బాగా పరికింప॥ 3

చెట్టున దాగిన దుష్టకిరాతుడు
రాజశ్రేష్ఠుని కంట బడె
భద్రుడు వ్యాధుని చురచుర జూచుచు
ఆశ్చర్యముతో ఇటు బల్కె॥ 9

ఆహా! ప్రాణుల హింస? కిరాతా!
భద్రుడు బ్రతికి యుండగను
యిందున దాగి జీవించుటకు
నీకు శక్యమా యని బల్మె॥ 10

క్రోధము జెంది భటుల గాంచియు
శీఘ్రమె జంపుడు లుబ్దు ననా
భటులు వెంటనె ఆయుధంబులా
బాధించిరి బహ్రాకిరాతుని॥ 11

కిరాతు డుగ్రుండై సైన్యములపై
శూలము కత్తుల బాణములా
రాజభటులపై ప్రయోగించగా
భద్రుడు కఠిన చిత్తమునా॥ 12

కరుకు గల్గినా అర్ధచక్రము
ధనస్సు నందు సంధించి
ఆకర్ణాంతము లాగి విడువగా
కిరాతు హృదయము ఛేదించె॥ 13

అయ్యో యనుచు కిరాతు డపుడు
మృతుడై భువిపై బడగానే
భటు లందరును భళిభళి యనిరి
రాజు శాంతుడై వెడలెనుగా॥ 14

భృగువంశమునా శ్రేష్ఠుండైనా
చ్యవన మహర్షి శిష్యులలో
ధర్మనందనుని గానక భిన్నత
వెదకగ శిష్యుల బంపెనుగా॥ 15

శిష్యులు వెదకి విసుగు జెందియు
ధర్మనందనుని గానకను
చ్యవన మహర్షికి విన్నవించగా
స్వయముగా గురుడే వెదకుచును॥ 16

అరణ్యమందు తిరుగుచు గురుడు
ధర్మనందనుని గట్టిగను
కేక వేసినా బలుక లేదని
పరితపించుచు గానకను॥ 17

ఆశ్రమంబుకు అరుదెంచియును
శిష్యుని చూచు వరకును
ఇట్లుందునని నిశ్చయించియు
ఏకపాదమున నిలబడెను॥ 18

ఈ వృత్తాంతము తల్లితండ్రులకు
చ్యవనుడు దెలుపా వారొచ్చి
పుత్రుని గానక పరితపించుచు
విష్ణుని చాలా ప్రార్థించి॥ 19

గురుసన్నిధిలో తలితండ్రిలు
వుపవాసంబున నిలిచియును
విష్ణుమూర్తియే రక్షకు డనుచు
దుఃఖించుచును వుండి రనా॥ 20

వైశ్యులు సాలంకాయన మునితో
విస్మయ మొందుచు నడిగిరిగా
వ్యాధనాధుడు మృతుడై పోగా
ధర్మనందను డేమాయె ననా॥ 21

ధర్మనందనుని వృత్తాంతంబు
మరల చెప్పుడని వారడుగా
ఆబాలకునీ వృత్తాంతంబూ
చెప్పెద వినుడని ఋషి బల్కె॥ 22

ఒక సమయంబున నాగరాజగూ
వాసుకి శేషుని చూచుటకై
ఈశుని ఆజ్ఞచే కైలాసాద్రిని
వదలియు భూలోకము చేరీ॥ 23

పాతాళంబుకు వెళ్ళుచు నుండగ
ద్వారము పాషాణముచేతా
కప్పియుండుటను చూచియూ వాసుకి
క్రోధ నయనుడై చూడగనూ॥ 24

రాయి పగలగా ద్వారమునందు
మూడు ప్రోగుల మొలత్రాడు
కృషాజినమును ధరించి గురుని
ధ్యానించెడి బాలుని చూచీ॥ 25

నాచూపులచే రాళ్ళు మృగాదులు
నిశ్చితంబుగా భస్మమగున్
నరమాత్రుండూ ధ్యానాసక్తుడు
యీ అబ్బాయి నాచేతా॥ 26

చూడగబడియూ జప మొనరించును
విస్మయంబునా బాలకునీ
వాసుకి ప్రశ్నను జేయగ బాలుడు
కన్నులు తెరచీ తిలకించీ॥ 27

పార్వతిపతియగు సర్వేశ్వరునకు
ఆభరణంబగు ఉరగేంద్రా
కద్రువపుత్రా భక్తవత్సలా
భుజంగరాజా వందనముల్ 28

అనిబల్కియునూ పదములపై బడె
వాసుకి బాగుగ దీవించీ
నాగభవనమున ఏపని ఉన్నది
ఇచట నెందుకూ ఉంటివనా॥ 29

వ్యాధహింసితుండగు విప్రునకై
బలినిమిత్తము ఈ దేహంబు
ఇచ్చితిగానా ఆతని రాకను
చూచుచు ఇచ్చట ఉందునన॥ 30

బాలునిత్యాగము ఓర్పు నేర్పులకు
సంతసమొందీ వాసుకియూ
రమ్యంబైనా రసాతలంబును
చేరియు విధిగా తనప్రభునీ॥ 31

నమస్కరింపగ శేషుడతనికి
హాసన మివ్వగ మండించీ
ఆసభలోనా వివిధలోకముల
ధర్మరాజులా మునివరులా॥ 32

వృత్తాంతంబుల వినియు వాసుకి
సభామధ్యమున ఇటుబల్కా
వైశ్యబాలునీ వృత్తాంతంబూ
బహువింతైనది యనిజెప్పా 33

శేషుడు ఆవృత్తాంతం బేమన
రసా తల ద్వారమునందు
వ్యాధ పీడింతుడగు విప్రునకై
బలి నిమిత్తమై అర్పించీ। 34

వ్యాఘుని కొరకు నిరీక్షించుచూ
సత్యవ్రతుండై ఉండుననా
శేషుడు ఆజ్ఞను ఇవ్వగ వాసుకి
బాలుని సమీపమును జేరీ॥ 35

రమ్మి బాలకా రసాతలంబుకు
నీకు శుభంబు కలుగుననా
ధర్మము తెలసిన ఓ నాగేంద్రా
ఎట్లు వత్తిదీపర దేహం॥ 36

అని బల్కగనే యోగదృష్టితో
వ్యాధుని వృత్తాంతం బెరగీ
వ్యాధుడు నశించె రావయ్యా యన
ధర్మనందనుడు వెడలెనుగా॥ 37

పాతాళంబున పన్నగ పతియూ
శంఖచూడుడూ తక్షకుడూ
కర్కోటకుడూ ధనంజయుండూ
మహానాగుడూ మొదలయినా॥ 38

నాగరాజులచె స్తుతింపబడుచూ
వేయి పడగలను విప్పియునూ
మణుల కాంతినీ వెదజల్లుచునూ
రత్న ఖచితమగు భవనమునా॥ 39

నాగ కన్యకలు నాట్యమాడగ
సనకస నసందులు సేవింపా
రెండు వేలు నాలుకలను విప్పి
పెదవులు నాకుచు నుండెనుగా॥ 40

దేవాధ్యక్షుడు పరమాత్ముండూ
నిత్యుడు ఆదీ దేవుడగు
శేషుని పాదంబులపై బాలుడు
పులకాంకితుడై పడి యపుడూ॥ 41

వైశ్యులారా అనంతరంబూ
ధర్మనందనుని స్తుతి జేసే
ఇంద్రి పొగడితా శాంతచిత్తుడా
హరి హర రూపా వందనమూ॥ 42

శ్రీ మైత్రేయా గోత్రజుండనూ
ధర్మనందనుడు నా పేరూ
దీనరక్షకా వర ప్రసాదా
నను రక్షింపుము యని వేడా॥ 43

అంత శేషుడూ ఆనందించీ
చిరాయువులుగా దీవించీ
నీ వృత్తాంతము దివ్య దృష్టిచే
తెలిసితి వెడలుము గృహామునకూ॥ 44

తల్లితండ్రిలా గురుల స్నేహితుల
సంతస మొందించుము బాలా
నీ కిష్టంబగు వరమును కోరుము
ఇచ్చెదననియూ బల్కెనుగా॥ 45

భక్తవత్సలా భక్తిభిక్షనూ
జన్మజన్మముకు దయసేయూ
భోగాదులు నాకపేక్ష లేదన
మరల వరంబును కోరు మనే॥ 46

భక్తానుగ్రహా వరప్రసాదా
చతుర్యుగములా పరిమితిని
బ్రహ్మదేవుని ఆయుర్దాయము
చతుర్వర్ణముల కృత్యములు॥ 47

కలియుగంబునా క్షత్రియ వంశము
నందరాజుతో తుదియనియూ
విష్ణువర్ధనుని దుష్కృత్యముచే
కొలదిగ వైశ్యులు నిలతురనీ॥ 48

ఋషులచె తరచుగ నే వినియుంటిని
ఈ వృత్తాంతము లన్నియునూ
దేవా ప్రసాద మివ్వుడు అనగా
ఆదిశేషుడూ ఇట్లనెనూ॥ 49

ధర్మనందనా నీ వడిగిన కథ
పావనమైనది రహస్యమూ
అని జెప్పియునూ ఆదిశేషుడూ
జరిగిన కథ ఆరంభించే॥ 50

ధర్మనందనుడు రసాతలము చేరుట, శేషుని వర్ణన, శేషుని వరమడుగుట.

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

షష్ఠోఽధ్యాయః (6)

ధర్మనందనుడు శేషస్వామిచె
వినిన మంగళంబగు కథను
మీకిప్పుడు నే కోరిన దానిని
దెలిపెద శ్రద్ధగ విను డనియె॥ 1

మహాబాహుడగు ఓ అబ్బాయి
పరమపావనము పుణ్యకథా
సమాహితుండై శ్రద్ధగ వినుమని
శేషుడు దెల్పెను వినరండీ॥ 2

కృతయుగంబుకు పదిహేడులక్షల
యిరువది ఎనిమిది వేలేండ్లు
త్రేతాయుగంబునకు ద్వాదశ లక్షలు
తొంబది యారు వేలేండ్లు 3

ద్వాపరయుగముకు ఎనిమిది లక్షలు
అరువది నాలుగు వేలేండ్లు
కలియుగంబుకు ఆయుర్దాయము
ఈ రీతిగనే నిర్ణయము॥ 4

కలియుగంబుకు నాలుగు లక్షల
ముప్పది రెండు వేలేండ్లు
నాలుగు యుగములు కలసి నట్లయిన
మహాయుగమనే నిర్ణయము 5

మహాయుగంబులు డెబ్బది యొకటి
మన్వంతర మని దెలియ వలె
ఇవి పదునాల్గు బ్రహ్మకు దినము
ఈదినంబు లోక వత్సరము॥ 6

దివ్య వత్సరాల్ నూరేండ్లయిన
బ్రహ్మ పరిమితి ముగియునుగా
నూరు బ్రహ్మలు గడచిన వేళకు
దీర్ఘాయువునకు వొక దినము॥ 7

ఇరువది ఏడు కోట్ల మునీంద్రులు
గడచిన రోమశ ముని కొక్క
రోమ మూడును రోమశ మునికి
ఎన్ని రోమములో దెలియండి॥ 8

ముప్పది కోట్లు రోమశ మునులు
ముగిసిన అష్టావక్రునకు
జీర్ణించును వొక శల్యము మునికి
ఎనిమిది గలవు ఈ మునికి॥ 9

అష్టావక్రులు నలువది కోట్లు
గతించి పోతె క్షణకాలం
పాదదృముడను మహర్షి కగును
మహేశ్వరునికి విను మనెను॥ ౧0

యిరువది యర్బుద కోట్ల మునీంద్రులు
పాదద్రుములు పోయినచో
మహేశ్వరునికి నిమిషం బగును
ఆతని రూపము వినుమనెను॥ 11

బాహ్యాంతరముల వ్యాపించుయును
సూక్ష్ముడు సమర్థుడై యుండి
నిత్యుం డగుచు రక్షణ జేయును
అత డాధారుం డంతటికి॥ 12

వివిధ భుజములు సకల నేత్రములు
వుదరము లన్ని ఆతనివే
సకల శాస్త్రములు వేదంబులకు
అగోచరుండై శేషించు॥ 13

చెవులు లేకనే లెస్సగ వినును
కన్నులు లేకనె గాంచునుగా
కాళ్ళు లేకనే ఘనముగ నడుచు
నోరు లేకనే మాట్లాడు॥ 14

సర్వదృశ్యములదృక్కై వెలుగు
మూలకారణుడు జగత్తుకు
ఈ మహేశ్వరుని యోగీశ్వరులు
గాంతురు హృదయాకాశమునా॥ 15

ఈ మహేశుడు సృష్టి యాదిలో
రాజహంసమై జనించియు
సకల వేదముల నిర్మాణంబు
సకల జగములా సృజించెను॥ 16

జగత్తులన్ని నాశన మైనను
సాగరంబులు గలసినను
అంధకారమై అలరిన గాని
ప్రకాశించుచూ నుండునుగా 17

ఈశుని సన్నిధి కల్పిత మైన
యిచ్ఛా చేతను అవ్యక్తం
అవ్యక్తముచే మహాత్తత్త్వము
మహత్తుచేత త్రిగుణములు॥ 18

త్రిగుణంబులలో త్రిమూర్తులైరి
అతడే రజస్సుచే బ్రహ్మ
సత్వ గుణంబున విష్ణు వాయెను
తమో గుణంబున రుద్రుడుగా॥ 19

బ్రహ్మకు సృష్టి నేర్పరిత్వము
పన్నగశాయికి పోషణయు
శివునికి శూలము నాశ శక్తియు
యిచ్చి విముక్తుం డాయెను॥ 20

చతుర్ముఖుండు సృష్టి నిమిత్తము
శివుని స్మరణము జేయగను
మనసున అపరార్కుండు బుట్టె
ప్రాణవాయువున దక్షుడుగా॥ 21

అపాన మందు క్రతువు బుట్టెను
వ్యాన వాయువున పులహ్యుడుగా
ఉదాన వాయువు వలన పులస్త్యుడు
సమానంబునా వసిష్ఠుడు॥ 22

శిరస్సు నందు గగనము బుట్టె
కర్ణములందు వాయువుగా
నేత్రములందు సూర్యచంద్రులు
ముఖము నందు ఇంద్రుడు అగ్నియును 23

నాభి వలనను అంతరిక్షము
రోమంబులచే లోకములు
అవయవములలో అమరులు బుట్టిరి
ముఖము వలనను బ్రాహ్మణులు॥ 24

భుజంబు లందు క్షత్రియోద్భవము
ఊరువు లందు వైశ్యులుగా
పాదము లందు శూద్రులు గల్గిరి
ద్వితీయ సృష్టి వినరండీ॥ 25

యక్షరాక్షసా గంధర్వాదులు
అశ్విని మొదలగు నక్షత్రాల్
నవగ్రహంబులు మరుద్గణంబులు
అష్టవసువులు సముద్రముల్॥ 26

పర్వతంబులు పక్షిజాతులు
ఏకాదశ రుద్రులు నదులు
అష్టవసువులు సప్తమాతృకలు
ద్వాదశ ఆదిత్యులు పశువులు॥ 27

వృక్షజాతులు తీగెలు వ్యాఘ్రాల్
అరణ్యమృగములు అన్నియును
బ్రహ్మ చేతనే జనించగానే
విధాత ఇట్లు జేసెనుగా॥ 28

వారివారికి యోగ్యస్థానముల్
ఆహారంబులు కార్యములు
చతురాశ్రమములు చతుర్వర్ణములు
సకల విధంబుల దేశములు॥ 29

సంతోషముతో సృష్టి జేసెను
ఈ కథ విన్న వార్లకును
ఇహపరంబులా సుఖంబు గల్గి
లోకపూజ్యతా పొందెదరు॥ 30

శేషధర్మనందన సంవాదము, చరాచర సృష్టిక్రమము.

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

సప్తమోఽధ్యాయః (7)

అవయవంబులా భేదము చేతా
పుట్టిన పుత్రుల నందరినీ
వరుసగ గాంచీ వర్ణ భేదములు
సృష్టి కర్మలను నియమించే॥ 1

విప్రోత్తములకు వేదపఠనమూ
రక్షణ చేయుట రాజులకు
గోరక్షణయు వాణిజ్యంబూ
వైశ్యుల వృత్తిగ నియమించే॥ 2

వీరల సేవయె శూద్రుల వృత్తీ
అమరులు ఋషులూ విప్రులకూ
జ్యేష్ఠపుత్రుడగు ఆంగీరసుడు
రాజుల గురువే వసిష్ఠుడు॥ 3

వైశ్యుల గురువే అపరార్కుండూ
ఇట్లు గురువుల నియమించా
బ్రహ్మ ఆజ్ఞచే పృథివిని జేరీ
శ్రౌతస్మార్తాకర్మలనూ॥ 4

మూడు వర్ణముల వారల జేయుగ
సవ్యదక్షిణా పార్శ్వముల
పుట్టిన స్త్రీలు పురుషు లందరు
సంతానంబుల బొందిరిగా॥ 5

ముగ్గురు గురువులు మూడు వర్ణముల
సంతానములకు వార్లకునూ
గోత్రగణంబులకు ప్రవరుల రీతీ
నిర్మాణంబును జేసిరిగా॥ 6

వైశ్యపుత్రులకు అపరార్కుండూ
పంద్రెండేండ్లలో ఉపనయనం
వేదాధ్యయనం విద్యాభ్యాసము
శాస్త్రవిహితముగ వివాహముల్॥ 7

జరుపించుటచే లోకగురువు లని
ప్రసిద్ధి నొందిరి ధరలోన
వైశ్యులు చాలా నేర్పును గల్గీ
క్రియవిక్రియములు చేయుచునూ॥ 8

పితురుల కర్మలు విప్రుల సేవా
ధనధాన్యంబుల సంగ్రహమూ
పుణ్యాపాపములు ఎరుగుట చేతా
అపరార్కుండూ జనె నంత॥ 9

వైశ్యులు సాలంకాయన ఋషితో
ఇట్లు ప్రశ్నించిరి వినరండీ
మహానుభావులు ఋషుల గోత్రముతో
వైశ్యుల కుండ నవియు గదా॥ 10

ఏ కారణమున వైశ్యుల గోత్రాల్
ప్రాకృతంబులు ఐనవిగా
నూటా రెండే పావనము లనీ
నుడువుట కారణ మేమి ప్రభూ? 11

వైశ్యులారా చెప్పెద నేను
నిశ్చలంబుగా విను మనియు
సాలంకాయన ఋషి ఇటు బల్కె
శ్రోతలు శ్రద్ధగ వినరండి॥ 12

విప్రులు రాజుల ననుసరించుచు
వైశ్యులు బహుకాలము గడుపా
కృతయుగంబునా స్వాయంభువ యను
మనువు కాలమ్మున ఈ రీతి॥ 13

సమస్తజనులు సర్వలోకముల
సంచరించుచూ నుండురిగా॥
దేవతలకునూ మానవులకునూ
తారతమ్యము లేకుండే॥ 14

సర్వమానవులు సత్యసంధులు
దీర్ఘాయుష్షులు నేర్పరులు
రెండు లక్షలా సంవత్సరములు
బ్రతుకుచు నుండిరి అప్పటికీ॥ 15

ఒక సమయంబున జగదీశ్వరు డగు
విధాత తన సంతానమగు
విప్రిబుషుల ద్విజోత్తములను
తన లోకముకు పిలపించే॥ 16

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యోత్తములు
వుత్సాహముతో వచ్చియును
బ్రహ్మను బాగుగ స్తోత్రము జేసి
వుచితాసనముల గూర్చొనిరి॥ 17

విధాత వీర్లను గాంచిన వాడై
విచారణంబున ఇట్లనెను
సంతానంబులు వృద్ధిగ నున్నవ
తమతమ ధర్మాల్ నడిపెదరా॥ 18

వేరు వేరుగా వంశాల్ గోత్రాల్
గణాలు నిర్ణయమైనవియా
తమతమ కార్యాల్ జనుగుచున్నవా
సుఖమా మీకు యని యడిగే॥ 19

ఓ పితామహా మేమందరమూ
సుఖవంతులమై మీ యాజ్ఞ
నిర్వర్తించితి మని జెప్పియును
లేచి కూర్చొనిరి అందరును॥ 20

అటుపై లోకేశుండగు బ్రహ్మ
బ్రాహ్మణులారా మీయొక్క
గోత్రగణాలు ఎన్నని యడుగా
దుర్వాసుడు ఇటు చెప్పెనుగా ॥ 21

నూటాతొమ్మిది గోత్రంబులుగా
పదునెనిమిది గణములు యని జెప్పె
గోత్రము లేదు గణము వొక్కటని
ధనంజయుండను రాజనేను ॥ 22

సమాధియను వైశ్యుడు లేచియును
ఓ సురేశ్వరా మా గణముల్
నూటారెండు నిర్ణయమైనవి
గోత్రాల్ ఇన్ని వున్నవనె॥ 23

ఆరువందలా పండ్రెండు మరి
నూటారెండు వున్నవనా
బ్రహ్మదేవుడు వినిన వెంటనె
సంతసించి సన్మానించె ॥ 24

బ్రాహ్మణులారా క్షత్రియులారా
నాచే వరములు కోరుడనా
కమలగర్భుని గాంచి బ్రాహ్మణులు
క్షత్రియు లిట్లు యడిగిరిగా ॥ 25

వేదవిహితమగు కర్మములందు
తపస్సు బ్రహ్మచర్యములు
ధర్మముగాను ప్రజలపాలనా
దుష్టశిక్షణ శూరత్వం॥ 26

బ్రాహ్మణ క్షత్రియ మిత్రత్వమును
ఈవరంబులా వుభయులును
నరప్రసాదము ప్రసాదింపుమన
జగత్ప్రభుండు ఇచ్చియును॥ 27

వైశ్యులారా వరము లడుగుడన
అహంకారముతో గూడియునూ
అంగబలంబు అర్థ బలంబు
అంతయు మాకువున్నదనీ॥ 28

పాపబుద్ధితో దుర్మార్గమునా
ఈవరంబును అడిగిరిగా
మాకు శ్రేష్ఠత ప్రథమస్థానము
ప్రసాదింపుడని యడిగిరిగా॥ 29

బ్రహ్మదేవుడు వైశ్యవరులకు
శ్రేమత ప్రథమస్థానమునూ
ఇచ్చితిననగా వెంటనే వైశ్యులు
అట్టహాసమూ జేసియును॥ 30

గుసగుసలాడుచు గర్వముతోడ
ఆర్యాటుపండ్రెండు గోత్రజులు
భుజములతట్టుచు మీసాల్ త్రిప్పి
పకపకనవ్వుచు నుండగను॥ 31

విప్రులు వైశ్యుల హేళనకొరకు
ఇట్లుశపించిరి వినరండీ
గోత్రగర్వమున గలిగిన పాపము
శీఘ్రమె ఫలితము పొందెదరూ॥ 32

వైశ్యకులమున బ్రష్టతనొంది
వైదికకర్మాల్ వదలియునూ
మాంసభోజనము జేయుచుమీరు
కీర్తిహీనులై బ్రతుకుడిగా॥ 33

ఇట్లుశపింపగ భయభ్రాంతులై
నూటరెండు గోత్రప్రజలు
ఆహా యేమి ఈశాపమని
బ్రహ్మను బహుబ్రతిమాలిరిగా॥ 34

బ్రహ్మదేవుడు వైశ్యులగాంచి
నాకుపూజ్యులు బ్రాహ్మణులు
వార్లనే మీరు వేడుడనగను
అట్లేవైశ్యులు వేడిరిగా॥ 35

విప్రులు శాంతున్రై ఇట్లు బల్కిరి
ప్రాకృత గోత్రంబులుయైన
ప్రపంచముండెడివరకు గోత్రములు
నిలచియుండునని బల్కిరిగా॥ 36

మరల బ్రహ్మను ప్రార్థనజేయ
ఇట్లనె వైశ్యులతో బ్రహ్మ
విప్రులమాట తప్పక నడచు
నూటరెండే నిలచుననెన్ ॥ 37

ఈకారణమున మీావంశమునా
వాసవి కన్యక జనించియు
వాసవి వలనా అగ్నిలోదుమికి
కీర్తిపొందెదరు మీారని యె॥ 38

నూటారెండు గోత్రవైశ్యులు
బ్రహ్మను భక్తితోపూజించి
వినమిత దేహులై వెడలిరిగాని
గర్వముతోనా కొందరునూ॥ 39

వైశ్యుల గర్వము, విప్రులశాపము.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

అష్టమోఽధ్యాయః (8)

భూలోకమునకు వైశ్యులువచ్చి
అపరార్కారు ఋషిఆశ్రమము
శీఘ్రమె చేరి శిరమును వంచి
సంతాపముతో బల్కిరిగా॥ 1

స్వామీ తమరు బాగుగవినుడు
విప్రులు శాపము బెట్టుటచే
తేజోహీనులుమగుచును మేము
హృదయతాపము బొందితిమి॥ 2

విప్రశాప విమోచనకేదో
దయతో దెల్పుడు మాకనియు
పరితాపముతో ఈపలుకులను
అపరార్కునితో బల్కిరిగా॥ 3

దుష్టవర్తనులు దుర్మార్గులచే
నరకతుల్యమో భూలోకం
ఈలోకమున క్రోధసంభవులు
కపటవర్తనా నరాధముల్॥ 4

పరధనంబులా నపహరింతురు
పరకాంతలతో గూడెదరు
అనేకనరులు మద్యపానులు
దుష్టులగూడి తిరిగెదరు॥ 5

ప్రభువులజూచి ప్రజలుఓర్వరు
ద్రోహము ప్రభువులు జేసెదరు
భామలమాటలు వినుచు కొందరు
తల్లిదండ్రులా వదలెదరు॥ 6

అన్నదమ్ములు ధనంబుకొరకై
వైరము బూనిన జీవనమె
పాపబుద్ధితో వొకసమయంబున
జాతిధర్మములు విడచెదరు॥ 7

విప్రులు క్షత్రియవృత్తి జేతురు
వైశ్యులవృత్తి క్షత్రియులు
వైశ్యులు శూద్రులవృత్తి జేతురు
శూద్రులు నీచావర్తనులు॥ 8

పాపాత్ములను గౌరవింతురు
అవమానింతురు సజ్జనులా
గురువర్యా యిటువంటిలోకము
వినుడని మరలా ఇట్లనిరి॥ 9

కామంబనెడి అగాధజలము
క్రోధంబనెడి అలలుండు
లోభంబనెడి లవణయుక్తము
మోహంబనెడి నాచుండు॥ 10

విషప్రాయమగు మదంబుతోడ
మత్సరంబను మోసళ్ళచే
సర్పంబులను స్త్రీలచేతను
డంబంబనెడి కొండలును॥ 11

నరకంబనెడి ద్వీపములుండు
ఆశాయనెడి వొడ్డులలో
పారుచుండెడి ఈనదియందు
ఓడాయనెడి శరీరము॥ 12

ఇంద్రియంబులను నవరంధ్రములు
ప్రతిక్షణంబును మారునది
సంకల్ప వికల్ప మారుతంబుచే
ఇందున నరులు చరింతురు॥ 13

కలియుగంబున నెట్లు వసింతుము
కలిదోషంబు అంటకను
బ్రతుకు ఉపాయము ఏదియో మాకు
దెల్పుమనియు ప్రార్థించిరిగా ॥ 14

అపరార్కఋషి ఇట్లు బల్కెను
భక్తి వినయమున మెలగుచును
యజ్ఞము జపము తపస్సు చేయుచు
వేదాధ్యయనము నిత్యయును॥ 15

విప్రుల సురుల పూజించుటయు
వ్రతములు నిష్ఠతో సల్పుటయు
బావులు, చెరువు త్రవ్వించుటయు
శ్రీగురు సేవా జేయుటయు॥ 16

తన ధర్మమునా జీవించుటయు
యితర ధర్మముల వదలుటయు
యిట్లు పుణ్యపు పనులు జేసినా
ఉత్తమ లోకము పొందెదరు॥ 17

దుష్టశిక్షణ శిష్టరక్షణకు
నారాయణుడు పలుమార్లు
నరావతారాల్ మత్స్యకూర్మాది
అవతారుండై సుఖమిచ్చు॥ 18

దయాసముద్రుడు మహాప్రభుండు
ఫాలలోచనుడు శంకరుడు
ఈ మహాత్ములగు శివ కేశవులా
బాగుగ స్మరణా జేయుడన॥ 19

ఓ గురునాథా! దివారాత్రములు
సంసారములో తిరుగుచును
అహంకారమను చీకటి చేతా
బుద్ధిహీనులు నగు వారు॥ 20

పుణ్యక్షేత్రముల దిరుగని వారు
ఆత్మజ్ఞాన విముఖులుగా
ఈశ్వర రూపము ఎరుగని వారై
మూఢచిత్తులై కలి యందు ॥ 21

అద్భుతమైన జ్ఞాన మెరుగక
చీకటి లోన మునిగియును
విషయ భోగ మను మద్యము దాగి
మన్మథ వ్యాధిని బొందుచును॥ 22

దేహంబనెడు ఓడ విడుచుటకు
అధిక తాపము బొందియును
పాప రాశి యను అడుసులో బడియు
ఘోర నరకమున గూలెదరు॥ 23

విషయ భోగముల గూడిన లోకము
భోగులు యుక్తులు సంసారుల్
భక్తి జ్ఞానము సన్యాసంబుల్
అయ్యయ్యో యెటు లోర్తు మని॥ 24

సత్యజ్ఞానులు సుకృత తపస్వులు
సనందనాదులు నిరంతరం
నిష్కామకులు సత్యసంధులు
యజ్ఞయాగముల నేర్పరులు॥ 25

సర్వసంగముల పరిత్యజించి
అంతరాత్మనె జూచుచును
సంసార సముద్రంబును ద్వాటియును
యే స్థానమునా యుండెదరో॥ 26

గోబ్రాహ్మణుల రక్షణార్థమై
దేహాల్ విడచి సుఖింతురో
యుద్ధము జేసి ప్రాణాల్ వదలి
యే స్థానమునా నుండెదరో॥ 27

అట్టి స్థానము పొందిన మేము
యిట్టిలోకమున వుండమని
పరిపరి విధముల ఏడ్చి వైశ్యులు
గురుచరణంబులపై బడిరి॥ 28

వైశ్యులు భూలోకమున అపరార్క ఋషి వద్దకు పోయి విప్రులు శాపమిచ్చుట దెల్పి కలియుగ వర్ణన గావించి దుఃఖించుట.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

నవమోఽధ్యాయః (9)

దుఃఖము తోడ శోచక యుండిన
వైశ్యుల గాంచి ఋషివరుడు
మంగళ మైన వాక్యంబులను
మధురంబుగను వినిపించె॥ 1

భూలోకంబున సత్యసంధులగు
మీరలు భయపడ పని యేమి
అభయంబిచ్చెడి ఈశుని వేడి
యుపదేశంబును బొందుడనె॥ 2

చంద్రశేఖరుండగు ఈశ్వరుని
చరితము వర్ణింపగ తరమా
ఆతని దలచిన ఆపదలన్నీ
అంత మొందును నమ్మండి॥ 3

త్రిపురాసురసంహార కాలమున
భూమిని రథంబుగను జేసి
ఆదిశేషుని అల్లెతాడుగ
మేరుపర్వతము ధనస్సుగా॥ 4

సూర్యచంద్రులు చక్రంబులుగా
బ్రహ్మదేవుని సారథిగా
విష్ణుదేవుని బాణము గాగ
త్రిపురాసురులను దుంచెనుగా॥ 5

ఇట్టి దేవుని గట్టిగ నమ్మి
అనన్య భక్తితో సేవించి
భూమి యందున వంశము నిలిపి
కైలాసంబును బొందు మనెII 6

అపరార్కా ఋషి చెప్పిన మాటలు
వినిన వైశ్యులు ముదంబుతో
ఓ దేవోత్తమ మా భాగ్యంబున
ఈశుని చరితము వింటిమిగాII 7

ఏ విధంబుగ వుపాసనంబు?
ఎట్లువ్రతంబును జేయవలెన్
ఎట్లు వేడినా యీశుం డగుపడు?
ఏదియో యంతయు తెలుపు డనన్ 8

అపరార్కుండు బాగుగ చూచి
వైశ్యుల తోడ ఇటు బల్కె
బిడ్డలారా ఈశుని పూజ
విధాన మంతా వినుమనెనుII 9

కామక్రోధ లోభము విడచి
ఇంద్రియ నిగ్రహమును గలిగి
శీతోష్ణంబుల సమముగ జూచి
శాంతి గుణములు గల్గియునుII 10

లోహము చేతా లింగము జేసి
గణపతి ముందున వుంచుకొని
బిల్వదళంబుల తుమ్మిపుప్వులా
తిల అక్షతలచె పూజించి॥ 11

ధూపము దీపము నైవేద్యంబు
లధిక భక్తితో నర్పించి
శివపంచాక్షరి మంత్ర జపముచే
ఈవిధంబుగా జేయు డనెన్॥ 12

శివపంచాక్షరి ఉపదేశంబును
శిష్యుల కందరకును జేసి
కైలాసంబును బొందునట్లుగా
వారల దీవించియు బంపె॥ 13

అటుపై వారలు బహుకాలంబు
గృహంబు లందు ఉండియును
సంసారముపై మోహము విడచి
తపస్సు కొరకై జనిరంత॥ 14

ఆశ్రమంబులు చూచుచు తిరుగగ
అంతలో నారద మునిని గాంచి
ఆశీర్వాదము బాగుగ బొంది
జేరిరి హిమవత్పర్వతము॥ 15

ఋషిచే వినినా క్రమంబు చేత
తపస్సు చేయ మొదలిడిరి
గ్రీష్మఋతువున ఎండల యందు
వుదకము నందే చలికాలం॥ 16

ఆకులు జలము ఆహారముగా
కొందరు సూర్యకిరణములు
మరికొందరును వాయుభక్షణము
ఆహారంబును వదలియునూ॥ 17

దేవతలైనా జేయగరాని
ఘోరతపంబును జేసియును
శివుని గానక వైశ్యమునులును
ఖేదము తోడ గూడియును॥ 18

వైశ్యమునులు బహుదుఃఖము చెంది
నమస్కరించిరి ఋషులకును
వారల కంతా వినిపించియును
తెలిపిరి ఋషులు హితంబును॥ 19

మీ వంశములో ఎవరికి ఏది
ఇష్టముండునో నద్దాని
ముందుగ మీరు విడిచెద మనిన
శివుడగు పడును శీఘ్రమనా॥ 20

ఇష్టవస్తువులు విడచిన వైశ్యులు
ఈశుని గూర్చి బహురీతి
ఘోరతపస్సు జేయుచు నుండగ
దేవతలందరు భయపడిరి॥ 21



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

దశమోఽధ్యాయః (10)

ఆహా వింత భయోత్పాతము
శిద్ధులు సాధ్యులు యక్షులకు
ఘోరమైన యావైశ్యుల తపము
అగ్నిజ్వాలలు వ్యాపింప॥ 1

ఈశుని వద్దకు అరుదెంచియును
కుయ్యోమొర్రో యని వేడ
భూతేశుండగు శంకరు డప్పుడు
ప్రసన్న మానసు డాయెనుగా॥ 2

ఈశుం డపుడు ఈప్సిత మివ్వగ
ఊహించెను తన మనంబునా
భక్తులైన యావైశ్యుల చెంతకు
త్వరితంబుగను అరుదెంచె॥ 3

దయామయుండగు శంకరు డపుడు
మహానందిని ఎక్కగనే
శ్వేతఛత్రము ఇంద్రుడు పట్టె
యిక వైభవము వర్ణింతు॥ 4

వరుణ కుబేరుడు యిరుపార్శ్వములా
వింజామరలు వేయగను
వీచెను వాయువు తాళవృంతము
అగ్ని దేవుడు స్తోత్రమును॥ 5

దిక్పాలకులు పరాకు జెప్పగా
నైరుతి శూలము బట్టెనుగా
దండ హస్తుడై యము డుండగనూ
ఇట్లరుదెంచిరి సురులంతా॥ 6

వశిష్ఠ వాలఖిల్యులు అత్రి
విశ్వామిత్రుడు అగస్త్యుడు
ఆపస్తంబుడు మాండవ్యుండు
భృగువు గౌతముడు సనకుండు॥ 7

సనాతనుండు శౌనకు డాది
మునులు మహావాక్యంబులతో
ఆగమ శాస్త్రోక్తంబై నట్టి
స్తోత్రగానము జేయగను॥ 8

శిరోభూషణము బాలచంద్రుడు
వామార్ధమున భార్యయును
కరుణారసమున మహేశ్వరుండు
వైశ్యుల ఎదుట కనుపించె॥ 9

వైశ్యులు ఈశుని గాంచిన వెంటనె
ప్రణిపాతంబు జేసియును
రోమాంచనము కంటి ధారలతో
గద్గద పలుకుల బొగడిరిగా॥ 10

సురాధిపుండవు పరిపూర్ణుండు
రక్షకుడు దేవాధ్యక్షుడవు
లోపల వెలుపల అంతయు నిండి
అగబడ నట్టి నీవిపుడు॥ 11

గుణముల జేత రూపము దాల్చి
హాలాహలమును మ్రింగియును
నీ నేత్రముచే మన్మథ దహనము
జేసిన నీకు వందనముల్॥ 12

పరిపరివిధముల స్తోత్రము జేసిన
వైశ్యుల గాంచి శంకరుడు
మెచ్చితి నేను మీాతపంబుకు
కోరుడు ఇచ్చెద వర మనె॥ 13

దేవా నీవు సంతోషించిన
మా కొక వరము దయచేయు
సర్వకాలమును తప్పక స్మరణా
చలనము లేని భక్తిడుము॥ 14

ఇట్లు వేడినా వైశ్యుల గాంచి
ఈశుం డపుడు ఇట్లనెను
ఈ వరంబును మెచ్చి యిచ్చితి
కోరుడు యింకొక టిత్తుననె॥ 15

దుర్లభమైన కైలాసంబు
మే ముండుటకై స్థానమును
ఓ దయానిధే మా కిమ్మనగా
శంకరు డట్లు వొప్పియును॥ 16

కుబేరు గాంచి ఆజ్ఞ జేయగా
పుష్పక విమాన మొచ్చెనుగా
ఆ విమానమున వైశ్యులు వెడలిరి
ఈ రీతిగను వినరండీ॥ 17

వైశ్యులు పుష్పక విమానముల దృశ్యములను గాంచుచు బ్రహ్మానందముగ కైలాసము చేరు ఘట్టమునకై ఛాయాచిత్రము చూడుడు.

ధగ ధగ ధగ ధగ ధగ ధగ మెరిసెడి
దివ్యవిమానము కాంతులనూ
అన్ని దిక్కులా మెరుపుల రీతి
వైశ్యులు వింతగ చూచిరిగా॥ 18

ఘణ ఘణ ఘణ ఘణ ఘణ ఘణ యనుచు
గంటలు ఘల్లున మోగగను
ఆశ్చర్యముగా ధ్వనులను వినుచూ
ఆనందమునూ పొందిరిగా॥ 19

## వైశ్యఋషుల కైలాసప్రవేశం



(శ్రీ కొప్పరం తిప్పయ్యగారు, వీరి ధర్మపత్ని (కోలారు)
ఈ ఘట్టమును జరిపినవారు గ[illegible]పా పాపయ్యగారు, వీరి కుటుంబము (కోలారు)



శ్రీ వెలుగూరు సత్యనారాయణగుప్త గారు (తుని)
కైలాసప్రవేశఘట్టమును తునిలో జరిపిన భక్తులు

జయ జయ జయ జయ జయ జయ యనుచు
దేవత లందరు పల్కగనూ
జల జల జల జల జల జల యనుచూ
పూవులవానయూ కురిసెనుగా॥ 20

ఝణ ఝణ ఝణ ఝణ ఝణ ఝణ యనుచు
దుందుభు లన్నియు మ్రోగగనూ
సుందరవతుల నాట్యము చూచి
అతి హర్షమును బొందిరిగా॥ 21

భళి భళి భళి భళి భళి భళి యనుచు
మును లందరును బల్కగను
చలనము లేని వైశ్య భక్తులు
విస్మయ మొందుచు గూర్చొనిరి॥ 22

ఆహా వింత వైభవంబుగా
వైశ్య ఋషులు వేడుకతో
చెప్పగ లేనీ వైభవంబున
రివ్వున వెడలిరి కైలాసం॥ 23



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ఏకాదశోఽధ్యాయః (11)

దుర్లభంబగు కైలాసమును
వైశ్యమహర్షులు జేరియును
నిత్యము శివుని దర్శించుచునూ
హర్షాన్వితులై ఉండిరిగా॥ 1

అద్భుతంబగు గుహాల యందును
ఆశ్చర్యంబగు బిలములలో
మణిమయ భూముల వనములలోను
స్వేచ్ఛగ తిరుగుచు నుండగనూ॥ 2

పోకచెట్లతో అరటిచెట్లతో
పారిజాతము సంపంగి
మల్లెలు జాజితీగెల వృక్షాల్
తియ్యని చూతపు వృక్షములు॥ 3

స్ఫటిక శిలలతో కూడిన కొలనులు
ఎర్రని తెల్లని తామరముల్
చిలుక పలుకులు కోయల ధ్వనులు
తుమ్మెద ఝూంకారము నొప్ప॥ 4

సుందరంబగు వనంబులందు
పుష్యంబను గోత్రమునా
పుద్భవించినా సోమదత్తుడను
వైశ్యమహర్షి పుత్రికయు॥ 5

కీర్తి నామిక పేరుగలదియు
రత్నవస్తువుల శోభితము
చిత్తచలములేని కన్యయు
సఖురాండ్రులతో విహరించె 6

ఆవనంబునా ఆమెముఖాబ్జపు
పరిమళంబును త్రావుటకై
తుమ్మెదగుంపులు రోదనజేయగ
కీర్తిబాగడినా యట్లుండే 7

కీర్తికన్యకా పాదంబులలో
రత్నపు అందెలు శోభింపా
వాటిని పొడచుచు వెంటనంటినా
హంసలగుంపులు గలదియును 8

మందమారుతంబునకు చలించు
మంచి ముంగురులు గలదియును
దిక్ శోభితమగు కస్తురిబొట్టు
గజగమనముగల సుందరియు 9

కటికప్రదేశపు వడ్డాణంబు
రత్నకాంతులా కిరణములా
వెదజల్లగను ఇంద్రునిధనస్సు
యను రీతిగను దోచెనుగా 10

అంతింతనని అందకత్తెయు
అందచందముల మోహినియు
వర్ణింపగను శక్యముగాని
కీర్తినామికా కన్యకయు 11

పున్నమచంద్రుని ముఖంబుగల్గి
చల్లనిచూపుల చూచును
వయ్యారముగా ఇటునటు తిరుగుచు
పువ్వులుకోయుచు నుండెనుగా 12

చిత్రకంఠుడను గంధర్వుండు
ఆసమయంబున అరుదెంచి
చెవుల కింపగు గానము వినియు
ఎవరి గానమని గాంచగనూ 13

కోటిమెరుపులారీతిగ గన్యక
కనులకు బాగుగ గనిపించె
గంధర్వుడు చూచిన వెంటనె
మన్మథబాణంబులు బడెగా 14

తిన్ననిచూపుల తియ్యనిమాటల
వున్మాదంబున యిటుబల్కె
సుందరవతియగు నీకు శుభంబగు
నీవెవరు పేరేమనియె 15

కన్యక యపుడు సోదరిమణులతో
తనవృత్తాంతము యదార్థము
వారలచేత చెప్పించగనే
చిత్రకంఠుడు ఇటుబల్కె॥ 16

ఓ మధురాక్షి నీ చిలుకపలుకులు
వినుటకు అదృష్టుడనుగాన
నీచూపుల నే చూచుభాగ్యము
నోచగలేదా నోములు నే॥ 17

నేను దీనుడను నారక్షణము
నీవు చేయుటా ధర్మంబు
నీవు నాచేయి పట్టకపోయిన
నేనుప్రాణము విడచెదను॥ 18

నీవు వివాహాము లేని దానవు
మిగులసుందరివి చపలాక్షి
యని గంధర్వుడు భగభగమండెడి
మన్మథాగ్నితో విలపింప॥ 19

ఓగంధర్వుడ చాలును చాలును
ఛీఛీ మాటల నిలుపుమురా
నే తల్లితండ్రుల గల దాననురా
ఛీఛీ నీవిక వెళ్ళుమురా॥ 20

నా తండ్రి నను ఎవరికిచ్చునో
వాడే నాపతి తెలియుమురా
అని బల్కియును కీర్తినామికా
కన్నుల నెఱ్ఱగ జేసుకొనీ॥ 21

కోపావేశము బొందియు వానితో
ఇట్లు బల్కియూ గృహామునకూ
వెడలియు తండ్రికి సంగతి జెప్పీ
సుఖంబుగానూ ఉండగనూ॥ 22

గంధర్వుడు ఖిన్నహృదయుడై
తండ్రివద్దకు జనుదెంచి
కన్యను నాకు భిక్షబెట్టుమని
దీనుండై బహు వేడెనుగా॥ 23

వైశ్యులు కోపావేశము బొంది
నీచపలుకులను మానుమురా
మేనరికము కన్యనివ్వము
చాలుచాలును పొమ్మనిరి॥ 24

గంధర్వుండు అంతతో వదలక
మరిమరి ప్రశ్న జేయగను
వైశ్యులు వినియు సహించలేక
భగ్నమయ్యెదవు పో పొమ్మనిరి॥ 25

గంధర్వుండు మాటలకోర్వక
శాపము బెట్టెద వినుడనియు
వైశ్యులు భూలోకంబును జేరి
అగ్నిలో దగ్ధంబగుదురనే 26

దుష్టుడవైన చిత్రకంతుడా
నిరాపరాధులమగు మమ్ము
యిట్లుశపించిన శాపంబునకును
మిముశపింతుము వినుమనిరి॥ 27

ఈలోకమును వీడినవాడై
భ్రష్టతనొంది భువియందు
నరుడై బుట్టి హాహాత్తుగానే
ధ్వనివిని శిరము బ్రద్దలగు॥ 28

గంధర్వునకు వైశ్యోత్తములకు
శాపంబులు ఇటుజరిగియును
వైశ్యులు ఈశుని సన్నిధిజేరి
శుద్ధచిత్తులై యుండిరిగా॥ 29

గంధర్వుండు దుఃఖించుచును
నిట్టూర్పులను విడచుచును
మన్మథ వేదన బొందుచు దాను
వొచ్చినదారిని వెళ్ళెనుగా॥ 30

గంధర్వుడు వైశ్యఋషుల అన్యోన్యశాపము॥

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ద్వాదశో ఽ ధ్యాయః (12)

కైలాసంబున వైశ్యగృహస్థులు
రత్నపగడముల స్తంభముల
మంటపంబునా కూర్చొని అందరు
యోచన జేయుచు ఇట్లనిరి॥ 1

మనవంశమునా మేనల్లునకు
కన్యక నిచ్చుట ఆచారమ్
అట్లు జేయకా తప్పి నడచినా
వంశాచారము నాశమగు॥ 2

యిట్లుండగను చిత్రకంఠుడు
మనపై మిక్కిలి కోపముతో
శాపమిచ్చెను దుర్మార్గుండై
శాపము తప్పక జరుగునుగా॥ 3

కాగలదేమో అయ్యోతీరును
కన్యను అల్లునకిచ్చెదము
తప్పి నడచినా అసత్యమగును
అధికపాపము గలుగునుగా॥ 4

వంశహానిలో ప్రాణహానిలో
గోబ్రాహ్మణులా వధయందు
మాట తప్పినా భయములేదనా
అల్లుడు మనలా దూషించు॥ 5

తల్లి వంశము తండ్రివంశము
విడచి యితరుల కిచ్చినచో
నరకంబనియు శాస్త్రము దెల్పు
యితరుల కిచ్చిన నిట్లగును॥ 6

చిత్రకంఠుడు కోపయుక్తుడై
తప్పక మనలా బాధించు
ఇన్ని విధములా అనర్థమే యగు
అయ్యో యేమి జేయవలె॥ 7

పరిపరివిధముల చింత చేయుచు
ఏమి తోచకా యుండగను
ఆసమయంబున బ్రహ్మశ్రేష్ఠుడగు
కణ్వమహాఋషి కనుపించే॥ 8

ఈశుని స్తుతించి గంగస్నానముకు
వెడలెడి మహర్షి సన్నిధిని
వైశ్యులు జేరి వినయము తోడ
ఈవృత్తాంతము వివరించి॥ 9

స్వామీ తమను బాగుగ దెలసి
ధర్మసందేహము దీర్చుడని
పరిపరివిధముల ప్రార్థనజేయ
మహర్షి చంద్రుడు ఇట్లనెను॥ 10

చిత్రకంఠుని భీతిచే మీరు
ఆడిగిన ధర్మము విహితంబే
వేదసమ్మతము బ్రహ్మనియమము
మూడువర్ణముల ధర్మములో॥ 11

వైశ్యుల కర్మకు ఋగ్వేదమునా
మేనల్లునకిచ్చుట విధిగలదు
ఈధర్మంబు తప్పిన వైశ్యులు
తప్పక పతనము బొందెదరు॥ 12

దర్భతో సంస్కరింపగ బడినా
ఆజ్యము అగ్నికి ప్రియమట్లు
మేనమామకు బుట్టిన పుత్రిక
మేనల్లునికి ప్రియంబగు॥ 13

సకలప్రయత్నంబుల జేసియును
కన్య నివ్వడని వెడలగనె
వైశ్యులు ఇట్లే నిశ్చయించియు
తమతమ గృహముల జేరిరిగా॥ 14

చిత్రకంఠుడు కీర్తికన్యను
చింతన జేయుచు యోచించే
సుదంతుండగు మేనల్లునినే
జంపిన కన్యక దొరకుననని॥ 15

దుర్గార్గుండై కోపము బొంది
మాయాశక్తిని సృజించియు
మేనల్లుని పై పంపగ వెంటనె
అల్లుడు శీఘ్రమె శోషించె॥ 16

మానాభుండు మొదలగు వైశ్యులు
నందీశ్వరుని శరణొంది
మా కులంబును రక్షించు మని
బహు దీనతతో ప్రార్థింపా॥ 17

చిత్రకంఠుని మాయను దెల్పి
యీశుం డితనికి ఇచ్చెనని
మాయను ధ్వంసము జేయు నుపాయము
విను డని నంది యిట్లనియె॥ 18

మాయా శక్తికి ఏడు దినంబులె
గడువు అందునా మీరిపుడు
కీర్తి సుదంతుల కల్పవృక్షము
క్రింద నుంచినా శుభ మనెను॥ 19

ఈ రహస్యము వైశ్యులు దెలసి
ఏడు రాత్రులు వుభయులను
కల్పవృక్షము క్రింద నుంచగా
మాయ నశించి సుఖించిరి॥ 20

ఇట్లుండగను నొక సమయంబున
దేవత లందరు కైలాసం
జేరియు ఈశుని దర్శించుటకై
ద్వారంబునకూ రాగాను॥ 21

బృంగీశ్వరుడు ద్వారము నందున
ఆపి వేసెను విడువకనె
వైశ్యులు పరిహాసంబును జేయగ
కోపము జెంది దేవతలు॥ 22

హేళన జేసిన వైశ్యుల చూచి
శాపము బెట్టిరి దేవతలు
హేళన జేసిన దృష్టుల వంశము
నశించు నిస్సంశయ మనియు॥ 23

దేవగణమును విప్రోత్తములను
పరిహాసించినా మీ కిపుడు
సంతాన హీనత అమరుల బాధన
వైశ్యులు భయంబు జెందియును॥ 24

దిక్పాలకులను ప్రార్థన జేసి
అంజలి బద్ధులై నిల్వగనే
దిక్పాలకులు ఈ విధంబుగా
జేసిన నివృత్తి యని దెల్ప॥ 25

దిక్పాలకుల ఆజ్ఞ మేరకు
వివాహా వేదిక మధ్యమునా
ముప్పది మూడు కోట్ల దేవతల
ఆరాధనము జేసిరిగా॥ 26

కీర్తికన్యకా సుదంతు లుభయుల
వివాహా మైనా త్రిదినమున
మందాకినికి వెడలిన వారై
జలక్రీడలా సల్పగను॥ 27

చిత్రకంతుని మాయచె వైశ్యులు
జలమున మునుగుచు భయంబునా
వొడ్డు జేరుటకు శక్తిహీనులై
గౌరీదేవిని ప్రార్థింపా॥ 28

సాంబుడు గౌరి అనుగ్రహించి
రెండు నౌకలు పంపగను
వైశ్యులు నౌకలో కూర్చొని శీఘ్రమె
తమ గృహంబులా జేరిరిగా॥ 29

మాయ నశించె నా కృత్యములు
నిరర్థకంబై పోయెనని
చిత్రకంతుడు క్రోధము తోడ
కత్తితో ఛేదించుట కొచ్చె॥ 30

వైశ్యోత్తములు భీతి జెందియు
నందీశ్వరుని శరణొందా
చపలుడు అధముడు దురాత్ముడైన
చిత్రకంఠుని దహించియు॥ 31

నందీశ్వరుడు వైశ్యుల గాంచి
ఈ గంధర్వుడు మునుముందు
మీకు శత్రువగు నిస్సంశయ మని
అంతర్ధానుం డాయెనుగా॥ 32

వైశ్య ఋషులు విచారమంది
తమ యాశ్రమముల జేరియును
బహు కాలంబు సుఖించి రనియు
సూతుడు ఋషులకు వివరించే॥ 33

కీర్తి కన్యక వివాహం, చిత్రకంఠుని వధ

  

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## త్రయోదశో ఽధ్యాయః (13)

సాలంకాయన ఋషి యిటు బల్కెను
దాక్షాయణి దక్షుని యజ్ఞమున
నశించగానే పరమేశ్వరుడు
గిరిలో నిలచెను తపస్సుకు॥ 1

వైశ్యఋషులు ఈమాటను వినియు
దాక్షాయణి నశించు వృత్తాంతం
ఓ ఋషివర్యా దెల్పుడు అనగా
సాలంకాయను డిటు జెప్పె॥ 2

బ్రహ్మదేవుడు దక్షబ్రహ్మకు
నవబ్రహ్మాధిత్యము నివ్వ
దక్షుడు గర్వాయుక్తుం డగుచు
వాజిపేయమను యజ్ఞమును॥ 3

బహువైభవముగ జేసియు నేను
రుద్రుడు సఖులను విడతునని
పితరులు సురులు పురుగులు మొదలగు
వార్లను స్వాయముగ దా బిలచే॥ 4

దక్షబ్రహ్మ యజ్ఞము కొరకై
వుత్సాహాముతో గుంపులుగా
గగనమార్గమున కలకల లాడుచు
బయలు దేరిరి భార్యలతో॥ 5

లోకనాథుడగు ఈశుని భార్య
ఈ వృత్తాంతము వినగానే
ప్రాణనాయక అదిగో గనుమా
వినుమా శబ్దాల్ యని నుడివి॥ 6

దక్షప్రజాపతి యగు మీమామ
వాజిపేయ మను యజ్ఞమును
జేయును తమకు తెలియద ఏమి
శీఘ్రమె మనము వెడలవలె॥ 7

ఈ పలుకులను వినిన వెంటనే
ఈశుడు సతితో ఇటుబల్కె
మంగళవతి నామాటలు వినవే
మీ తండ్రి దక్షుడు గర్వముచె॥ 8

నన్ను నిందన జేసియు బిలువక
యజ్ఞము జేయుచు నున్నాడు
పోయిన మనల దూలనాడును
పిలువక పో తగదని బలుకా॥ 9

పుట్టినింటికి మెట్టినింటికి
గురువుల తండ్రుల గృహములకు
పిలువ కుండగా పోయిన గాని
తప్పు లేదు కద ఓనాథా॥ 10

యజ్ఞవాటికకు బంధువు లందరు
నాచెల్లెండ్రు వచ్చెదరు
తల్లితండ్రులు యజ్ఞము జేయుట
ఎంతో వింతా వెడల వలె॥ 11

ప్రాణనాయకి దక్షుడు నాకు
అధిక శత్రువు పోయినచో
గర్వపలుకులా నిందన జేయును
ఎట్లు ఓర్తువే ఓసఖియా॥ 12

మానవంతుల దుష్ట వాక్యములు
బాణము కంటే బాధ కదా
దుర్వాక్యములా సహించలేవు
పోవుట అనిష్టమని బల్కె॥ 13

ఓ దేవేశా స్త్రీలకు గొప్పది
పుట్టినిల్లు కద ప్రాణంబు
నేను యజ్ఞమునకు పోవకుండినా
ప్రాణ మిడుతు మీ ఎదుట నేను॥ 14

సర్వజ్ఞుండగు శంకరు డపుడు
ముందు కార్యము జింతించి
ఊరకుండగా సతియు గాంచియు
బయలు దేరుటకు యత్నించె॥ 15

పుట్టినింటికి పోవుటకొరకు
దాక్షాయణి త్వరపడు చుండా
ఆనందముతో నంది లేవగా
అంబిక ఆరోహించెనుగా॥ 16

మణిభద్రుండు యక్షులు గుహ్యులు
భూతనాయకుల చేరికతో
దాక్షాయణియు ముందు నడువగా
సఖీమణులు అరుదెంచియును॥ 17

ఒకసఖి తెల్లని గొడుగును బట్టెను
వొకసఖి అద్దము జూపెనుగా
చిలుకల బట్టిరి యిరుపార్శ్వములా
బెత్తము కమలము లెత్తిరిగా॥ 18

ముందర కొందరు దాసీజనులు
పుష్పంబులనూ జల్లుచునూ
వాయిద్యములను వాయించుచునూ
వైభవంబున జనెనంత॥ 19

దక్షబ్రహ్మ యజ్ఞశాలకు
దాక్షాయణి అరుదెంచగనే
గాంచెను యజ్ఞశాల వైభవము
చాలా వేడుక నుండెనుగా॥ 20

బంధువు లందరు దాక్షాయణిని
చాలా ఆదరణము జేయ
దాక్షాయణియు తృప్తి చెందక
ఖిన్న హృదయయై యుండెనుగా॥ 21

దక్షబ్రహ్మ ఋత్విక్కులతో
యజ్ఞము నందు హవిస్సులు
వేల్చుచు నుండగ దధీచి లేచి
గంభీరముగా బల్కెనుగా॥ 22

యజ్ఞస్వరూపుం డగు శంకరునకు
హవిర్భాగము యివ్వక నే
చేసిన క్రతువు భ్రష్టత నొందును
మంచిది గాదనె దక్షునికి॥ 23

దక్షుడు క్రోధా వేశము బొందియు
కన్నుల నెర్రగ జేసుకొని
గర్వము తోడ కేకలు బెట్టి
ఈ పలుకులనూ బలికెనుగా॥ 24

శివుని గాంచిన జను లందరును
మంగళు డనియూ బలికెదరు
స్మశాన మందు నివాస ముండి
ప్రేత గణంబులె గూడునుగా॥ 25

దిగంబరుండై వున్మత్తతతో
బూడిద నంతా పూసుకొని
కరంబు నందు పుర్రెను బట్టి
భిక్షాటనమే జేయునుగా॥ 26

అమంగళునికి హావిర్భాగము
ఇచ్చుట మనకు తగని పని
యని బల్కియును బుత్విక్కులచే
యజ్ఞము జేయుచు నుండెనుగా॥ 27

ఈశుని కుండుట కిల్లే లేదు
వల్లకాటిలో కాపురము
సేవకు లెవరు యుండనె యుండరు
ప్రేతగణంబులె సేవకులు॥ 28

భూషణంబులు అసలే లేవు
త్రాచుపాములే భూషణముల్
రూప మైననూ చూచెద మంటె
ఎగుడూ దిగుడూ కండ్లుండు॥ 29

వెండ్రుకలన్నీ మర్రిఊడలు
కంఠము నిండా విష ముండు
శరీర మన్నా సుందర మంటె
పాండు రోగి వలె రంగుండు॥ 30

కట్టగ గుడ్డ మొదలే లేదు
పులిచర్మంబే బట్టలుగా
కనక పాత్రలు అసలే లేవు
కనక పాత్రయే కపాలము॥ 31

దక్షుని పుత్రిక అవమానంబును
సహించ లేక క్రోధముతో
మహిషమర్దని రూపము దాల్చి
వింతగ బల్కెను ఈ రీతి॥ 32

ఓకీ మూర్ఖా యిటు బల్కెదవా
విశ్వ మంతయూ ఆలయమూ
వైరాగ్యమునూ జూపుట కొరకై
వేసెను వేషము లన్నియును॥ 33

కట్ట గుడ్డలూ ఆహారంబు
అన్నియు గల్గిన అందరునూ
ఆ పరమేశుని ఆదరంబుగా
శరణని నమ్మిరి తెలియుము రా॥ 34

క్రోధావేశము ప్రబలుచు నుండగా
ప్రబలంబగు మంటలు బుట్టె
చెప్పగ లేని రూపము గల్గి
క్షణములో దగ్ధం బయ్యెనుగా॥ 35

నారదు డంతా యీవృత్తాంతము
నాగభూషణుని కెరిగించె
నాణ్యమైన ఒక జడనూ బెరికి
నేలను బార వేసెనుగా॥ 36

అంతలో ప్రళయా కాలుని రీతిగ
నల్లని పొగలు గ్రిమ్మచును
వేయి కరంబులు గల్గిన మూర్తి
వీరభద్రుడు జన్మించె॥ 37

పటపట పండ్లు కొరుకుచు నుండియు
కన్నుల నెర్రగ జేసుకొని
క్రోధావేశము గూడియు భయమున
అట్టహాసముగ యిటు బల్కె॥ 38

తండ్రీ నాకు ఆజ్ఞ యేమని
చేతుల నెత్తి అడిగెనుగా
శంకరు డంత ఆజ్ఞను జేసె
దక్షధ్వంసము చేయు మనె॥ 39

ప్రళయ కాలము కాలుని రీతిగ
యజ్ఞవాటిక జేరియును
దక్షుని బట్టి మెడను దుంచియు
శిరమును వేసెను గుండమున॥ 40

యజ్ఞవాటికలో చేరినవారిని
విధవిధంబుల హింసించి
యజ్ఞవాటికను ధ్వంశము జేయుచు
భయోత్పాతము గలిగించె॥ 41

వీరభద్రుడు శివసాన్నిధ్యము
చేరియు అంతా వివరించి
శివుని చె ఆశీర్వాదము బొందియు
భూతగణంబుల గూడెనుగా॥ 42

దేవతలందరు దుఃఖము జెంది
విష్ణుదేవుని జేరియును
యోచించియును అందరుగూడి
కైలాసమునకు జేరిరిగా॥ 43

బ్రహ్మ విష్ణు దేవతలందరు
సాంబుని స్తోత్రము జేయగను
శంకరుడందరి ననుగ్రహించి
అందరిక్షేమము జేసెనుగా॥ 44

ఈశుడు హిమవత్పర్వతంబున
సనకసనందులు బాగడగనే
ఘోరతపస్సును జేయగ మొదలిడి
నిశ్చలంబుగా నిలచెనుగా॥ 45

దాక్షాయణి దగ్ధము, దక్ష గర్వభంగం,
దక్ష యజ్ఞధ్వంసము



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

చతుర్థోఽధ్యాయః (14)

బ్రహ్మేంద్రాదులు శూలపాణిని
అనేకవిధముల కొనియాడి
ఈశుని మహిమా జెప్పుకొనుచును
స్వస్థానంబుల జేరిరిగా॥ 1

బహుకాలంబు జరిగినపిమ్మట
తారకాసురుం డనువాడు
దీర్ఘకాలము తపస్సుజేసి
బ్రహ్మను ప్రసన్నునిగ జేసి॥ 2

బ్రహ్మచే తాను వరములబొంది
వరగర్వముచే గర్వించి
నాల్గువిధముల బలంబుచేత
భుజగర్వముచే ఇటుజేసె॥ 3

ఇంద్రుని వరుణుని నైరుతియముని
అగ్నిహోత్రుని గుబేరుని
జయించి అమరావతిలో నిలచి
కిన్నరస్త్రీలను చెరబెట్టి॥ 4

యూపస్తంభాల్ విరుగగొట్టియు
పర్ణశాలలా పడద్రోసి
తాపసోత్తముల యజ్ఞాల్ చెరిచి
రక్తవర్షముల కురిపించి॥ 5

ఋషుల బ్రాహ్మణుల యజ్ఞాచరణాల్
పూర్తిగ లేకుండజేసి
కర్మహీనులజేసి తారకుడు
లోకకంటకుండై ప్రబలె॥ 6

ఆసమయంబున మహేశ్వరుండు
ఘోరతపంబున నిలువగను
మహావిష్ణువు చింతతోగూడి
సతీదేవియగు సోదరిని॥ 7

మేనకయందు జనించునట్లు
జేయుము విధాతయని బల్క
బ్రహ్మనేర్పున మేనక శీఘ్రము
గర్భము ధరించె వింతగను॥ 8

హిమవంతుడు మేనక పుభయులు
మహానందమున మెలగగనూ
శుభముహుర్త్తమున పార్వతిబుట్టె
ఆసమయంబున నిట్లాయె॥ 9

పుష్పవర్షము దేవవాద్యములు
చల్లనిమెల్లని మారుతము
భూమిపైరులతో గూడినదాయె
బ్రహ్మదేవతలు అరుదెంచి॥ 10

లోకేశ్వరియగు దేవిని స్తుతించి
పార్వతి నామము పేరిడియు
సంతోషముతో విధాత జనగా
అంబిక చంద్రునివలె బెరిగె॥ 11

దిక్పాలకులు దేవతలందరు
బ్రహ్మదేవుని జేరియును
ఖేదముతో బహుస్తుతి జేయగనే
బ్రహ్మ సురులతో ఇట్లనెను॥ 12

తారకాసురుని కృత్యంబునకు
భయపడవలదు సురులారా
పార్వతి పరమేశ్వరుల తేజమున
అసురుడు నశించు నిశ్చయము॥ 13

రుద్రుడు దృఢమగు తపస్సు జేయ
శివుని గోరును పార్వతియు
వుభయుల కల్యాణంబు ప్రయత్నము
మన్మథుచేత జేయుడనా॥ 14

బ్రహ్మవచనములు బాగున్నవని
ఇంద్రుడు అమరులు ప్రార్థింపా
మచ్చ్యపతాకము కంపించగనూ
చిలుకవాహనము రథమెక్కి॥ 15

మన్మథు డెంటనె అరుదెంచియును
ఇంద్రున కంజలిగావించి
ఏమి కార్యమని మన్మథుడడుగా
ఇంద్రుడు ప్రీతితో నిట్లనెనూ॥ 16

వత్సా నీకు శుభాగమనమా
నీకు మంగళము వినుమనియు
కైలాస కందరమందున ఈశుడు
తపస్సు చేయుచునున్నాడు॥ 17

అభేద్యమైన ఈశుని తపము
ధైర్యము నీవు చెడుపవలె
స్వర్గరాజ్యము నిలచుట జూడ
నీ చేతిలోవున్నది యనగా॥ 18

మన్మథుడపుడు గర్వాంధుండై
గంభీరముగా ఇట్లనెను
ఓప్రభు ఈశుని సమీపంబుకు
యిపుడే వెళ్ళెదనని తెల్పి॥ 19

చెరుకు విల్లును చెవిదాకలాగి
ధనస్సు ఎక్కుబెట్టియును
అల్లెత్రాటిలో పుష్పబాణమున
ఈశుని ధైర్యము సడలింతు॥ 20

పుష్పబాణము బట్టియుండెడి
నా ఎదుటెవ్వడు నిలచునోకో
నిరాహారులు సాత్వికులైన
నారచీరలు ధరించినా॥ 21

పండుటాకులు భక్షించినను
బ్రహ్మధ్యానము పరులైన
నిర్దోషులగు యతులునైనను
నాకు దాస్యము చేయింతు॥ 22

చపలచిత్తుడు తామసగుణుడు
శివుడన నాకు లెక్కేమి
క్షణమాత్రమునా శివుని మనస్సు
అపహరింతునని పల్కనుగా॥ 23

రతీదేవి ఈమాటల వినియు
భర్తకరంబును బట్టియును
అయ్యో నాథా ఆహా ఏమిది
ఈశుని మహిమా ఎరుగరోకో॥ 24

దక్షుడు పరాభవంబును బొందె
బ్రహ్మకు శిరస్సు తెగిపోయె
తపస్సు చెరచి ఎందరెందరో
వృథాల్ శిలలు కాలేదా॥ 25



మన్మథ విజయము

శివుని తపస్సు చెరచిన భర్గుడు
మూడవనేత్రము దెరచినచో
తప్పక భస్మంబై యెదరనియు
నాథా పోవలదని నుడివె॥ 26

రతీదేవిని ఇంద్రుడుగాంచి
ధర్మంబులను బోధించి
నే వెడలెదనని ధైర్యము జెప్పగ
వూరకనిలచెను తోచకను॥ 27

మన్మథుడంతా తన పరికరముల
చాలగబట్టి జనుదెంచి
ఈశుని సమీపమందున జేరియు
బాగుగ వేశెను బాణములు 28

నిశ్చలుడైన యీశుం డంతలొ
సమాధివీడి రోషముతో
సూర్యునివంటి ముఖంబుగల్గి
భయంకరంబుగ కనుపించె॥ 29

కనుబొమ్మలముడి ప్రసరింపగను
విస్ఫులింగములు పైకెగరె
కాలపాశముతో సమమైనట్టి
మంట ఒక్కటి ప్రబలెనుగా॥ 30

ఫాలభాగమున మూడవనేత్రము
మంటసమూహము వెలువడియె
చూచుట కదియు కోటి మెరుపులు
శతసహస్రములై సూర్యులుగా॥ 31

మిక్కిలి భయంకరంబగు మంటచే
చరాచరంబులు భీతిల్లె
బ్రహ్మాండంబు గడగడ వణికె
దిక్కులంతటా జ్వాలించెగా॥ 32

ఆసమయంబున అగ్ని దాకిన
మిడుత రీతిగా మన్మథుడు
ధనుర్బాణ తూణీరంబులతో
భస్మమైయ్యెను మన్మథుడు॥ 33

మన్మథ దహనము



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

పంచదశో௨ధ్యాయః (15)

కపాలధారి కన్నులు దెరువగ
దేవత లందరు అరుదెంచి
పుష్పవర్షములు గురిపించియును
ప్రార్థన జేసిరి బహువిధముల్ 1

భస్మంబైనా భర్తను గాంచి
రతీదేవి దుఃఖముతోడ
తల వెండ్రుకలు వీడియుండగ
పెద్దగ రోదన చేయుచును॥ 2

ప్రాణవల్లభ నన్ను విడచియు
ఎచ్చట నున్నావో నీవు
బ్రతుకుట యెట్లు వంటరినైనే
అనాథ నబలను దీననుగా॥ 3

కమలము బోలిన కన్నులు గల్గిన
సుందరమైన ముఖంబును
ఎప్పుడు చూచిన ముద్దిడు చుంటి
హా యిక ఏమీ దిక్కునియె॥ 4

దీర్ఘము లైన బాహువు లొప్పిన
నీ చేతులతో నను బట్టి
ఎంతో హాయిగ సుఖించు చుండిన
నిను బాసి నే నెట్లుందు॥ 5

నా మాటలను వినకుండగనే
ఈశుని వైరము బూనితివి
నీవిధి కాలవశముచె నిట్లు
సాహసించితివి యీకార్యం॥ 6

పలువిధంబుల రోదన జేయుచు
శివుని స్తోత్రము జేయగనె
సాంబుం డంత కరుణించగను
భర్తను భిక్షగ గోరెనుగా॥ 7

చచ్చిన వారు బ్రతుకుట లేదు
నీ భక్తికి నే కరుణించి
నీకు మాత్రము కనబడు నట్లు
వరమిచ్చితిమి చూడుము నేక॥ 8

రతీదేవి చూచుచు నుండగ
మన్మథు డంతలో గనబడియె
భర్తను గాంచి సంతోషించి
ఉభయులు వేడుక జని రంత. 9

దేవత లంతా సంతోషించి
ఈశుని తోడ బల్కిరిగా
సర్వమంగళ దాతా యనియు
హిమవత్ పుత్రిక యైనదిగా॥ 10

ఆమె అందమును జెప్పగ లేము
నీ చేబట్టుము పార్వతిని
లోకహితంబు చేయుట కొరకై
ఈ పని గావింపుము యనిరి॥ 11

ఇట్లు బల్కియు దేవత లందరు
తమ స్థానంబుడు జేరిరిగా
చంద్రశేఖరుడు కైలాసంబున
స్థిత ప్రజ్ఞుడై యుండెనుగా॥ 12



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## షోడశోఽధ్యాయః (16)

సకల గుణంబుల నిండియుండిన
మునిశ్రేష్ఠుండగు నారదుడు
మహావిష్ణువును చూచుట కొరకు
శ్వేతద్వీపము జేరెనుగా॥ 1

ఆ ద్వీపమున సౌధము గలదు
చింతామణి యని పేరుండు
కోటి సూర్యుల ప్రకాశ వంతము
కోటి చంద్రుల చల్లదనం॥ 2

నవరత్నముల స్తంభము లొప్పు
అచ్చటి సిద్ధులు యక్షులును
సనక సనందులు వాలకిల్యులు
దేవగణంబుల సమూహాము॥ 3

మేడమధ్యలో సింహాసనమున
భక్తుల గోష్ఠిలో గూర్చున్న
మహావిష్ణువును గాంచి నారదుడు
నమస్కరించి నిలబడియె॥ 4

శ్రీహరి యిట్లు ఆజ్ఞను జేసె
నారద శీఘ్రమె అరుదెంచి
వైరాగ్యంబును బూనిన యీశుని
విషయంబులలో చేర్చు మిక 5

నిరాహారియై తపస్సు జేయుచు
పార్వతి నిన్నే స్మరించుచు
ఖేదము నొందు చున్నది గాన
శివుని ఆమెకు గూర్పు మనె॥ 6

శ్రీహరి ఆజ్ఞ బొంది నారదుడు
వెండి కొండకు అరుదెంచి
చంద్రశేఖరుని గాంచిన వాడై
ఈ రీతిగను జేసెనుగా॥ 7

ఆనంద బాష్పముల అభిషేకంబు
చల్లని చూపుల శ్రీగంధం
వాక్కు లనెడి కుసుమంబులును
గానం బనెడి నైవేద్యం॥ 8

ఈశుని యిట్లు అర్చన జేసి
మృదుమధురంబగు వాక్కులచే
పాటలు పాడి నాట్యము జేయ
మహేశ్వరు డిట్లు బల్కెనుగా॥ 9

బ్రహ్మమానస పుత్రుండైనా
నారద మునిని వీక్షించి
నీ చూపులచే నీ వాక్కులచే
ప్రపంచ మంతా పవిత్రము॥ 10

ఈ మాటలను వినిన నారదుడు
తన సంచారము వివరించె
అంతలో శివుడు హఠాత్తు గాను
ప్రశ్నించె నీ విషయమును॥ 11

స్త్రీ లందరిలో ప్రసిద్ధి యెవరు
రూపగుణముల నొప్పునది
నా కెరిగింపుము చక్కగ ననగా
నారదు డపుడూ యిటు బల్కె॥ 12

మేనక పుత్రిక ఒక కన్యకయే
ముల్లోకములలో ప్రసిద్ధిగా
మన్మథ విజయ పతాక మైనది
రూపము వర్ణింపగ తరమా॥ 13

ఆమె రూపము ఆదిశేషుడు
లేక బ్రహ్మయో బృహస్పతియో
వారికి సాధ్యము కాదూ తమ రే
వర్ణించెదరని నా వూహ॥ 14

హిమవత్ పుత్రిక పార్వతి నీకు
తగిన కన్యకా తమ యిష్టం
పార్వతి చాలా పరితపించుచు
మిమ్ముల గూర్చి చింతించుచు॥ 15

యిట్లు నేర్పుగా జెప్పి నారదుడు
సంచారమునకు వెడలెనుగా
అటుపై లోకము నందరు బాగుగ
ఈశుని పెండ్లే గోరిరిగా॥ 16

లోకులకర్మ పరిపక్వముచే
శివునకు పార్వతిపై ప్రేమ
బాగుగ గనియు బులకాంకితుడై
జూడగగోరెను పార్వతిని॥ 17

సాంబుం డంతా సరగున వెడలి
హిమవత్పర్వతమును జేర
పార్వతి వేయి సఖురాండ్రులతో
పువులు గోయుచు నుండెనుగా॥ 18

ఇటునటు జూచుచు పువ్వుల గోయుచు
సఖురాండ్రులతో తిరుగుచును
మెరుపుతీగవలె నొప్పుచునున్న
పార్వతినపుడూ గాంచెనుగా॥ 19

చంద్రశేఖరుడు ఆశ్చర్యంబున
చూచి మునిగి ఆనందములో
మన్మథ బాధచె పరితపించుచు
చాలా వేదన బడుచుండె॥ 20

శివునకు గౌరీగుణములు నారదుడు చెప్పుట

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## సప్తదశో ఽధ్యాయః (17)

అంతలో పార్వతి సఖురాంద్రులతో
మానససరస్సు కరుదెంచి
పుణ్యజలంబుల బ్రవేశించియు
జలక్రీడ లాడుచునుండే॥ 1

జలక్రీడ లాడుచునుండగ
చూచినవింత వివరింతు
ముఖంబులేమొ కమలము లొప్పుచు
చిరునగువేమొ హంసలుగా॥ 2

చూపుల నెడి జలప్రవాహముతోడ
శిరోజంబులను నాచులతో
నేత్రముల నెడి కలువలతోడ
ఒప్పుచునుండెను ఈరీతి॥ 3

అట్టహాసముగ నాటలనాడుచు
జలముల చేతుల జల్లుచును
పలువిధంబులగు విలాసంబులతో
జలక్రీడలూ జరిగెనుగా॥ 4

స్నానములాడి యొడ్డున జేరి
సమ్మతంబుగ గూర్చొనిరి
చెలియలందరు ఆభరణంబులు
అలంకరించిరి వేడుకతో॥ 5

సంతోషముగా పార్వతి దేవికి
పట్టువస్త్రములు గట్టిరిగా
రత్నములొప్పెడి ఆభరణంబులె
పార్వతి దేవికి బెట్టిరిగా॥ 6

గౌరీ దేవి భూషణ కాంతులు
సకల దిక్కులుగ నగబడియె
కస్తూరి తిలక వాసన లంటి
మనోహరంబుగ ప్రసరించె॥ 7

అటుపై పార్వతి భక్తిశ్రద్ధలతో
సైకత లింగము జేసియును
బాగుగ బుష్పాలు జేత బుచ్చుకొని
శ్రీఘ్రమె సాంబుని బూజించె॥ 8

ధూపదీప నైవేద్యంబులతో
స్తోత్రము జేసెను బహురీతి
చక్కగ వీణను జేతబుచ్చుకొని
గానాలాపము జేయగను॥ 9

ఆగానమునకు మోడులు చిగిర్చెను
మృగజాతులు ముగ్ధమునొందె
కర్ణములందు అమృతము గురిసెను
పాషాణములు ద్రవించెను॥ 10

ఓ దయానిధే నామాటలువిని
నీలో చేర్చుకొ నన్నని యె
నాప్రాణంబులు నామనంబును
నీకర్పించితి ఓ దేవా॥ 11

విధవిధంబులగు ఆనందముతో
ప్రణిపాతంబును జేసెనుగా
ఈమాటలను చాయగ శివుడు
ఆలకించియు అరుదెంచె॥ 12

పార్వతిచెంతకు పరమేశ్వరుడు
వృద్ధబ్రాహ్మణ వేషముతో
అరుదెంచగనే పార్వతిగాంచి
సువర్ణపీఠము వేసెనుగా॥ 13

కపటబ్రాహ్మణ వృద్ధునిగాంచి
పార్వతికుశలము ప్రశ్నించె
ప్రసన్నుడగుచు సంతోషమున
సాధ్వీమణితో యిటుబల్కె॥ 14

పార్వతిదేవి నీకు శుభంబగు
నీవెవరవు నీ పేరేమి
ఎందుకు ఈశునిపూజ చేసితివి
కోరునదేమొ దెల్పుమనెన్॥ 15

చేరువనున్న సఖియను గాంచి
హిమవంతుని పుత్రికననుచు
గౌరియనియు ప్రశిద్ధిజెందితి
ఈశ్వరుడే పతిగోరితినా॥ 16

పార్వతిదేవి సిగ్గును జెందియు
ప్రౌఢసఖితో తనయిష్టం
చెప్పించియును తన యిష్టంబును
శిద్ధించునాయని యడిగించె॥ 17

పరమేశ్వరుడు పరీక్షించుటకు
కపటముతో యిటు బల్కెనుగా
అమ్మా అతనికి జాతీలేదు
జననీజనకులు లేరమ్మా॥ 18

అయ్యయ్యో ఆమొదటి భిక్షుకుడు
స్మశానమందే కాపురము
గృహంబైననూ మొదలేలేదు
భూషణంబులే పాములుగా॥ 19

ఎప్పుడుచూచిన ముసలెద్దెక్కును
భిక్షాన్నంబే జీవనము
కట్టుకోనుటకు బట్టేలేదు
పులిచర్మంబే గతియయ్యో॥ 20

అయ్యయ్యో సఖి ఎవరు చెప్పిరె
ఎందరు లేరు లోకములో
అందరినొదలి ఆ బికారిని
నీ భాగ్యమనీ ఓపితివో॥ 21

గరుడగంధర్వ సిద్ధసాధ్యులు
విధ్యాధరులను వెదకియునె
నీకుగూర్చినా సుఖంతువమ్మా
అటుగాకున్న ఇదివినుమా॥ 22

అట్టివానిని వరించినీవు
యే భోగంబులు బొందెదవో
అమ్మా వానిని గోరుటకంటె
నన్ను వరించుట మంచిదనెన్॥ 23

వృద్ధమూర్ఖుడు పలికిన పలుకులు
వినిన పార్వతీ కోపముతో
చేతులతోన చెవులు మూసుకొని
వానిని బంపుడు శీఘ్రమనెన్॥ 24

ఒకసఖి జడనుబట్టి బీకెను
ఒకసఖి గ్రంధము లాగెనుగా
మరిఒక సఖియు కమండలమును
కొందదు జేసిరి పరిహాసం॥ 25

సఖురాండ్రందరు బాధపెట్టగ
శంకరుడతని నిజరూపం
వనితల కనులకు కనబడగానే
రెప్పవాల్చకా జూచిరిగా॥ 26

పార్వతి సిగ్గుచె వెడలుచునుండగ
శంకరుడంతలో చేబట్టి
ఓ సఖియా యీ శుభదినంబునా
పూలహారము వేయుమనెా॥ 27

దేవీలజ్జతో సంతోషించియు
కుతూహలంబుతో యిట్లనెను
నాతండ్రీ నను మీకే యిచ్చును
శీఘ్రమె ప్రశ్నను జేయుడనెన్॥ 28

త్వరితమె హస్తము విదలించుకొని
వెడలిపోయెను పార్వతియు
విరహవేదన బొందిన ఈశుడు
శీఘ్రమె చేరెను రజతాద్రి॥ 29

శివుడు కపటవేషముతో పార్వతిని జూచుట



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

అష్టాదశోఽధ్యాయః (18)

సాంబుడు గౌరీదేవిని గోరుట
నారదుడూ వివరింప
మహావిష్ణువుకు స్పష్టము దెలియుగ
నంద సునందులు బొగడిరిగా॥ 1

వెండికొండకూ ప్రయాణమాయెను
విష్ణు రాకనూ శివు డెరిగి
నందిని యెక్కి బయలు దేరెను
వుభయులు కలసిరి సంప్రీతి॥ 2

హరిహరు లుభయులు అన్యోన్యముగా
ఆలింగనములు జేసుకొనీ
శివ కేశవులు కుశల ప్రశ్నలు
జేయుచు యోచన మొదలిడిరి 3

గౌరీసాంబుల వివాహ భారము
నారాయణుడే వహించియూ
విష్ణువు సప్తఋషులను పిలచి
వారల తోడ యిటు బల్కె॥ 4

ఓ ఋషులారా మీరిచే యిప్పుడు
గౌరీశివుల వివాహము
చేయుట కొరకై హిమవంతునికీ
ఈవృత్తాంతము దెల్పుడనె॥ 5

ఆదిలో పార్వతి అండోద్భవమున
పిమ్మట దక్షుని వుదరమున
ఇప్పుడు పర్వత పుత్రిక యనియు
పుట్టిన విషయము దెల్పు డనె॥ 6

మహావిష్ణువు చెప్పిన మాటలు
నాణ్యంబుగను విని ఋషులు
కల్యాణంబు నిశ్చయించుటకు
సంతోషంబున వెడలిరిగా 7

సప్తఋషుల రాకను గనిన
హిమవంతుడు ఎదురేగియును
పరమానందము చెందియు వారికి
బహుసత్కారము గావించి॥ 8

మహాత్ములారా కుశలమ మీరు
మీ రాకడచే మాగృహము
మా జన్మంబులు సఫలంబైనవి
పెద్దలు వూరక వచ్చెదరా॥ 9

హిమవంతుండు పల్కిన పల్కులు
సప్తఋషులును వినగానే
పర్వతరాజా పరమేశ్వరుడు
పంపగ వస్తిమి మే మనిరి॥ 10

నీ పుత్రిక యగు పార్వతి కొరకై
పరమేశ్వరు డెప్పుడు చింతించు
గనుక నామెను సాంబుని కొసగుము
పూర్వమె నిశ్చయ మైనదిగా॥ 11

నీ పుత్రికకు శుభంబు గల్గును
లక్ష్మీనారాయణుల వలెన్
శచీచంద్రుల సరస్వతిబ్రహ్మల
ఛాయాసూర్యుల వలె నుండు॥ 12

వీరి వివాహము చేయుట వలన
సాంబుడు నీకు అల్లుడగున్॥
నీ జన్మంబు సఫలంబగును
కార్యము సిద్ధము జేయు మనెన్॥ 13

హిమవంతుండు సంతోషముతో
బల్కెను ఋషులను గాంచియును
మహాత్ములారా వివాహ కార్యము
ప్రయత్నించెదము యని బల్కె॥ 14

సప్తఋషులు సంతోషముతో
శీఘ్రము శివకేశవులకునూ
ఈ వృత్తాంతము బాగుగ దెలుపగ
శివకేశవులు ఒప్పిరిగా॥ 15



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ఏకోవింశో ఽ ధ్యా యః (19)

ఈశ్వరు డపుడూ విరహా వేదన
ఓర్వఁగ లేక విష్ణువుతో
నీవు మిత్రుడవు నా కల్యాణము
త్వరితము జేయుము యని వే॥ 1

విష్ణుబ్రహ్మా వేల్పుల గూడి
బృంగీశ్వరుని బిలచియును
శివుని కల్యాణము లోకంబులకు
బాగుగ చాటింపుము బృంగీ॥ 2

కార్యదీక్షకు చెందుని జేసిరి
సిద్ధులు సాధ్యులు కిన్నరులు
పురగులు సనకులు నవగ్రహంబులును
పులహుడు సప్తబ్రహ్మలును 3

యతులు తపస్వులు రాజఋషులును
దుర్వాసుడు విశ్వామిత్రుడును
దేవఋషులు నారదాదులును
కుబేర మొదలగు దిక్పతులు 4

దేవత లందరు దివ్యధ్వనులతో
వీణాధ్వనులతో గంధర్వుల్
జయ జయ ధ్వనులతో యింద్రాలుదును
కైలాసంబును జేరియును 5

ఓ లోకేశ్వర వివాహమునకు
త్వరితమౌ వెడలగ వలయుననీ
భక్త ప్రపత్తుల చూపు
చిరునవ్వు వొప్పుచు శివుడు వెడలె|| 6

హిమవత్ భవనము ఈశుడు జేర
సూర్యుడు కిరీటమును బెట్టె
విష్ణువు అమర్చె అలంకారములు
చంద్రుడు వేసె హారములు 7

అగ్నిహోత్రుడు పాదుక లిచ్చెను
వరుణుడు బూసెను గంధము
లోపాముద్ర మొదలగు స్త్రీలు
పసుపు కుంకుమ రాసిరిగా|| 8

ఈశుం డపుడూ ముస్తాబయ్యెను
గణపతి ముందర అరుదెంచి
యిరుపార్శ్వముల భారతి లక్ష్మిలతో
విష్ణుబ్రహ్మలు ఒప్పగనూ|| 9

సాంబుడు హిమవత్ గృహముకు రాగా
హిమవంతుడు మేనక ఎదురేగే
వింధ్యా నిషధ గంధమాదనులు
మాల్యాసహ్యాలు జనెరంత|| 10

వీరలందరు పట్టువస్త్రములు
రత్నాభరణంబుల గూడి
పుష్పహారములు భుజకీర్తులును
వేడుకతో ధరించిరి॥ 11

వైభవంబుగ వీరవు దెంచి
ఈశుని చరణంబుల బట్టి
మణిపుంజములతో పూజలు జేసి
బాగుగ స్తోత్రము జేసిరిగా॥ 12

స్తోత్రము జేసి హిమవంతుడు
నీవల్లుడవగుట నాభాగ్యం
నేను సఫలమునొందితి ననియూ
రమ్మని గృహముకు వేడెనుగా॥ 13

రత్ననిర్మితా భవనంబులలో
విశాలమైనా స్థలములలో
వచ్చినవారల వరుసగజూచి
తగు స్థానంబులు ఏర్పరచె॥ 14

వీర్లందరిని తగు స్థానంబుల
సగౌరవంబుగ నిలుపుటచే
హిమవంతుడు చెప్పగలేని
పరమానందము జెందెనుగా॥ 15

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

వింశోఽధ్యాయః (20)

పార్వతి పరమేశ్వరుల కల్యాణము
జూచివత్తము గారండీ
కల్యాణమును కరువుదీరగా
కన్నులగాంతము రారమ్మా॥ 1

గౌరిసాంబుల కళ్యాంబును
గానరూపముగ బాడెదరో
వారలు కైలాసంబును చేరియు
దుఃఖరహితులై యుండెదరు॥ 2

రమ్యంబైన శుభముహూర్తంబున
హిమవంతుడు సంతోషముతో
బృహస్పతిచేత నిశ్చయించియు
సాంబుని ఆహ్వానముచేసె॥ 3

పెండ్లికొడుకగు సాంబుండప్పుడు
బాలసూర్యుడన పెంరసెనుగా
శిరస్సుపైన రత్నకిరీటము
మాణిక్యంబుల హారములు॥ 4

వజ్రములొప్పు కంఠహారములు
రత్నకంకణాల్ చేతులకు
ధగధగ మెరయు భుజకీర్తులను
థళథళ మెరయు మొలనూలు॥ 5

## పార్వతీ పరమేశ్వరుల కల్యాణఘట్టం



శ్రీ షాహూరు మునుస్వామయ్యా, ధర్మపత్ని లక్ష్మీదేవమ్మ గారు
కోలారు



తుని గ్రామమున శ్రీ ఎన్. నిఖిలానంద గుప్త, మహిళామాత గార్ల వూరేగింపు సమయంలో
దేవస్థాన ధర్మకర్త కొప్పర్తి వీరరాజుగారి యింటివద్ద.

పీతాంబరముల్ పుష్పహారముల్
విధవిధంబులా ఆభరణాల్
వక్షస్థలమున చందనకుంకుమ
నవమన్మథుడై నగబడెను॥ 6

పెండ్లి కొడుకగు ఈశుం డపుడు
వృషభ వాహనము నెక్కియును
సిద్ధులు సాధ్యులు కొలవగ నపుడు
తిన్నని నడకల వెడలగను॥ 7

వసిష్ఠ వామదేవ మునులును
సామగానముల స్తోత్రములు
కిన్నర స్త్రీలు గానము జేయా
రంబాప్సరస్సుల నాట్యంబు॥ 8

దేవత లందరు గుంపులు గూడి
జయ జయ ధ్వనుల బల్కగను
ఇంపగు సొంపగు హిమవద్భవనము
జేరెను ఈశుడు వేడుకతో॥ 9

ఆ సమయంబున పుష్ప వర్షములు
జల జల జల గురిసెనుగా
దేవదుందుభులు ఝణ ఝణ మ్రోగ
హిమవంతుడు ఎదు రేగియును॥ 10

స్త్రీలు పురుషుల చేతుల లోన
గంధపు పొడులులా జాలు
యిదే రీతిగ యీశుని పార్శ్వపు
వేడుక లెంతో చిత్రముగా॥ 11

పిమ్మట యీశుడు వింధ్య మైనాకుల
హస్తంబును బట్టుకొని
పరిశుద్ధంబగు మండపంబున
యీక్షణ జేయు యిట్లుండె॥ 12

శ్రేష్ఠమణులతో వృషభాకారము
పచ్చల తోడా స్థంభములు
వజ్రాల్ పొదిగిన సోపానములు
వైడూర్యములా మెల్కొల్లు॥ 13

మాణిక్యంబుల తోరణంబులు
ముత్యంబులతో ముగ్గులును
ప్రకాశంబులు చల్లదనంబు
కనులకు వింతగ గనుపించె॥ 14

ఫలపుష్పంబుల పళ్ళెరంబులు
సుగంధ ద్రవ్యము గిన్నెలును
సమిధలు పాత్రలు పట్టువస్త్రముల్
వేదికపార్శ్వము లందుండె॥ 15

కల్యాణమంటప వేదికపైన
సువర్ణపీఠము వేసియును
బ్రహ్మాండంబగు వైభవంబుగా
అల్లుని అసీనునిజేసె॥ 16

అత్రిమహాముని పులహుడు భృగువు
వాసుదేవుడు మహర్షులు
అగ్నియందునా హోమక్రియలు
లక్ష్మిభారతి ప్రేరణచే॥ 17

శచిస్వాహా సంజ్ఞ అదితి
దితిఅరుంధతి స్త్రీలంతా
కల్యాణపాటలు కరువుదీరగా
ఇంపుసొంపుగా గానంబు॥ 18

కల్యాణమును జూచి తానును
సంతోషించెనో యనునట్లు
అగ్నిహోత్రుడు ప్రకాశించుచు
ఇటునటు ప్రాగుచునుండెనుగా॥ 19

పరమేశ్వరుడు అగ్నిహోత్రునికి
ప్రదక్షిణంబు జేయగను
నాల్గువేదముల ఘోషణశబ్దము
సుందరగానము గంధర్వుల్॥ 20

తుంబురనారదవీణా గానము
వేణుతాళముల నాదములు
అప్సరస్సులా జయజయ ధ్వనులు
బ్రహ్మాండంబుగ నిండెనుగా॥ 21

మేనకకూతురు పార్వతిదేవికి
అభ్యంగనము జేయించి
పీతాంబరము ధరింపజేసి
కస్తురితిలకము దిద్దియును॥ 22

విధవిధంబులా భూషణంబులు
అనేకవిధముల పుష్పముల
అలంకారముచేసియు మేనక
వెంటనిడుకొని రాగానే॥ 23

హిమవంతుండు మేనక వుభయులు
శంకరు పాదాల్ పూజించి
వింధ్యమైనాక పుత్రులగూడి
ఈ భూషణముల నిచ్చిరిగా॥ 24

క్షీరసముద్రంబున జనించిన
బంగరువస్త్రము గప్పియును
ఓర్పునేర్పుతో తన నిర్మితమగు
రత్నకిరీటము బెట్టియును॥ 25

సూర్యమండలము తిరస్కరించు
కర్ణభూషణాల్ అర్పించి
రత్ననిర్మితా పాదుక లిచ్చి
మెడలో హారాల్ వేసియును॥ 26

ఆదిశంకరుని విధ్యుక్తంబుగ
భార్యాభర్తలు బూజించి
మేనక హస్తాంబుజము నుండియు
వుదకము బోసి యిట్లనెను॥ 27

పరబ్రహ్మము స్వరూపుడైన
సగుణమూర్తియగు శంకరుడా
మోక్షాపేక్షము కొరకై నేను
నా కొమార్తె నిస్తినని॥ 28

సంకల్పమును బలికిన వాడై
పార్వతి హస్తకమలములు
శివుని హస్తముల యందుంచియును
కన్యాదానము జేసెనుగా॥ 29

పార్వతి మెడలో పరమేశ్వరుడు
మంగళ సూత్రము గట్టియును
తన హస్తమును గౌరిశిరమున
గౌరీ హస్తము తన పైన॥ 30

అటుపై ఋషులు విధ్యుక్తంబుగ
వివాహమంత్రాల్ బలుకగను
వుభయులు వేడుక హస్తాంబుజము
తలంబరాలు బోసిరిగా॥ 31

సురల మోగెను దేవదుందుభులు
జల జల పువ్వులు గురిసెనుగా
లక్ష్మి భారతి దేవతస్త్రీలు
పెండ్లిపాటలు బాడిరిగా॥ 32

ఆ సమయంబున సూర్యచంద్రులు
చక్కగ ప్రకాశ మొందిరిగా
దశదిక్కులును తేజరిల్లెను
మందమారుతము వీచెనుగా॥ 33

భూసస్యంబులు కళ కళ లాడె
నదులు శుభ్రముగ ప్రవహించె
పక్షులు వనముల కల కల గూసె
ప్రపంచ మంతా వుప్పొంగె॥ 34

దేవత లందరు పెద్దకంఠముల
జయ జయ ధ్వనులా బల్కిరిగా
లక్ష్మీనారాయణుల రీతిగా
పార్వతి శివుడు మెలిగిరిగా॥ 35

పార్వతి పరమేశ్వరులు వుభయులు
వృషభ వాహనము నెక్కగనే
బ్రహ్మాండంబగు వైభవంబున
వూరేగింపు జరిగెనుగా॥ 36

వచ్చిన వార్లకు విందులు బెట్టి
విధవిధ మర్యాదలు జరిగె
హిమవంతుండు మేనక వుభయుల
ఆనందంబు అపరిమితం॥ 37

బుద్ధియుక్తులైన శ్రద్ధాభక్తుల
ఈ కథవినినా పాడిననూ
వినిపించినను చెప్పించిననూ
అన్ని శుభంబు లమరునుగా॥ 38

పార్వతీపరమేశ్వరుల కల్యాణం.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## ఏకవింశో ఽధ్యాయః (21)

ఆదిశేషుడు ధర్మసూనునకు
గౌరీసాంబుల వివాహము
కల్యాణమునకు కట్నము లిచ్చిన
వివరము దెల్పెద వినుమనియె॥ 1

విష్ణుదేవుడు తానే స్వయముగ
రత్ననిర్మాణంబగు మకుటం
వాసన చెడనీ వాడ నట్టియు
సువర్ణతామర మాలికయు॥ 2

అగ్నిదేవుడు రత్నపాదుకలు
అమూల్య హారాల్ చంద్రుడును
దేవత లందరు సంపాదించిన
అమూల్య వస్త్రాభరణములు॥ 3

పాతాళ వాసులగు సర్పరాజులు
సువర్ణ మిానెడి బహుమణులు
వేడుక కట్నము లిచ్చిన వారై
తమ తమ స్థానములకు బోగా॥ 4

గౌరీకల్యాణోత్సవంబుకు
కానుక లిచ్చిన వివరములు
కుబేరు డంతా వివరించగను
వివరము ఈశుడు తెలిసికొని॥ 5

కుబేరు గాంచి ఆశ్చర్యమునా
ఈవిధంబుగా బల్కెనుగా
సురులు రాక్షసులు వురుగులు ఇచ్చిన
కట్నము లన్ని జూచితిని॥ 6

భూలోక వాసులగు వైశ్యులు మాత్రం
వింజామరలు శాలువలు
పచ్చకర్పూరము కస్తూరైనా
ఇచ్చుట లేదే ఏమిదియు॥ 7

మదము చేతనో మరవు చేతనో
లేక వుదాసీనము తోనో
క్రయవిక్రయములు లేకుండుటనో
ఏమి కారణము దెల్పుమనా॥ 8

కుబేరు డంతా శిరమును వంచి
శూలపాణితో ఇట్లనెను
అంతా తెలిసిన సర్వజ్ఞుండై
నన్నడిగితివి వినుమనెను॥ 9

భూలోకంబున నివసించిన యా
బ్రాహ్మణ వైశ్య క్షత్రియులు
తారకాసురుని ఆగ్రహంబున
క్షామము సంభవించె ననె॥ 10

తారకాసురుని దుర్మార్గమునకు
రాజులు పర్వత భూములలో
బ్రాహ్మణు లందరు భార్గవాశ్రమము
వైశ్యులు భీతిచే గోబిలము॥ 11
శూద్రులు సేవావృత్తిని వదలిరి
తారకాసురుని జేరిరిగా
యిట్లందరు తమ వృత్తుల నొదలిరి
భీతి చెందియు డాగి రనెే॥ 12
కుబేరు డిట్లు చెప్పుచు నుండగ
నారదు డప్పుడు యిటు బల్కె
స్వామీ వైశ్యులు తపస్సు చేసి
తమ అనుగ్రహము జెందియును॥ 13
యోగుల కైనా దుర్లభమైన
కైలాసంబును బొందియును
కైలాసంబున క్రీడించుటచే
క్రయవిక్రయములు నిలచె ననెే॥ 14
శంకరు డప్పుడు గుబేరు గాంచి
ఆజ్ఞాపించి వెడలెనుగా
వైశ్యు లందరిని భూలోకమునకు
బంపుము వారల శీఘ్రి మనెే॥ 15

పరమేశ్వరుడు వైశ్యులను భూలోకమునకు బంపుటకు కుబేరునికి ఆజ్ఞ జేయుట.

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ద్వావింశో ఽ ధ్యా యః (22)

ఈశుని ఆజ్ఞను బొంది కుబేరుడు
వైశ్యుల చెంతకు చనె నంత
గాంచి వారలను గంభీరముగా
శివుని ఆజ్ఞను దెలిపెనుగా॥ 1

వైశ్యులు లజ్జాయుక్తు లగుచును
వినయంబుగను ధనపతితో
భూమి జేరుటకు శక్తియు లేక
కానుక లివ్వక పోతి మనా॥ 2

వైశ్యుల దీనత గాంచి కుబేరుడు
కరుణతో విమాన మొసగెనుగా
పుష్పక విమాన మందున గూర్చొని
భూలోకమునకు జని రంత॥ 3

వస్తుసంగ్రహము కొరకై వైశ్యులు
భూమిని తిరుగగ వంశీయులు
యెందును గానక విస్మయ మొంది
చింతతో చాలా తిరుగుచును॥ 4

వస్తుసంగ్రహము దొరకని చింతతో
తిరుగుచు ఆశ్రమమును జేరి
మునిని ప్రశ్నను జేసిన యతడు
ఇట్లు జెప్పెను వినిపింతూ॥ 5

దేవప్రవరుండను వైశ్యుంతు
సాందిప గోత్రమునా చదియు
భార్గవ మహర్షి యాశ్రమ మిదియు
మహాత్ములారా తెలియు డనెన్॥ 6

దేవప్రవరుడు వైశ్యుల జూచి
వారి రాకను వేడగను
వైశ్యులు వైశ్యాబాలుని గాంచి
తమ ఆగమనము దెలిపిరిగా॥ 7

ఆశ్రమబాలుడు వైశ్యులకపుడు
వింజామరలు దుకూలములో
కస్తురిపెట్టెలు పచ్చకర్పూరము
వస్తుజాలములు శాలువలు॥ 8

వైశ్యబాలుం డొసగిన వస్తువు
లన్నియు శీఘ్రమె దీసుకొని
వైశ్యులు ఆశీర్వాదము జేసి
పుష్పక మెక్కి వెడలుచును॥ 9

దారిలో గౌతమఋషి ఆశ్రమము
తిరస్కరించి వెడలగనూ
గౌతమఋషియు రోషముజెంది
శాపమిచ్చెను వైశ్యులకు॥ 10

శాపము బెట్టగ వైశ్యవిమానము
నడువక నిలచి యుండెనుగా
గౌతమఋషిని వైశ్యులు వేడగ
ఆదరించక పోయెనుగ॥ 11

పరమేశ్వరుని పరిపరి విధముల
ప్రార్థన జేసిరి వైశ్యులును
కపాలధారి కరుణించుటచే
విమాన మొచ్చెను వైశ్యులకు॥ 12

వైశ్యులు ఈశుని విమాన మందు
పరికరంబుల నుంచుకొని
ఈశుని జేరి కట్నము లివ్వగ
సాంబుడు సంతోషించెనుగా॥ 13

హిమవత్ భవనము నందు ఈశుడు
శతసహస్ర వత్సరముల్
పార్వతి తోడ ఏకాంతముగా
క్రీడింపుచునూ సుఖించగా॥ 14

ఒక సమయంబున సమాధి యనెడి
వైశ్యఋషిని ద్వారములో
గావలి యుంచి గంగా నదికి
స్నానంబునకై వెడలిరిగా॥ 15

వారెవరనగా జెప్పెద వినుడు
నందీశ్వరుడు సురథుండు
గాధిసమాధి బాణుం డనెడు
రావణు డాది భక్తులును॥ 16

ద్వారము నందు సమాధి వుండి
దుర్వాసుండు రాగానే
అడ్డగింపగా దుర్వాసుండు
శాప మిచ్చెను సమాధికి॥ 17

పరమేశ్వరుడు దీనిని దెలసి
సత్కారించియు ఋషివరుని
శాపము బొందిన సమాధి గాంచి
వెడలుము నీవు యని బల్కె॥ 18

భూమిని జేరి అగ్నిలో దుమికి
శాపవిమోచన బొందియును
నా స్థానంబును జేరెద వనియు
ఈశుడు వెడలెను కైలాసం॥ 19

పార్వతి పరమేశ్వరుల విహారము
శ్రద్ధగ వినిన భక్తులకు
హృదయము నందు చింతలు దీరి
అన్ని శుభంబులు సమకూరున్॥ 20

సమాధి యను వైశ్యునకు దుర్వాసుని శాపము.

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

త్ర యో వి ం శో ఽ ధ్యా యః (23)

సాలంకాయన ఋషివరు గాంచియు
వైశ్యోత్తము లిటు బల్కిరిగా॥
కుమార జననము తారక వధయు
కథలను వినుటకు గోరితివిగా॥ 1

వైశ్యులు నష్టము జెంది రనుటయు
ముందుగ మీరు చెప్పిరి
మా వంశుండగు సమాధి వైశ్యుడు
కైలాస వాసమూ యెటు బొందెక॥ 2

శిష్యులహృదయ శాంతిని జేయు
తమవాక్కుల వినుపింపుడ నెన్
శాంతంబుగను ఋషివరు డపుడు
ప్రశ్నకు కథను వివరించెన్॥ 3

హిమవత్ గృహములో పరమేశ్వరుడు
పదివేలేండ్లు పార్వతితో
క్రీడాసక్తిలో మునిగియుండగ
భూమిచలించెను వింతగను॥ 4

తారకాసురుని బాధ చేతను
పార్వతి క్రీడకు ప్రతిబంధమ్
గలుగుట చేత పార్వతి యపుడు
శాపము పెట్టెను అమరులకు॥ 5

దేవతలారా మీ కందరకు
సంతాన హీనత కలుగు నవేఁ
ఆ సమయంబున ఈశుని తేజము
అగ్ని దేవుని యందిడ చేఁ॥ 6

అగ్నిహోత్రుడు ఈశుని తేజము
గంగా నదిలో విడచెనుగా
గంగయు తేజము కెల్లున విడువ
ఆరుముఖముల శిశు వాయెఁ॥ 7

ఈశుని అమోఘ తేజంబునకు
కుమారస్వామి జన్మించేఁ
అట్టిబాలుని షట్ కృత్తికలు
ఆదరంబునా బెంచిరిగా॥ 8

అమరు లందరు అసురుల బాధలు
సహించ లేక షన్ముఖుని
దేవత లందరు ప్రార్థన జేయగ
కుమారస్వామి గోపముతో॥ 9

కుమారస్వామి మయూర మెక్కి
రుద్రగణంబు సిద్ధులతో
మరుద్గణంబు గంధర్వులతో
అమరావతికి వెడలెనుగా॥ 10

తారకాసురుడు క్రోధము జెంది
కాలకేయు నివాతులతో
కద్రువ పుత్రులు వురుగుల తోడ
సింహుడు దదీచి వృషభునితో॥ 11

వీరులైన రాక్షసు లందరితో
కుమారస్వామి యుద్ధమును
ఘోరంబుగను పండ్రెండేండ్లు
యిరు పార్శ్వముల జేసిరిగా॥ 12

ఈ సమయంబున బృహస్పతి భార్యను
చంద్రుడు సంగ్రహించెనుగా
గురుపక్షంబు దేవేంద్రుండు
అసురుని పక్షము చంద్రుండు॥ 13

భయంకరంబగు యద్భుత యుద్ధము
శక్త్యాయుధముచె షన్ముఖుడు
రాక్షసు లందరి నాశము జేయుచు
రథముల భస్మంబుల జేసె॥ 14

గుర్రంబులను పుడి పుడి జేసెను
ఛేధించెను బహుగజంబులన్
భటవర్గంబును భూమిని గూల్చె
శూలపద్మల శిరస్సులు దుంచె 15

గజాసురుండను అసురుని ద్రోసి
గదతో వక్షంబును గొట్టి
ఆ సమయంబున దదీచి యసురుడు
పాతాళమునకు బోయిరిగా॥ 16

తారకాసురుని సైన్యము తగ్గుట
క్రోధము జెందియు షణ్ముఖుడు
నెదుర్కొనియు యుద్ధము జేయగ
చక్రపాణియు అరుదెంచె॥ 17

కార్తికేయుడు బాణవర్షము
అసురునిపై బహు గురిపించి
సింహనాదము బాగుగ జేసి
అసురుని ధనస్సు విరచెనుగా॥ 18

తారకుడంత రౌద్రము తోడ
పదివేల బారువుల శూలమును
చక్రపాణిపై ప్రయోగించగా
దేవత లందరు భయపడిరి॥ 19

కుమారస్వామి శూలాయుధమును
శక్త్యాయుధముచె ఛేధించెన్
పిమ్మట గదను చేత బుచ్చుకొని
అసురుని బద్దలు జేసెనుగా॥ 20

తారకాసురుడు మృతి నొందగనే
రాక్షసు లేగిరి పాతాళం
దేవదుందుభులు బాగుగ మ్రోగ
పుష్పవర్షములు గురిసెనుగా॥ 21

నారదుండు ఆ సమయంబున
సాంబుని స్తోత్రము జేసియును
భూలోకంబు వార్తలు జెప్పుచు
వివరించెను ఈ రీతిగను॥ 22

తారకాసురుని దోషము చేత
యజ్ఞము లన్ని నిలువగనే
అనావృష్టిచే ఉదక రహితమై
విప్రులు జేరిరి ఆశ్రమము॥ 23

పరశురాముడు క్షత్రియు లందరి
శిరసులు చాలా దున్ంచగనే
వీరలు గాక వైశ్యులు చాలా
నీ పాదంబుల నిలచిరిగా॥ 24

ఆహారంబు ప్రజలకు లేక
శాఖములే తినుచున్నారు
వైశ్యు లిప్పటికి గోబిలమూన
ప్రవేశించి రాలేరైరి॥ 25

ఈ వృత్తాంతము ఈశుడు వినియు
యథారీతి నిర్మింపు మనెన్
నారదుడంతా గోబిలమునలో
నిలచిన వైశ్యుల నిట్లనియె॥ 26

వైశ్యులారా మీరలు యిందు
వుండుట కేమి హేతు వనెన్
దారుణమైన చర్య యెందుకు
చెప్పుడు మీరలు నాకనియె॥ 27

వైశ్యులు నారద ఋషివరు గాంచి
తేజోహీనులమగు మమ్ము
మీరు మమ్ముల ధన్యుల జేయుడు
భూమిని బొందెద మని దెల్పె॥ 28

నారదుడంతలో రజితాద్రిని జేరి
సిద్ధవైశ్యుల గాంచియును
గోబిల వైశ్యుల వృత్తాంతము
ఎరిగింపగ వారిట్లనిరి॥ 29

స్వామీ వైశ్యుల నుద్ధరించుటకు
ఏమి చేయవలె చెప్పు డనెన్
మీ తపస్సుచే విముక్తు లగుదురు
కామధేనువును జేరు మనెన్॥ 30

సిద్ధ వైశ్యులు గోబిల వైశ్యుల
ఉద్ధరించిన వృత్తాంతం
శివునకు దెలిపి కైలాసంబుకు
వెడలి సుఖంబున నుండిరిగా॥ 31

కైలాసంబున నందీశ్వరుడు
బ్రహ్మాండాది గణములతో
తాండవంబు జేయగ శివుడు
సన్మానంబు జేసెనుగా॥ 32

నందీశ్వరుడు ఆనందించి
శివునికి మాత్రమె ప్రదక్షిణం
జేయగ పార్వతి గోపము జెంది
శాపము బెట్టెను నందికిని॥ 33

ఓ నందీశ్వర శాపము వినుము
కైలాస పదవిని వదలియును
భూలోకంబున పుట్టెద వనియు
జెప్పగ నందీశ్వరు డపుడు॥ 34

క్రోధము జెంది నంది శపించెను
నిరపరాధి యగు నన్ను
శపించి నందుకు నీవును గూడ
నా వలె భూమిని బుట్టెదవు॥ 35

ఈశుడు ఉభయుల శాపము గాంచి
ఊరక చూచుచు నుండెనుగా
పార్వతి ఘోరతపస్సు జేయగ
దేహము చాలా కృశించెను॥ 36

పార్వతి నందీ శాపము కొరకు
అర్ధనరీశ్వరి ఆయెనుగా
విప్రుని శాపవిమోచనంబుకు
అర్ధశరీరము విడచెనుగా॥ 37

ఈ సమయంబున వైశ్యు లందరు
త్రిశూల పాణిని జేరియును
తపోహీనత వివరించియును
దీనత్వంబుగ మండగను॥ 38

ఈశ్వరు డంతా యెదుటనె యున్న
సమాధి వైశ్యుని జూచియును
దుర్వాస శాప మనుభవించుటకు
నీవును చనుమా యని చెప్పె॥ 39

నీ సంబంధులు గౌతమ శాపము
పొందిన వార్లు నీతోనే
భూలోకంబు బొందియు మీరలు
గోబిల వైశ్యుల రక్షించు మనె॥ 40

నందీశ్వరుడు పార్వతి దేవియు
భూలోకమునకు వచ్చెదరు
శాపము దీరి ధర్మము నిల్పి
అటుపై రజతాద్రికి రమ్మనెను॥ 41

నందీశ్వర పార్వతీ పరస్పర శాపము.



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

చతుర్వింశోఽధ్యాయః (24)

భూలోకమునకు వైశ్యశ్రేష్ఠులను
పొమ్మని శివుడు పల్కగనే
వైశ్యులు సాంబుని గాంచి దుఃఖముతో
ఇట్లు బల్కిరీ వినరండీ॥ 1

నీ స్థానంబు కల్పవృక్షము
అయ్యో భూలోకమె విషవృక్షం
సర్వసస్యముల భూమిని వదలిన
పాపపంకిలమె భూలోకం॥ 2

దుఃఖితులైన వైశ్యుల గాంచి
శంకరు డంతా దయ తోడ
బిడ్డలార సేవ జేయుడు
భూలోకమునకు వెడల వలెగ॥ 3

ఏ దేశంబున మీరుండెదరో
ధనధాన్యంబుల సమవృద్ధి
క్రయవిక్రయముల ధర్మము జరుగును
వాణిజ్యంబున జీవనమె॥ 4

నన్ను విడచియు భూలోకములో
ఉండుట కిష్టము లేకున్న
విశ్వకర్మచె నిర్మితమైన
పెనుగొండ పట్నముకు వెడలండి॥ 5

నగరేశ్వరుడను నామము తోడ
నేను తప్పక వెలసెదను
జనార్దనుండని లక్ష్మీపతియు
కోనకమల యని లక్ష్మియును॥ 6

వింధ్యవాసి యని పార్వతి యుండు
వైశ్యుల గురువై బ్రహ్మౌండు
ఇవ్విధంబుగా మేము ముగ్గురము
మా భార్యలతో వెలసెదము॥ 7

దివ్యపట్నము పెనుగొండగును
అచ్చట మీరు నివసించి
ఒక సమయంబున అగ్నిలో దుమికి
కైలాసంబును బొందెదరు॥ 8

చిత్రకంఠుని శాపం బిపుడు
సమీపించెను శీఘ్రముగా
భూలోకమునకు తప్పక వెడలుడు
ఇది నా ఆజ్ఞని బల్కెనుగా॥ 9

వైశ్యులు ఈశుని ఆజ్ఞకు లోబడి
బ్రహ్మవద్దకు జనిరంత
బ్రహ్మ వీరిని గాంచినతోడనె
భూలోకమునకు జనుమనియె॥ 10

గోదావరి తీరంబునందునా
పులస్త్యాశ్రమ దేశమున
కుమారస్వామి తపస్సుజేసిన
పవిత్రమైన స్థానమున॥ 11

బ్రహ్మ గుండమునొద్దకు బోయి
కామధేనువును బ్రార్థించి
వైశ్యులు కర్ణబిలమునుండియు
గోలోకమునకు వెడలిరిగా॥ 12

కామధేనువునుగాంచి వైశ్యులు
పలువిధంబుల బ్రార్థింప
కామధేనువు ప్రసన్నురాలై
వైశ్యుల కిట్లు దెల్పెనుగా॥ 13

మీ వృత్తాంతము నే దెలిసితిని
మీరు తప్పక వెడలవలెన్
అంతలో మీరు విష్ణుమూర్తిని
ఆరాధింపుడు యని జనియె॥ 14

లక్ష్మీకాంతుడు శీఘ్రమె యపుడు
వైశ్యులగాంచి యిట్లనియె
మీకొరకై నే జనార్దనుండై
తప్పక వెలసెద పొమ్మనియె॥ 15

చిత్రకంఠుని శాపము చేతను
గౌతమ మహర్షి శాపమున
తపస్సు నాశనమగుటచె వైశ్యులు
దుఃఖము బొందినవారైరి॥ 16

వైశ్యులు నారదమునిని వేడగ
అతడిటు దెలిపెను వైశ్యులకు
కామధేనువును శరణు బొందుడు
శుభములు గలుగును మీకనియె॥ 17

వైశ్యులు కామధేను గర్భమున
బహుకాలంబును వుండగనే
విశ్వకర్మనుగాంచియు బ్రహ్మ
యిట్లని ఆజ్ఞ జేసెనుగా॥ 18

విశ్వకర్మయు బ్రహ్మ ఆజ్ఞచే
నిర్మించెను బహుపురంబులన్
అంతలో బ్రహ్మ భాస్కరచార్యుడై
భృగువంశంబున బుట్టెనుగా॥ 19

వైశ్యుల పురముల పేర్లనువినుడీ
ధర్మవరము జగన్నాథము
పాంచాలపురము పాలకుండము
ఘంటసాలయుధనపురముౙ॥ 20

పురంద్రిగుణము విశాఖపట్నము
పెనుగొండయు ఏలాపురంబును
పాలము వీరనారాయణము
ధర్మవరము శివపురముౙ॥ 21

కళింగపట్నము కామపురంబును
త్రిగుణపట్నము హిందూపురము
ఆనందజలదము భీమపట్నము
కల్యాణంబను పద్నెనిమిది పురంబులు॥ 22

అన్ని వసతులతో వున్నతమైన
పట్నాలు పదునెనిమిదియు
నిర్మించియు విశ్వకర్మ యపుడు
బ్రహ్మకు నిర్మితమును దెలిపె॥ 23

గంగాధరుడు ఆజ్ఞను జేసెను
ధనపతి నీవు నవనిధులు
అష్టాదశ పట్నంబులందున
నిలచునట్లుగా జేయుమనెన్॥ 24

పితామహుండు భృగువంశంబున
భాస్కరచారిగ జన్మించె
వైశ్యులు జననంకొరకై జూడ
వైశ్యులు జననం బొందిరిగా॥ 25

కామధేనువు కర్ణమునుండి
వెడలిన వైశ్యుల కర్మలను
భాస్కరచార్య నీవు వ్రాయుమని
ఆకాశవాణి బల్కెనుగా॥ 26

వైశ్యులందరికి భాస్కరచార్యులు
గాయత్రీ జప వేదములన్
వివాహంబుల ధర్మంబులను
నియమించుటకు కులగురువాయె॥ 27

వైశ్యులందరికి వివాహమైనను
రతిక్రీడలు లేకుండ
వైశ్యుల గురువు ఇట్లు చెప్పగా
వైశ్యులు ధేనువు ప్రార్థించ॥ 28

కామధేనువు వైశ్యోత్తములకు
ప్రత్యక్షంబుగ నగబడియె
ప్రార్థన జేసిన వైశ్యుల గాంచి
వరంబులిచ్చి జనెనంత॥ 29

వైశ్యుల కొరకై పార్వతి శివుడు
నగరేశ్వర వింధ్యవాసినిగా
లక్ష్మీవిష్ణులు వీరల కొరకై
జనార్దన కోనకమ లయిరి॥ 30

పెనుగొండ పట్నమున హరిహరు లిద్దరు
వుద్భవంబును జెందిరిగా
కుబేరు డంతా ధనరాసులను
స్వయంబుగా దా దెచ్చెనుగా॥ 31

వీరి రాకను దేవత లపుడు
భాస్కర ఋషియు వినిపించ
వైశ్యుల గూడి భాస్కర ఋషియు
పెనుగొండకు ఏతెంచెనుగా ॥ 32

కుబేరు డప్పుడు వైశ్యులందరికి
దాతృత్వంబును ధనంబును
క్రయవిక్రయముల నేర్పరితనము
వస్తు విమర్శనమును జెప్పె॥ 33

వైశ్యులు పరమానందముతోడ
శుభముహూర్తమును జూచియును
గోకర్ణంబున బయలుదేరియు
అష్టాదశపురముల నిలచిరిగా॥ 34

---

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

పంచవింశోఽధ్యాయః (25)

పెనుగొండవైశ్యుల సంతతివృద్ధి
క్రమముగ అష్టాదశపట్నాల్లో
వ్యాపించి బహు మహత్తరంబున
విస్తారంబుగ వృద్ధయిరి॥ 1

సాలంకాయన ఋషివరు డప్పుడు
వైశ్యుల భూమిని నిలచుటయు
కర్మధర్మముల నన్నియు దెలిసిన
సూతుడు జెప్పెను ఋషులకును॥ 2

ధర్మసూనునకు ఇచ్చిన వరముకు
శేషుడు ఇట్లు జెప్పెనుగా
మన్మథదహనము భస్మము నుండి
శుంభనిశుంభుల జన్మమును॥ 3

చిత్రకంఠుడును గంధర్వుండు
విష్ణువర్ధనుడై జన్మించె
గౌరీదేవి వైశ్యకులమున
వాసవకన్యక ఆయెనుగా॥ 4

గౌరీదేవి బ్రహ్మచారిణియై
స్ఫురద్రూపి యగు కన్యకయై
వాసవికన్యయె శక్తి రూపముగ
కౌశికాంబకు జన్మించె॥ 5

గౌరీదేవియె వాసవికన్యగ
గంధర్వుడు విష్ణువర్ధనుడై
వాసవకన్యను నపేక్షించగా
వైశ్యులు కోపము జెందియును॥ 6

విష్ణువర్ధనుని సంహరించి
వైశ్యులు నగ్నిలో దుముకగను
నూటారెండు గోత్రవైశ్యులు
కైలాసంబును బొందిరిగా॥ 7

వైశ్యులు పూర్వవృత్తాంతంబు
ఆదిశేషుడు సూనునకు
వివరించి బహు కరుణించియును
వాడని మాలిక నిచ్చెనుగా॥ 8

ధర్మనందనుకి స్వేచ్ఛమరణము
వరంబు మరల నిచ్చియును
నాగదూతల సహాయమిచ్చి
భూలోకంబుకు బంపెనుగా॥ 9

చవనమహర్షి ఆశ్రమమునకు
ధర్మనందనుడు అరుదెంచి
గురుపాదముల శిరమును జెట్టి
సర్వవృత్తాంతము వివరించె॥ 10

ధర్మనందనుడు తల్లి తండ్రులకు
అమితానందము గలిగించి
గృహస్థ ధర్మము బాగుగ నడిపి
సకలశుభంబులు బొందెనుగా॥ 11

సాలంకాయన ఋషివరు డిట్లు
నారద వాక్కులు ఇవి అనియె
వైశ్యులు పెనుగొండలో యుండుటచే
నాగరు లనియు బిరుదొచ్చె॥ 12

ధర్మనందనుని చరితము విన్న
ధరణిలో ధన్యులు అయ్యెదరు
దైవము వారిని అనుగ్రహించును
ధర్మచరిత మిది నమ్మండీ॥ 13



# శ్రీ వాసవికన్యకా పురాణ శోహరాగానము

షడ్వింశో ఽ ధ్యాయః (26)

మరల వైశ్యులు సాలంకాయుని
ప్రశ్నను జేయుచు నిట్లనిరి
మావంశీయుల చరిత్ర తమరు
తెన్నగ దెల్పుడు యని వేడ॥ 1

బ్రహ్మాదినము మొదటిజామున
కృతయుగ మందున వైశ్యులును
తపస్సు జేసి కైలాస మొందియు
వైవస్వత కాలంబు నచ్యుతి నొంది॥ 2

అష్టాదశ యుగమున వైశ్యులు
క్షీరసముద్ర తీరమున
తపస్సు జేసి విష్ణువు వలన
గోకర్ణంబున జనించిరి॥ 3

అందులో ముఖ్యులు అయిన వైశ్యుల
నామంబులను విను డనియె
మనువు రవియు మానాభుండు
కంకుడు భగుడు గోధుడును॥ 4

ప్రహ్లాదు టంకుడు శంకుడు మునియు
కుసుడు యించుకుడు మగధుండు
పురంధకుండు అనుపకులుడును
కుండుడు సనకుడు శృంగుడును॥ 5

బభ్రుడు మద్రుడు కృతి గాంగేయుడు
వైణవుండు గోశీలుండు
పత్రికంపకుండు నందిశీలుడు
వేనుడు వైన్యుడు మృగుండును॥ 6

వేనుడు గణపుడు కదబుండు
పౌలస్త్యుడు గూఢోన్మత్తుండు
స్మరుడు దర్దకుడు కపాలుడు
శంగుడు నిచలుడు ప్రచ్ఛకుడు॥ 7

కాన్యుడు ధనధుడు కమటుడు కుంజుడు
రక్తాక్షుడు మధుపావనుడు
రేభుడు తృకుడు చింతాలుండు
శ్రీలకుడు శ్రీరంగుం డనువాడు॥ 8

శివుడు జానకుడు మర్దికుండు
శృంగుడు మననుడు చంద్రుండు
ఫలగుడు బీముడు బారుండు
క్రముడు వంజులుడు కాన్యుండు॥ 9

వీరలందరు ధర్మయుక్తులై
పెనుగొండ పట్నములో నుండిరిగా
శివ కేశవులకు పూజచేయుచు
ధర్మార్థంబుల బొందిరిగా॥ 10

వీరలకీర్తి సకలదిక్కుల
బహు రీతులుగా వ్యాపించె
నగరేశ్వర జనార్ధన స్వాములచేత
అనుగ్రహంబును బొందిరిగా॥ 11

వీరినామములు విన్న పఠించిన
ధనధాన్యంబులు గలిగియును
కీర్తిప్రతిష్ఠలు బాగుగపొంది
శాశ్వతవంశంబులు నిలచునుగా॥ 12

---

## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

సప్తవింశోఽధ్యాయః (27)

సాలంకాయన ఋషివరుగాంచి
వైశ్యులుమరల ప్రశ్నింప
ఓమహాత్మా పార్వతిదేవి
వంశము పవిత్రము ఎటుజేసె॥ 1

ఎవరివంశమున పార్వతిదేవి
జన్మించినదో వినుడికనూ
ప్రభాతగోత్రుండను వైశ్యుండు
వృదాహుడను నామమువాడు॥ 2

వృదాహాపుత్రుడు మఘుడనువాడు
వానిపుత్రుడు మధుమంతుండు
ముల్లోకంబుల ఖ్యాతిజెందియు
తిరుగుచు విష్ణువు నర్చించె॥ 3

విష్ణువు వాని ననుగ్రహించియు
కామగమన విమానం బొసగె
ఒకసమయంబున దేవలోకమున
విశ్వావసుండను గాయకుడు॥ 4

మధుమంతుండు కోకిలకన్యను
యిచ్చి వివాహము జేసెనుగా
కోకిలకన్యను మణిమంతుడు
కీర్తిమంతుడు శ్వేతుండు॥ 5

ముంచికుందుండు విరోచనుండు
నామముగలిగిన కొడుకులను
విరోచనునకు తులాధారుడు
మణిగ్రీవులను పుత్రులును॥ 6

తులాధారుడు కాశికిబోయి
వాసముజేసిన వాడాయె
తులాధారుడు ధర్మముతోన
జాజలిబ్రాహ్మణు గెలిచెనుగా॥ 7

సాలంకాయన ఋషివైశ్యులకు
తులాధారు చరిత్రము జెప్పె
తులాధారు చరితంబును వినినా
సకలపాపములు దొలగున నెన్ ॥ 9

జాజలివిప్రుడు సముద్రతీరము
నందు వసించెను తపస్సుకు
తపస్సమాధిలో చలించకుండగ
కొయ్యగవలెనే స్తంభించెన్ ॥ 10

జాజలిశిరస్సు వెంట్రుకలందు
కుళింగపక్షులు నివసించి
కాపురముండి గుడ్లను బెట్టగ
తెలిసియు చలనము లేకుండె ॥ 11

జాజలితలపై పక్షులు నిలువగ
గర్వము జెంది నుబ్బగను
అంతర్వాణి ఇట్లు బల్కెను
తులాధారసముడవు గావనెను ॥ 12

పొట్టకూటికై జేరము జేయు
వైశ్యునికడకు జనుదెంచన్
తులాధారుడు జాజలిగాంచి
బహువినయంబున పూజించెన్ ॥ 13

జాజలివిప్రుడు విస్మయమొందీ
తులాధారుని ప్రశ్నించెన్
అంగడిబేరము జేసెడి నీకు
నిష్ఠ ఎట్లు నిలచెననెన్॥ 14

స్వామీ తమకు ధర్మము దెలియదా ?
సర్వభూతములయందు దయా
ప్రాణులస్నేహము విప్రులసేవ
కులధర్మంబును నడుపుటచే॥ 15

తమ తపస్సు కోరికగూడి
అహంకారము జెందితిరి
అందున తమకు తపస్సంతయు
నష్టమయ్యెను తెలియండీ॥ 16

తులాధారుడు ధర్మము జెప్పి
తనతపస్సు విప్రునికొసగా
తులాధారుని తపస్సు చేత
జాజలి బొందెను పుణ్యమును॥ 17

తులాధారునికి పుత్రుడుబుట్టె
మణిగ్రీవుడను నామంబు
వానికిపుత్రుడు జటిలుండాయెను
జటిలపుత్రుడు భద్రుండు॥ 18

భద్రమునిపుత్రుడు హయగ్రీవుడు
వానికి పద్మాక్షుడు బుట్టె
పద్మాక్షుండు శూద్రస్త్రీతో
క్రీడలో మునిగి తేలుండె|| 19

పద్మాక్షుండు అరణ్యమందు
క్రీడను చేయుచునుండగా
వానికి ఏకపుత్రుడు గల్గెను
దశరథ బాణంబున మృతుడాయె|| 20

పద్మాక్షుని ధర్మపత్నికి
సత్యవంతుడు పుట్టెనుగా
సత్యసంధుడగు సత్యవంతునకు
హేమవర్ణుడను నామముగా|| 21

హేమవర్ణుని పుత్రుడు శివుడు
శివుని పుత్రుడు గోముఖుడు
గోముఖుడంతా ఋషిశాపముచే
వామనరూపము బొందెనుగా|| 22

గోముఖపుత్రుడు కుముధనాముడు
కుముధపుత్రుడు కల్హారుండు
కల్హారునకు సంతతిలేక
ఈశునిప్రార్ధన జేసెనుగా|| 23

కల్హారునకు స్వప్నమునందు
శంభుడు ప్రత్యక్షంబయ్యె
పుత్రలాభము భిక్షపెట్టగా
కుసుమశ్రేష్ఠి బుట్టెనుగా॥ 24

కుసుమశ్రేష్ఠి పుట్టినవేళ
మందమారుతము వీచెనుగా
పుష్పవర్షము బాగుగ గురిసె
వైశ్యులు వేడ్కతో నుండిరిగా॥ 25



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

అ ష్టా వి ం శో ఽ ధ్యా యః (28)

వైశ్యులు సాలంకాయన ఋషితో
ప్రశ్నను జేసిరి వినయముతో
కుసుమశ్రేష్ఠికి పార్వతిదేవి
కూతురు ఎట్లు అయ్యెనదో॥ 1

వైశ్యులతోడ ఋషి ఇటు బల్కె
స్వారోచిషమను కాలమున
సమాధివైశ్యుడు భార్యాపుత్రుల
విడచి సమేధుని సన్నిధిలో॥ 2

దేవి ప్రభావము శ్రవణము జేసి
త్రివత్సరంబులు తపస్సుచే
దేవియు ప్రత్యక్షంబుగ నిలచి
వత్సా వరమును గోరు మనెన్॥ 3

సమాధివైశ్యుడు వరమును కోరెను
నూట్రూరెండు గోత్రింబులతో
మోక్షముపొందుట కొరకై నాకు
వరప్రసాదము యిమ్మనెను॥ 4

ఈవరంబును ఇచ్చుటచేత
భూమిలో బుట్టెను పార్వతియు
దుర్వాసుని శాపవశమున
సమాధి బుట్టెను కల్హారునికి॥ 5

కల్హారునికి పుత్రిజన్మముచె
శుభము లన్నియు గల్గినవి
అశరీరవాణి పేరు బెట్టుమన
కుశుమ శెట్టియని పేరిడిరి॥ 6

కల్హారుండు కుశుమ శెట్టికి
విద్యాభ్యాసము చేయుటకు
భాస్కరచార్య గురువు వద్దకే
పంపి విద్యను నేర్పించే॥ 7

మణిమండలుడను వైశ్యోత్తమునకు
కౌశిమాంబయను పుత్రిక గలదు
భాస్కరచార్యులు యోచన జేసి
కల్హారునకు దెలిపెనుగా॥ 8

కల్హారుండు వివాహకార్యము
గురువరునకు నియమించేనుగా
భాస్కరచార్యులు మణిమండలుని
భవనంబునకు అరుదెంచ॥ 9

వచ్చినగురుని ఆదరంబునా
మణిమండలుడు యథారీతిగను
వుపచారంబులు బాగుగ జేసి
రాకను దెలుప ప్రశ్నించె॥ 10

ఓవైశ్యోత్తమ నీ కుమార్తెయగు
కౌశిమాంబ వివాహముఁ
శీఘ్రమె ఒప్పి కుసుమశ్రేష్టికి
నిశ్చయించ వలెనని పల్కె॥ 11

మణిమండలుడు అట్లే ఒప్పెను
ఈ నిశ్చయమును గురువరుడు
కల్హారునకు వినిపించగనే
బంధువర్గమును బిలపించె॥ 12

గురువరుడంతా శుభముహూర్తమును
నిశ్చయించగా వుభయులును
జేసిన వివాహ కార్యంబులను
వివరించెదను వినరండీ॥ 13

కౌశికమాంబను వైశ్యస్త్రీలు
అలంకరించిరి వేడుకతో
అలంకారమును వివరించెదను
శ్రద్ధగ మీరు వినరండీ॥ 14

పాపిడి కిరుప్రక్కల యందు
సూర్యచంద్రుల ఆభరణాల్
చంపలసరములు చెవులకు బెట్టి
పువ్వుల జడను వేసిరిగా॥ 15

నుదుట తిలకము బాగుగ దిద్ది
కండ్లకు కాటుక బెట్టిరిగా
పాదంబులకు పారాణియును
చంపకు చుక్క బెట్టిరిగా॥ 16

కంఠమునిండా తారాహారములు
కరువుదీరగ అమర్చియు
చేతులకేమో దండకడియాల్
బాజాబందులు బెట్టిరిగా॥ 17

అత్యద్భుతమైన పట్టు వస్త్రములు
కౌశిమాంబకు గట్టియును
తల్లిదండ్రులు వేడుకతోడ
కన్యాదానము జేసిరిగా॥ 18

శాస్త్రయుక్తమగు మంత్రంబులతో
తలంబరాలు బోయగను
ఆసమయంబున మంగళకరమగు
వాయిద్యములు మ్రోగెనుగా॥ 19

మణిమండలుడు వివాహమందు
భక్ష్యభోజ్యముల వైశ్యులకు
సంతృప్తిగను విందులుచేసి
ఊరేగింపును జేసెనుగా॥ 20

కల్యాణఘట్టమును విన్నను గన్నను
కష్టములుండవు నమ్మండి
శ్రద్ధాభక్తులు గలిగినవారికె
తప్పక శుభములు గల్గునుగా॥ 21



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ఏకోనత్రింశోఽధ్యాయః (29)

ఉద్వాహ గోత్రోద్భవుండైన
కుసుమశ్రేష్ఠికి కోరిక బుట్టెనుగా
పరితాపంబును జెందుచు గురువును
సన్మానంబున రప్పించె॥ 1

గురువర్యా మా వంశంబునకు
సంతానము లేకుండుటచే
వంశము నిలువదు అందున మేము
ఏమి జేయవలె దెలుపు డికన్॥ 2

కుసుమ శ్రేష్టిని గాంచి గురుడు
ధైర్యంబుగను ఇటు బల్కె
వైశ్య శ్రేష్టా ఒక సూత్రంబును
చెప్పెద శ్రద్ధగ విను మనియె॥ 3

నీవలె పూర్వము దశరథరాజు
సంతానము లేకుండుటచే
వశిష్ట మహాఋషి ఆజ్ఞ చేతను
పుత్రకామేష్టిని జేసెనుగా॥ 4

పుత్రకామేష్టిని చేసిన వెంటనె
దశరథ మహారాజునకు
శౌర్యగంభీర్య సద్గుణవంతులు
నల్గురు పుత్రులు గల్గిరిగా॥ 5

కుసుమశ్రేష్ఠి నీవును గూడ
విధ్యుక్తంబగు యాగమును
అట్లు చేసిన సంతానంబు
తప్పక గల్గును యని దెల్పె 6

కుసుమశ్రేష్ఠి యాగము కొరకు
ఋత్విక్కులను పిలపించి
సామగ్రులను సమకూర్చియును
సభాసదులకు ఎదుటుంచె॥ 7

భాస్కర గురుని ఆధ్వర్యంబున
విధిప్రకారము ఋత్విక్కుల్
అగ్నిలో హోమము హవిస్సు వేల్చుచు
సామగానమును జేసిరిగా॥ 8

కొందరు విప్రులు మంత్రపఠనము
చాలగ జేయుచు నుండిరిగా
కుసుమశ్రేష్ఠియు కౌశిమాంబయు
హోమప్రదక్షిణ జేయుచును॥ 9

ఋత్విక్కులచే వేల్చగబడిన
హవిర్భాగమును దేవతలు
సంతోషముతో స్వీకరించిరి
ధూమము అంత వ్యాపించె॥ 10

అమ్మవారి ఉయ్యాల ఉత్సవము



శ్రీ కుసుమ వేణుగోపాల గుప్త, ధర్మపత్ని గార్లు
(కోలారు గ్రామం పెండ్లికుమారోద్భవులు)

కుసుమశ్రేష్ఠికి అమ్మవారు విశ్వరూపం చూపుట



ఎల్. సూర్యనారాయణ శ్రేష్ఠి, ధర్మపత్ని సరస్వతమ్మ గార్లు (కోలారు)

మహేశుడపుడు అగ్నిహోత్రుని
దర్శన మిమ్మని జెప్పగను
అగ్ని దేవుడు జ్వాలలు గ్రక్కుచు
మంటలో మూర్తి వెలువడెను॥ 11

దీర్ఘములైనభుజములతోడ
విశాలమైన వక్షంబు
పచ్చనైన మీసము లొప్పి
మణుల కాంతితో మెరసెనుగా॥ 12

అద్భుతమైన రూపము గలిగిన
అగ్ని దేవుడు గనిపించి
క్షీరాన్నముతో కనకపాత్రను
ఇచ్చి అదృశ్యుం డాయెనుగా॥ 13

వైశ్య శ్రేష్టగు కుశుమ శ్రేష్టికి
కోరిన కోర్కె సిద్ధించె
ఋత్విక్కులకు దక్షిణ లిచ్చి
సభాసదులను పూజించె॥ 14

విశేషంబుగా దాన ధర్మములు
విందులు చాలా జేసియును
పాయసంబును భార్య భుజించగ
గర్భము ధరించె వింతగను॥ 15

గర్భవతియగు కౌశీమాంబపుడు
అనేక కళలతో ఒప్పెనుగా
ఆసమయంబున కుసుమశ్రేష్ఠియు
శ్రీమంతంబును జేయించె॥ 16

నగరేశ్వర జనార్ధనులకు
కట్నంబుల బహు నర్పించె
సంభ్రమంబున మునుగు చుండగ
నవమాసంబులు నిండెనుగా॥ 17

శుభలగ్నంబున కవల శిశువులు
పుత్రపుత్రికల ప్రసవించ
కుసుమశ్రేష్ఠి పురిటింటికిని
బోయి జూచెను పొంగుచును॥ 18

అంతలో దివ్యరూపధారిణి
కోటిమెరపుల దేవియును
ప్రత్యక్షంబుగ కుసుమశ్రేష్ఠికి
అగపడి వూరక నిలబడెను॥ 19

కుసుమశ్రేష్ఠికి దేవి యపుడు
దివ్యజ్ఞానము నిచ్చెనుగా
జ్ఞానముచేత స్తోత్రము జేయగ
దేవి ప్రసన్నత బల్కెనుగా॥ 20

వత్సా నీకు శుభము మంగళము
నీ తపస్సుకు మెచ్చితిగా
నే నిచ్చిన యా వరంబు కొరకై
పుట్టితి నేను పుత్రికగా॥ 21

నేను ఈశ్వరశక్తి తెలియుము
నీవు సమాధి వైశ్యుండు
అని బల్కియును దేవి యపుడు
అంతర్ధానము నొందెనుగా॥ 22

కుసుమ శ్రేష్టికి స్వప్నము రీతిగ
గనబడ ఆశ్చర్యము జెంది
వెంటనె ప్రకృతిలో బద్ధుండగుచు
మోహితు డాయెను తోచకను॥ 23

కుసుమ శ్రేష్ఠి స్నానము జేసి
యదేచ్ఛ విధిగా దానమును
జేసి విప్రుల పూజించియును
వంశము నిలచెనని వుప్పొంగె॥ 24

ఒక సమయంబున జ్యోతిశాఖ
శాస్త్రజ్ఞుండు అరుదెంచి
పుత్రపుత్రికల జన్మపత్రిక
వ్రాసెను జెప్పెద వినరండీ॥ 25

వైశాఖమాసమున శుక్లపక్షమున
మంగళ పునర్వసు నక్షత్రములో
శుక్రవారము దశమి దినంబున
శుభగ్రహముల గూడగను॥ 26

శుభలగ్నమున ఉచ్ఛగ్రహములు
మూడు శుభంబుల నుండగనూ
వైశ్యవంశము వృద్ధికిగాను
శిశుద్వయంబులు గల్గెననెన్॥ 27

పుత్రపుత్రికలు వుభయులు ఇద్దరు
శాశ్వతకీర్తిని బొందియును
సూర్యచంద్రులు వుండు వరకును
వంశము నిలుపుదురని వ్రాసె॥ 28

కుసుమ శ్రేష్ఠి కుమారునకును
విరూపాక్షుండని పేరిడెను
కుమార్తె నామకరణమునందు
అంతర్వాణి ఇటు బల్కె॥ 29

విష్ణువు సోదరి నీ కుమార్తెయు
వాసవి పేరు ఇడు మనియు
విష్ణువుచేత బొగడబడినది
కన్యక నామము యని బల్కె॥ 30

బ్రాహ్మణు లంత ఆకన్యకును
వాసవకన్యక పేరిడిరి
వాసవికన్యక విరూపాక్షులు
వృద్ధి బొందుచు నుండిరిగా॥ 31

దినదిన కాంతిసంపదలు
వుభయులు పెరుగుచు నుండగను
తల్లిదండ్రులు బంధువు లందరు
అధికానందము బొందిరిగా॥ 32

భాస్కరచార్యులు విరూపాక్షునకు
వేదోక్తంబగు వునపయనం
వేదత్రయముల విద్యను జెప్పగ
శీఘ్రమె కుశలుండాయెనుగా॥ 33



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

త్రింశో ఽ ధ్యా యః (30)

శూతుడు శౌనక ఋషులకు జెప్పె
వైశ్యులు సాలంకాయునితో
శ్రవణము జేసిన వైశ్యచరిత్రమె
వివరించెదను వినుడనియె॥ 1

చిత్రకంఠుడను గంధర్వుండు
కైలాసములో వైశ్యులతో
శాపము జెంది చంద్ర వంశమున
జన్మించిన కథ వినరండీ॥ 2

ఖాండవ వనము దహించు వేళ
శర పంజరమును నిర్మించి
ఇంద్రుని చేత జయమును బొంది
లోకఖ్యాతి వహించెను॥ 3

శబ్ద వేదుల బాణంబులచే
చిత్రసేన గంధర్వులను
జయించి రాజసూయము చేసి
ఘోర తపస్సు చేసెనుగా॥ 4

కాలకేయులను అసురుల ద్రుంచి
శివునిచె పాశుపతాస్త్రంబు
బొంది గోగ్రహణమున కౌరవు లందరి
ఎవడు శౌర్యమున ఓడించె॥ 5

కృష్ణచంద్రుని సారథితోను
ఎవడు సేవ చేయించుకొనే
అట్టి పరాక్రమ ధనంజయునికి
పుట్టిన పుత్రుడె అభిమన్యు॥ 6

అభిమన్యు పుత్రుడే పరిక్షిత్తుగా
అతని పుత్రుడే జనమేజయుడు
జనమేజయు సూనుడు శతానందుడు
క్షేమనాముడతని పుత్రుడెగా॥ 7

క్షేమనామునికి విజయాఖ్యుండు
వాని కొమారుడె విష్ణువర్ధనుడు
విష్ణువర్ధనుడె చిత్రకంఠుడను
గంధర్వుండు దెలియండి 8

విష్ణువర్ధనుడు విద్యాచతురుడు
ధైర్య పరాక్రమ శూరుండు
ఒక సమయంబున విజయయాత్రకు
ప్రాక్ దిక్కునకు వెడలెనుగా॥ 9

పదశయనమును తన పట్టణమునకు
రాజరాజేంద్ర కుమారుని
చతురంగ బలముల కావలియుంచి
భటవర్గములతో వెడలెనుగా॥ 10

ప్రాక్ దిక్కుల పరాక్రమంబున
అంగవంగ సింహాళ దేశములో
రాజుల నందరి బాణవర్షముల
నొప్పించి స్వాధీనుల జేసుకొనెన్॥ 11

దక్షిణదిక్కుకు ప్రయాణ మొదలి
పాండ్యము తుండర దేశముల
రాజులందరిని శీఘ్రకాలమున
జయించి పడమర వెళ్లెనుగా॥ 12

కాంభోజ దేశము బర్బర దేశము
పులింద నిషాద మ్లేచ్ఛులతో
ఘోరంబుగను యుద్ధము జేసి
కప్పంబులను బహుగొనెను॥ 13

ఉత్తర దిక్కుకు బయలుదేరియు
పాంచాలకోసల దేశముల
రాజు లందరిని దర్పముతోడ
జయించి తన పురికొచ్చుచును॥ 14

మార్గమధ్యమున దివ్యంబైన
ప్రాకారగోపురాల్ పతాకముల్
వుద్యానవనములు బాగుగనొప్పు
పెనుగొండసమీపము వెడలెనుగా॥ 15

విష్ణువర్ధనుని ఆగమనంబు
దెలసి వైశ్యులు వేడుకతో
ఎదురుబోయియు సన్మానంబున
పెనుగొండకు రమ్మని వేడిరిగా॥ 16

వచ్చినవైశ్యుల విష్ణువర్ధనుడు
సన్మానించి ఇటుబల్కె
రేపటిదినము వచ్చెదననగా
వైశ్యులు ఎదురు చూచిరిగా॥ 17



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ఏకత్రింశో௨ధ్యాయః (31)

వసుధ నేలెడి విష్ణువర్ధనుడు
దినచర్యంబుల దీర్చుకొని
సభాసదనమునకు సరగున వొచ్చి
ప్రజలకు ప్రయాణమును దెలిపే॥ 1

విష్ణువర్ధనుని వైశ్యులు గాంచి
తమనగరముకు రమ్మనగా
విష్ణువర్ధనుడు వైభవంబునా
ప్రవేశించెను పొంగుచును॥ 2

వైశ్యశ్రేష్ఠులు విధవిధంబుగా
స్తోత్రము జేయుచు ముందుండా
పెనుగొండ పట్టణము పురజను లందరు
విష్ణువర్ధనుని జూచిరిగా॥ 3

చక్కని చుక్కలు సదాచారులు
పురంబులోని ప్రతిస్త్రీలు
వికసిత నేత్రాల్ విరివి చూపులా
విష్ణువర్థనుని జూచిరిగా॥ 4

రాజుదర్శనము వేడుక వలన
వొకస్త్రీ లత్తుక నుంచకయె
మరివొక అంగన కొప్పుగట్టకా
కొనవెంట్రుకల బట్టుకొని॥ 5

మరివొకస్త్రీయు హారము నందు
రత్నాల్ గ్రుచ్చుచు పరుగిడగా
అంతలొ రత్నాల్ జారి పోవగా
భూభాగము బహువై భవము॥ 6

ఉన్నతంబగు పతాకంబులు
చక్కని తోరణ పంక్తులును
మనోహరంబగు ముగ్గుల యిండ్ల
మేడల ముంభాగంబులను॥ 7

బహువిధంబుల భూషణ కాంతులు
రూపలావణ్యము స్త్రీజనులు
గవాక్షంబుల ద్వారములందు
రాజశ్రేష్ఠుని జూచిరిగా॥ 8

శృంగార మంటపాల్ వీధులయందు
వేశ్యస్త్రీలు వేడుకతో
మంగళ నీరజనంబుల చేత
పూజ గొనుచును వెళ్ళెనుగా॥ 9

కుసుమశ్రేష్ఠి గృహద్వారమున
వేశ్యస్త్రీలతో సన్మానం
సంపూర్ణంబుగ చక్కగ జరిపె
ఆ సమయంబున వాసవియు॥ 10

మేడలోనుండి తండ్రిని గాంచి
సంభ్రమంబునా దిగివచ్చి
మెరుపు రూపము వాసవకన్యక
తండ్రి సమీపము నిలబడెను॥ 11

కుసుమశ్రేష్ఠి కొమార్తెతోను
పొమ్మ పొమ్మని పలికెనుగా
వాసవి కన్యక లక్షింపకనే
తండ్రి ప్రక్కనే నిలబడెను॥ 12

కుసుమాంబా యను ఆకాశమున
ప్రకాశించెడి చంద్రుడనా
కుసుమశ్రేష్ఠి రోహిణాదిలో
జన్మ మొందిన మణియట్లు॥ 13

విరూపాక్షు డను కల్పవృక్షము
　　ననుసరించిన శుభలతయూ
వైశ్యవంశము సముద్రమందు
　　వుద్భవించినా అమృతముగా॥ 14

వాసవికన్యక తన ప్రభావమున
　　విష్ణువర్ధనుని కన్నులకు
సౌందర్యాంగనగా గనబడగానే
　　మోహితు డగుచు నిటు జేసే॥ 15

విరివిగ జూచుచు తలనాడించుచు
　　చేతుల త్రిప్పుచు మైమరచి
మోహచిత్తుడై ఆశ్చర్యమునా
　　ఇట్లు వర్ణనా జేసెనుగా॥ 16

నాల్గుదిక్కులను దిగ్విజయయాత్ర
　　తిరిగి స్త్రీలను జూచితిని
ఇట్టి సుందరస్త్రీ రత్నమును
　　ఎందున జూచి యుండనుగా॥ 17

మెరుపే స్త్రీరూపంబును బొంది
　　వుద్భవించినది కాబోలు ?
ఆహా ఏమి ఆశ్చర్యమని
　　కన్యామణిని వర్ణించె॥ 18

అరికాళ్ళ నెడి రెండు కమలముల్
రెండు పాదములు తాబేళ్ళు
రెండు బంగరు తూణీరములు
తూణీరములపై తొడలుండు॥ 19

అరటిస్తంభముల పై భాగమున
బంగరు ఇసుక జఘనములు
జఘనంబులపై అమృతపునాభి
నాభికిపైనా కొండలుగా॥ 20

పురోజంబు లను కొండల పైన
దివ్య శంఖము కంఠముగా
కంఠము పైన పున్నమ చంద్రుని
బోలిన ముఖము వున్నదిగా॥ 21

ముఖంబుపైనా సువర్ణ పట్టిక
అనగ లలాటము కాంతియును
బంగరు లలాట పై భాగమున
తుమ్మెద గుంపు జుట్టేగా॥ 22

పురోజంబులు బంగరు కుండలు
శంఖము పంటి కంఠంబు
ధనస్సు వంటి కనుబొమలును
భువన మోహిని వాసవియు॥ 23

కిరాతునవలెనే మన్మథుడెప్పుడు
దయారహితుడై లోకములా
చంపుచున్నాడు ఆశ్చర్యమని
వాసవకన్యను జూచుచునూ॥ 24

విష్ణువర్ధనుడు పులకాంకితుడై
మన్మథవేదన బొందియునూ
మణిమయంబులగు భూషణంబులు
పట్టువస్త్రముల విరివిగనూ॥ 25

పచ్చకర్పూర తాంబూలముల
ప్రత్యేకముగ వైశ్యులకూ
ఇప్పించియును ఈరీతిగను
మరల వైశ్యులతో ఇట్లనెనూ॥ 26

కాంతిసంపదల రతిని మించినది
ఊర్వశి లేక తిలోత్తమా?
ఎవరో ఈమె చెప్పుడనుచును
మధురాక్షరముల అడుగగను॥ 27

రాజుమాటలను వినిన వైశ్యులు
సిగ్గుచె శిరసులు వంచిరిగా
అందులో వృద్ధవైశ్యులు కొందరు
వినయముతోడ యిట్లనిరి॥ 23

వైశ్యవంశమున కుసుమశ్రేష్ఠి
పుత్రకామేష్టి జేయగను
అగ్ని దేవుని అనుగ్రహంబున
పుట్టిన బాలిక ఈసాధ్వి॥ 29

వీరివృత్తాంతము వివరము దెలిసి
ఏకాంతము తా జేరియునూ
ఏమి తోచకా వున్మాదంబున
ఇటునటు బొర్లుచు నుండెనుగా॥ 30

మంత్రిశ్రేష్ఠుడగు విజయసింహుడు
విష్ణువర్ధనుని వినయముతో
చింతకు ఏమికారణ మనియు
ఏమిజేయవలె జెప్పుడనెన్॥ 31

మంత్రిశ్రేష్టా చక్కగ వినుమా
శత్రుల నందరి జయించితి
అయినను గాని నాచిత్తమును
వాసవకన్యక గెలిచెనుగా॥ 32

నీవు శీఘ్రముగ వాసవికన్యను
నాకు గూర్పుము ఎట్లయినా
రత్నములైనా వస్తువులైనా
తుదకు రాజ్యమునిచ్చైనా॥ 33

ఈపలుకులను వినిన మంత్రియు
వెలుపలకొచ్చి సభయందు
కుసుమశ్రేష్ఠి వైశ్యులజూచి
కన్యనుగూర్చెడి రాజుకనెన్॥ 34

వాసవకన్యను రాజునకిచ్చి
వివాహకార్యము జేసినచో
లోకముకంతా రాజైనట్లె
నీకు సమానుడు లేడనియె॥ 35

కుసుమశ్రేష్ఠి మంత్రినిజూచి
కోపముగల వాడయ్యెను
హృదయంబున నే అడంచుకొనియు
ఏమితోచక నిలబడియు॥ 36

పెనుగొండపట్నముకు విష్ణువర్ధనుడు వేంచేసి వాసవ కన్యను మోహించుట.



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ద్వాత్రింశో ధ్యాయః (32)

కుసుమశ్రేష్టి వినయము నొప్పగ
రాజు మంత్రులతో ఇట్లనియె
మీరు జెప్పిన విషయములన్ని
మంచివి సందేహాము లేదు॥ 1

మావంశంబున కన్యక నిచ్చుట
ఇవ్వకుండుటకు విధి గలదు
అష్టాదశపుర వైశ్యుల బిలచి
వారి ఇష్టము నడుప వలెన్॥ 2

కుసుమశ్రేష్టి వాక్యంబులను
తెలిసిన రాజు శీఘ్రముగా
పదునెనిమిది పట్నాల వైశ్యులను
జేర్చి బహుమతు లిచ్చెనుగా॥ 3

కుసుమశ్రేష్టి వైశ్యుల గాంచి
వందనములు జేసియును
సభికులారా నా విన్నపము
శ్రద్ధగ వినుడు మీరనియు॥ 4

వాసవికన్యను రాజు గోరెను
ఇచ్చుటకూ తమ ఒప్పితమూ
తెల్పగ మీరు నాలోచించి
జెప్పుడు నగర స్వాములనెన్॥ 5

ఈ మాటలను వినిన వైశ్యులు
ఆహా! ఏమి ఇది వింత
క్రియవిక్రియములు జేసెడి మనకు
యుద్ధము జేసెడి రాజునకు॥ 6

వారికి మనకు సంబంధంబు
ధనిక దరిద్రుల రీతిగను
శాంతుల కోపుల స్నేహమురీతి
ఇది మన కొప్పని పనిగాదె॥ 7

విజయసింహుడను మంత్రి వైశ్యులతో
ఇట్లు బల్కెను వినరండి
సుందరవతులగు స్త్రీలు లోకమున
ఎందరో గల్గి యుండగను॥ 8

కన్యను గోరుట మీ అదృష్టం
కుబేర యింద్రుల సమమైన
విష్ణువర్ధను రాజు వివాహము
విహితమైనది జేయుడనెన్॥ 9

మాద్గల్యగోత్ర మాళిశేష్ఠుడు
నవ్వుచు మంత్రితో ఇట్లనియె
రాజ్యము సంపద ఇవి శాశ్వతమా
ఇవి లెక్కింపము, మే మనియె॥ 10

విక్రమసింహుడు మరల బల్కెను
వైశ్యవంశమున బాంధవ్యం
చంద్రవంశ సంబంధము వలన
వైశ్యులు ధన్యత నొందెదరు॥ 11

మునిగోత్రుండగు మర్వా శ్రేష్టి
కోపయుక్తుడై ఇట్లనెను
ఎంత కీర్తి ఏమి గల్గినను
ఇవి అన్నియు అపకీర్త్యు లనెన్॥ 12

ఓకి! వైశ్యాధర్మము తెలియద
నాల్గుజాతుల తొలి విప్రులకు
త్రిజాతులందు క్షత్రియులకును
రెండుజాతుల వైశ్యులకు॥ 13

ఒక్కజాతితో శూద్రులకుండు
వివాహమందు విధిగలదు
దోషము లేదు శాస్త్రముందును
దూషణ ఏమి లేదనెను। 14

మారజ గోత్రుడు పారద వైశ్యుడు
ఈ శాస్త్రము మే మెరుగ మనెన్
వృద్ధాచారము చూపిననైన
కన్యక నిత్తుము ఖండింతము॥ 15

విజయసింహుడు వైశ్యుల జూచి
పరిహాసించుచు ఇట్లనియె
పంచమ వేదమునందు జరిగినది
యయాతి దేవయానులకు॥ 16

భారతమందు వున్నదిగాన
మా ప్రభువుకు మీరు బల్కకనే
యోగ్యుడైన మా రాజున కిచ్చి
పెండ్లి జేయుడు శీఘ్రమునే॥ 17

మైత్రేయగోత్రి నాగశ్రేష్టి
మరల జవాబు జెప్పెనుగా
శుక్రాచార్యుల అనుగ్రహంబుచె
కచుని శాపమున అట్లాయె॥ 18

ఋషుల అనుగ్రహంబు కల్గిన
యల్పము మహత్తరంబగును
అది సమన్వయము కాని ధర్మము
కాదని దానిని ఖండించె॥ 19

శ్రీవత్సగోత్రి శ్రీరంగశ్రేష్టి
మంత్రిని జూచి ఇట్లనెను
మీరు కన్యను గోరుట అంత
ధనంబు గోరకై దెలిసెనుగా॥ 20

మా ధనంబులు రాజున కిత్తుము
కన్యను ఇవ్వము అని బల్కె
మంత్రి క్రోధము జాలగ జెంది
గద్ధరించి బహు క్రోధముతో॥ 21

సనందగోత్రి గురు శ్రేష్టి
హేళన జేయుచు నిట్లనియె
చంద్రవంశ మనుపాలు నందున
విషువర్ధనుడు జనించెను॥ 22

ఈ వంశమునకు కూటస్తుండగు
బృహస్పతి భార్యను చంద్రుండు
తారను గ్రహించిన వంశము గాన
మే మీవంశము కివ్వముగా॥ 23

వైశ్యు లందరు నిర్భయంబుగా
బల్కిన బల్కులు వినుచుండి
విజయసింహుడు దర్పంబునను
హేళన జేసి బల్కెనుగా॥ 24

జీవిత మంతా వడ్డీతో గడిపి
పెద్దబొజ్జలు పెంచితిరి
మీగర్వమును నివృత్తి జేతుము
అని బల్కుచును గర్జించె॥ 25

వాసవకన్యను బలాత్కారముగ
ఎత్తుక పోదుము జూడుమని
మంత్రులందరు సౌంజ్ఞల చేత
భటవర్గంబును జేసెనుగా॥ 26

బుద్ధిమంతులగు వైశ్యులు కొందరు
యోచన జేసి యిట్లనిరి
ఏమి సుఖంబు రాజు బొందును
దీనిని మీరు దెలియుండి॥ 27

సీతను రావణు డెత్తుకు పోయి
ద్రౌపతి గోరి కీచకుడు
దమయంతిని జూచి కిరాతకుండు
అట్లే రాజు దగ్ధ మగును॥ 28

ఈ విషయంబు రాజు దెలుసుకొని
వైశ్యుల చెంతకు రావించి
సన్మానంబులు బాగుగ జేసి
నయభయంబుల బల్కెనుగా॥ 29

ఈ పలుకులు వినిన వైశ్యులు
ఏకాంతంబున జేరియును
రాజయోచన గ్రహించి వారలు
తాత్కాలిక యోచన జేసియును 30

వైశ్యు లందరు రాజును గాంచి
సంతోషముతో ఇట్లనిరి
కన్యను మీకే ఇత్తుము మేము
ప్రస్తుతము ఇది మానండి॥ 31

వివాహయత్నము జేయుచు నుందుము
మూడు దినంబులు గడు వనగా
తమరు వచ్చినా కన్యక నిత్తుము
తప్పక మీరు నమ్మండి॥ 32

ఈ మాటలను విష్ణువర్ధనుడు
విని హర్షంబును బొందియునూ
పెనుగొండ పట్న భవనములోన
కాలము గడుపు చుండెనుగా॥ 33

---

## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

### త్రయస్త్రింశో ఽధ్యాయః (33)

మహాత్ముడైన భాస్కరచార్యులై
విష్ణువర్ధనుని వృత్తాంతం
వృద్ధవైశ్యుల బుద్ధిప్రమాదము
చారుల వలన దెలిసియును॥ 1

గురువరు డంతా దివ్యదృష్టిచే
జరుగబోవు కార్యంబులను
దెలసి విప్రుల బంపగ నపుడు
విప్రులు బాలుల గాంచిరిగా॥ 2

బాలవైశ్యులు విప్రుల వలన
విష్ణువర్ధనుని కృత్యమును
వృద్ధవైశ్యులు భోజనంబుకై
రాజును నిలపిన దంతయును॥ 3

బాలనగరులు వేడుకతోడ
రాజు సమీపము జేరగనే
రాజు బాలులకు సన్మానంబులు
జేయగ బాలురు బల్కిరిగా॥ 4

మాకులంబులో కల్యాణకార్యమున
కన్యాదాతయు గృహీతయు
ఫలహార భోజనములు జేసిన యెడల
బంధుత్వంబు కుదుర దనెన్॥ 5

గదికిన ఇంటిలో అడుకదు గాన
మీరు మీపురికి వెడలియును
మూడు దినములు గడచినపిమ్మట
విజయము జేయుడు యని దెలుప॥ 6

వైశ్యబాలుల వాక్కుల వినియు
రాజుకు ఏమియు తోచకను
క్రోధము జెంది వైశ్యబాలులతో
ఈ పలుకులను బలికెనుగా॥ 7

మీరు సర్వదా అనృతవాదులు
నమ్మట యోగ్యము గాకుండే
అందున ఇపుడె వాసవికన్యను
గ్రహింతు నేను నిజ మనెన్॥ 8

నేర్పరియైన ధ్వనియును బాలుడు
ధైర్యంబుగను ఇటుబల్కె
రాజా మేము అసత్య మాడము
ప్రతిజ్ఞ జేతుము యని బల్కె॥ 9

సూర్యుడు పడమట యందుదయించిన
మేరుపర్వతము కదలినను
అంతరిక్షము నేలబడినను
వజ్రాయుధము విరిగినను॥ 10

సముద్ర మెండి పోయినగాని
మాట తప్పము నమ్మండీ
కన్యక నిచ్చుట తప్పినయడల
తప్పక మరణము పొందెదము॥ 11

ఈ వాక్యంబును నడువక పోయిన
మహాపాపములు పొందెదము
మా శపథముకు సూర్యచంద్రులు
పంచభూతములు సాక్షునిరి॥ 12

ఈ పలుకులకు విస్మయమొంది
రాజు మహానందము బొంది
బాలుర నందర ప్రేమించియును
తన పురంబుకు పోయెనుగా॥ 13

పట్టణంబున విష్ణువర్ధనుడు
భోజన నిద్రల మానియును
భార్యలయందు కామ భోగములు
వదలిదుఃఖమున మునిగుండె॥ 14



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

చతుస్త్రింశోఽధ్యాయః (34)

విష్ణువర్ధనుడు వెడలిన పిమ్మట
వైశ్యులు నగరంబుకు వచ్చి
నగరేశ్వర దేవాలయంబులో
తమ సంగతిని వైశ్యులకు॥ 1

తెలియ జేసిన వైశ్యుల గాంచి
వైశ్యులు భాస్కరచార్యులతో
సంతోషించి గృహములు జేరి
భోజనంబులు జేసిరిగా॥ 2

వైశ్యులు భాస్కరచార్య గురుడును
నగరేశ్వర మంటపమును జేరి
వృద్ధవైశ్యుల వృత్తాంతంబును
బాలవైశ్యుల నిశ్చయము॥ 3

అంతా గురునకు విన్నవించియు
జేయదగిన కార్యంబును అడుగ
గురువర్యుండు వైశ్యుల గాంచి
అపరార్కఋషి నిశ్చయము॥ 4

బ్రహ్మపురువుల యందు పుట్టిన
వైశ్యఋషుల గణంబుల
గోత్రిప్రవరుల సాంఖ్య నామంబుల
శ్రద్ధగ వినుడి యని పల్కె॥ 5

షట్శత ద్వాదశి గోత్రంబులను
నూటారెండు గోత్రంబులన్
ఋషుల పేర్లు ప్రవర లన్నియు
ఈ రీతిగను వివరించె॥ 6

పదునెనిమిది పట్నాల వైశ్యులను
తక్షణమే రావలయు నని
పత్రిక వ్రాసి దూతను బంపగ
అష్టాదశ పుర వైశ్యులు వచ్చిరిగా॥ 7

అష్టాదశ పట్నాల నుండి
వచ్చిన వైశ్యోత్తములకును
భోజనంబులు వసతులు జేసి
కుశల ప్రశ్నలు జేసిరిగా॥ 8

వైశ్యు లందరు భాస్కర గురునకు
వందనంబులు జేసియును
సంతోషముతో కట్నము లిచ్చి
విడిది నివాసము లుండిరిగా॥ 9



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

### పంచ త్రింశో ఽధ్యాయః (35)

మరు దినంబున వచ్చిన వైశ్యులు
కాలకృత్యముల దీర్చుకొని
భాస్కరచార్యుల ముందుంచుకొని
నగరేశ్వరు సన్నిధి జేరిరిగా॥ 1

నగ రేశ్వరునికి నమస్కరించి
ఉచితాసనముల కూర్చొనగా
కుసుమశ్రేష్టి వైశ్యోత్తములను
పూజించి యిటు బల్కెనుగా॥ 2

విష్ణువర్ధనుడు వాసవికన్యను
నా కిమ్మని నను ప్రశ్నించె
ఇచ్చుట మానుట నాది కాదని
మీ సమ్మతమని జెప్పితిని॥ 3

మీరందరును యోచన జేసి
నిర్ణయించియు దెలుపు డిక
మీరు చెప్పిన రీతిగ నేను
నడిచెదననియు నిలబడెను॥ 4

కొందరు వైశ్యులు కోపముతోడ
లేచి నిలబడి యిట్లనిరి
క్షత్రియు లెక్కడ వైశ్యు లెక్కడ
ఇది అపనిందని బల్కిరిగా॥ 5

కొందరు వైశ్యులు రాజు పక్షమున
గర్వముజెంది బల్కిరిగా
చంద్రవంశము రాజుకు మనము
కన్యనిచ్చి కళ్యాణము చేయు డనెన్॥ 6

విరుద్ధ వచనము వినిన కొందరు
ఇట్లు బల్కిరి వినరండీ
స్వజాతి యందే వివాహ శాస్త్రము
పరాశరఋషిచే నిర్ణయము॥ 7

యితర జాతుల సంబంధమున
శాస్త్ర మార్గములో నిందితము
ధర్మము విడచిన నరకము గల్గును
మాకు సమ్మతము గాదనిరి॥ 8

జగన్నాథపుర కేమలాక్షుండు
వైన్యఋషి గోత్రవైశ్యుండు
భూమిపాలుని సంబంధంబు
దైవాధీనము యని బల్కె॥ 9

జగన్నాథపుర భద్రశ్రేష్టుడు
భరద్వాజ ఋషి గోత్రజుడు
ఆహా యేమి ఈ కార్యంబు
నరకప్రాప్తి యని నుడివే॥ 10

ఇట్టి వివాహము చేసిన యెడల
సురాపాన బ్రాహ్మణనీతి
బహిష్కరింప బడెదరు గాన
కాదని దాని ఖండించె॥ 11

కళింగపురము గాంగేయుండు
భండమక గోత్రము వైశ్యుండు
క్షత్రియుండు పూజ్యుడు కాడు
యీ వివాహము తగదనియె॥ 12

గౌతము గోత్రము శంకరశ్రేష్ఠి
ఆహా ఏమి ఈ పలుకుల్
మార్గాయాసము జేత విూరలు
కఠోరంబుగా బల్కెదరా॥ 13

పాలకుండము పురాధీశుడు
కాలకంజఋషి గోత్రజుడు
యెక్కువ జాతికి తక్కువ మనము
ఇచ్చి వివాహము లెస్స యనెన్॥ 14

పాలకుండ పుర వీరశ్రేష్ఠి
నే జెప్పెదనూ విను మనెను
విద్వాంసులచే విప్రులచేత
ఈపని తగదని వినియుంటిమి॥ 15

వేడిచూపుల సూర్యశ్రేష్ఠి
చాలు చాలునని యిట్లనియె
యోగ్యుడైనా రాజున కిచ్చుట
యుక్తమైనదని వినియుంటిమి॥ 16

ధర్మపురంబున రుద్రమ శ్రేష్టి
శాస్త్రములన్ని విడువుమనెన్
వృద్ధాచారము విన్నను కన్నను
కన్యక నిచ్చుట దోషమనె॥ 17

యిష్వాకుల వంశము మాధవ శ్రేష్టి
అయోధ్యా భయము మనకెందుకనెన్
వైశ్యులు లేనిది సర్వశూన్యము
రాజుకు భయపడ పని యేమి॥ 18

మాళవదేశ నగరాధీశులు
యేదో యోచన జేయుడికన్
కార్యము లున్నవి వెళ్ళగవలెను
త్వరితమె తెల్పుడు యని బల్కె॥ 19

కేశవపుర సుభద్ర శ్రేష్టి
ఇంత తొందర ఎందుకనెన్
కులగౌరవము నిలబెట్టకనె
ఏమి జేసెదవని దండించె॥ 20

మాధవ శ్రేష్టి మరి యిట్లనెను
ఏమి కోలాహల మిదియు
తల్లిదండ్రుల బంధువర్గముల
యిష్టము కొలది జేయుడనెన్॥ 21

పెద్దశిష్ట గోత్రోద్భవుడు
నేర్పరి మాటల వైశ్యుండు
తల్లిదండ్రుల బంధువు లొప్పక
కార్యము జేతుర యని నుడివె॥ 22

సభలో వైశ్యులు విధవిధంబుల
రెండు పక్షముల నిశ్చయముల్
కుసుమ శ్రేష్టి వినుచు నుండియు
కోపము జెందక యిట్లనియె॥ 23

నగరస్వాములు మీరందరును
ప్రశాంతంబుగా యుండియును
మీమీ బసలకు మీరు వెళ్ళుడి
స్వస్థానంబున నుండు డనెన్॥ 24

కుసుమ శ్రేష్టి భాస్కర గురునకు
సకల వృత్తాంతము దెలిపెనుగా
భాస్కరచార్యులు పుర వైశ్యులను
అందరి పిలచి యిట్లనెను॥ 25

వైశ్యులారా నిస్సందేహము
గల్గిన మాట్లను జెప్పుడికన్
కన్యను యిచ్చుట యివ్వకుండుట
ఖండితంబుగా జెప్పు డనెన్॥ 26

కొందరు వైశ్యులు వూరకుండిరి
కొందరు లేచి యిట్లనిరి
వాసవి కన్యను యిచ్చుట మాకు
యిష్టము లేదని బల్కిరిగా॥ 27

కన్య నియ్యక పోయిన యడల
విష్ణువర్ధనుండు కోపించుగ
దానికి ఏమి చెప్పెద రనిన
ప్రాణంబులు విడుతుము మే మనిరి॥ 28

భాస్కరచార్యులు శపథము వినియు
ఎన్ని గోత్రముల వారనగా
నూటారెండు గోత్రము లనియు
లెక్కించి వైశ్యులు నుడివిరిగా॥ 29

భాస్కర గురుడు సంతోషించి
వైశ్యుల గూడి వెడలియును
నగరేశ్వరస్వామి మంటపంబున
గూర్చొని యోచన మొదలిడిరి॥ 30

కుసుమశ్రేష్టి సంతోషముతో
దుష్టరాజుతో మన కేమి గతి
బాలు లందరు జేసిన శపథం
ఏమి జేయ వలె యని బల్కె॥ 31

ఇట్లిందరు సభలో గూర్చొని
యోచన జేయుచు నుండగనే
వైశ్యులు చాలా వుత్సాహముతో
అచటికి కొందరు వచ్చిరిగా॥ 32

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## షట్త్రింశోఽధ్యాయః (36)

కుసుమశ్రేష్ఠి వాక్యంబులు విని
షట్శత ద్వాదశి గోత్రజులు
పట్టుబట్టిన బాలవైశ్యులను
జూచి రౌద్రముతో నిట్లనిరి॥ 1

చంద్రవంశ మను పాలసముద్రము
నందు జనించిన చందురి వలె
ఒప్పెడి విష్ణువర్ధను రాజుకు
కన్య నివ్వ మని మూర్ఖు లనెదా॥ 2

విష్ణువర్ధనుడు శిష్టరక్షకుడు
కీర్తిసంపదల సుగుణుండు
నారాయణాంశ సంజాతుండు
ఇచ్చిన మనమూ ప్రబలుదుమూ॥ 3

షట్ శత ద్వాదశ గోత్రజు మాటలు
నూటారెండు గోత్రజులు విని
రాజుకు మనకు ఈ సంబంధము
యుక్తము గాదని మరి పల్కా॥ 4

యయాతిరాజు దేవయానిని
వివాహ మాడుట విన్నాము
బ్రాహ్మణ క్షత్రియ వివాహ ముండును
మనకు రాజుకు తగిన పని॥ 5

పానక గోత్రిము మాధవ శ్రేష్టి
అయోగ్యమగు మీవచనములన్
ఈ యుగముకు సంబంధము గాదు
కనుక కన్యను ఇవ్వముగా॥ 6

శకలుడు యవనుడు సింహానుండు
కేరళ గాంధార రాజులును
నధర్మపరులు మదోన్మత్తులు
అట్లే వుండును ఈరాజు॥ 6

మంచి చరిత్రము గలిగిన వైశ్యులు
వీరి కిచ్చుట మన లోన
కుండక గోళక సంతానముచే
వంశము చెడు ననె మాధవుడు॥ 7

ఘంటసాల పుర వీర శ్రేష్టి
జౌను, సంకరంబు గలుగునుగా
పిత్రులకు నరకము తప్పక గల్గు
అంత్య జాతితో సము లగుదు మనెన్॥ 9

ఆరునూట పండ్రెండు గోత్రజు లంత
నూటరెండు గోత్రజుల గాంచి
రాజుకు మనము ఇవ్వక పోయిన
చాలా ప్రమాదకర మనియె॥ 10

వాసవి కన్యక నెత్తుక పోయి
పరివారముతో మనలందరిని
జంపించును ఇది తప్పదు గాన
అప్పుడు ఏమి జేతుర నె॥ 11

గిరి శ్రేష్టి శేష శ్రేష్టియు
దురభిమాన వాక్కులను
తిరస్కరించి మాధర్మము నే
జంకక మేము నడిపెదము॥ 12

ఒక సమయంబున విష్ణువర్ధనుడు
మా పై దర్పము జూపినచో
వాసవి కన్యక మేమును గూడ
తప్పక నగ్నిలో బడెద మనెన్॥ 13

మేము నశించగ విష్ణువర్ధనుడు
తప్పక ఫలితము బొందునుగా
మేము మరణము జెందియు నైన
కులధర్మమును నిలిపెదము॥ 14

పులస్త్యగోత్ర నృసింహశ్రేష్ఠి
ఈ వాక్యములను వినగానే
మేమును గూడ అట్లే జేతుము
సత్యము దప్ప మని బల్కె॥ 15

స్వధర్మమున చచ్చుట మేలు
పరధర్మంబున భయమేగా
అట్టి ధర్మమున పాపము బొంది
నరకము తప్పక పొందు ననె॥ 16

నీటి బుగ్గ వలె ప్రాణ ముండును
రోగంబులతో గూడినది
ఎన్నటి కైనా చావక తప్పదు
గనుక కీర్తినీ నిలపెదము॥ 17

ఇంద్రవైభవము సంపదనైన
అపకీర్తినియో మొప్పముగా
కీర్తికిగాను తృణప్రాయముగ
అగ్నిలో ప్రాణము విడచెదము॥ 18

నూటరెండు గోత్రవైశ్యుల
దృఢనిశ్చయము వినగానే
షట్‌శతగోత్ర వైశ్యులు చాలా
చింతతోగూడి నిలచిరిగా॥ 19

చంద్రశ్రేష్టి అర్కశ్రేష్టియు
మొదలగు వైశ్యులు అందరును
నిశ్చేష్టితులై ఏమి తోచక
పిమ్మట ఇట్లు నుడివిరిగా॥ 20

మీరు జేసెడి పనులను జూచిన
మాకు ఇట్లు తోచినది
తేలుకు భయపడి పరుగిడి పోయి
పాము నోట పడినట్లే॥ 21

అయ్యో ఆత్మహత్య బొందిన
నరకప్రదము దోషముగా
పరలోకములో లేవని మేము
ధర్మశాస్త్రములు వింటిమిగా॥ 22

ఇట్టి కృత్యముకు మేము ఒప్పము
మీరు అగ్నిలో దుముకండి
చచ్చిన పిమ్మట కీర్త్యపకీర్తులు
మీరు కానరు దెలియండి॥ 23

మంచి చెడ్డలను బ్రతికియుండగనే
చూచిన చూపులు లెస్సగనె
ఇట్లు తెలియక మీమతల రీతిగ
అగ్నిలో బడుమని బలికెదరా॥ 24

షట్ శతగోత్ర వైశ్యుల మాటలు
భద్రశ్రేష్ఠి విని యిట్లనియె
వంశముకొరకు ప్రాణము విడచిన
నరకము లేదు తెలియు డనెన్॥ 25

పుట్టినవారు గిట్టక తప్పదు
ఈ సూత్రముల దెలసి గదా
పెద్ద లందరు పోయిన రీతిగ
ప్రాణాల్ విడుతుము తెలియండి॥ 26

గోవుల కొరకు విప్రుల కొరకు
వంశము కొరకై యుద్ధములో
ప్రాణము విడచిన నరకము లేదు
ధర్మశాస్త్రము గల దనిరి॥ 27

కామశ్రేష్ఠి నాగశ్రేష్ఠియు
నార్నూట పండ్రెండు గోత్రజులన్
జూచి కోపముతో నిట్లు బల్కిరి
మీరు పొండిక మమ్ము వదలియును॥ 28

నూటరెండు గోత్రజు లందరు
ధీరత్వంబున బల్కిరిగా
ప్రాణములైనా విడుతుము కాని
కన్యక నివ్వము నమ్మండీ॥ 29

ఇప్పటినుండి మీకును మాకును
సంబంధంబులు వదలితివిగా
మీ కుల కన్యల మీరే బొందుడు
మా కన్యల మీ కివ్వముగా॥ 30

మీకును మాకును విభాగ మైనది
ఈశుడు తప్పక జూచునుగా
నగరేశ్వరస్వామి సన్నిధి నుండి
పొమ్మని తీవ్రమె బల్కిరిగా॥ 31

ఆ సమయంబున షట్‌శతగోత్రులు
విభజించి కొని వెడలిరిగా
పిమ్మట నూటారెండు గోత్రజులు
అందే గూర్చొని యుండగనూ॥ 32

బాలవైశ్యుల గాంచి బల్కిరి
ఆమూలాగ్ర వృత్తాంతం
వినిన బాలురు సంతోషమున
కీర్తి గల్గునని బొంగిరిగా॥ 33

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## సప్తత్రింశోఽధ్యాయః (37)

వైశ్యాధములు వెడలి పోవగా
వైశ్యశ్రేష్ఠులు గూర్చొనియు
వంశ ధర్మముల నిలుపుట కొరకై
ఆలోచన కొరకు మొదలిడిరి॥ 1

ఈశుడు గాక అన్యుడు మనకు
రక్షకు లెవ్వరు లేరనియు
అట్టి రక్షకుని శరణు బొందిన
మనకు శుభంబులు గల్గునుగా॥ 2

రాజుకు కన్యను యివ్వని యడల
మిక్కిలి కోపము జెందియును
బాలవృద్ధులగు మన లందరిని
శూన్యము జేయుట తప్పదుగా॥ 3

ఇట్లు యోచనలు జేయుచు జేయుచు
భాస్కరచార్యుల జేరియును
వైశ్యశ్రేష్టులు అంతయు దెలుప
భాస్కరచార్యులు ఇట్లనిరి॥ 4

మీవృత్తాంతము మీశపథములను
నారదునిచె వినియుంటిని
ఈరహస్యము యింత వరకును
ఎవరికి తెలుపక యుంచితిని॥ 5

జన్మసఫలత కర్మపక్వము
గలిగిన సమయము వచ్చినది
దీనిని గూర్చి ఒక యితిహాసము
జెప్పెద వినుడి యని బల్కె॥ 6

పూర్వము వశిష్ట మునీశ్వరునకు
జనార్దనా ముని శుభములను
తెలిపి వెడలగా వశిష్ట మునియు
మాయా మోహితు డాయెనుగా॥ 7

నేను క్షత్రియుండని జెప్పియును
రాజుల కన్యను బెండ్లాడి
వశిష్ట మునియు విప్రుల గూడి
బహుకాలంబు గడిపెనుగా॥ 8

ఒక సమయంబున నిజము దెలియగా
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులును
ఈ యధర్మమును సహించలేక
అగ్నిలో దగ్ధం బయ్యిరిగా॥ 9

దీనిని జూచిన వశిష్ట మునియు
అగ్నిలో బడుటకు యత్నింప
జనార్దనా ముని విడిపించగనూ
మాయ దెలసి నిర్మలు డాయెనుగా॥ 0

ఈ జగత్తు మాయ స్వరూపము
కులధర్మములను జూడ డనెన్
ధర్మము నడిపి కైలాసంబును
పొందుడు మీరలు యని జెప్పె॥ 11

నేను మాత్రము నా పుత్రికతో
అగ్ని ప్రవేశించెద గాన
మీ రందరు నా కార్యంబునకు
ఆజ్ఞను ఇయ్యుడని వేడె॥ 12

బంధువర్గములు వుండిన వాడై
కుసుమ శ్రేష్ఠి మరణమునకై
సభికు లందరికి నమస్కరించి
మరి మరి ఆజ్ఞను వేడెనుగా॥ 13

బంధువు లందరు ఈ వాక్కులు విని
నీవు జెప్పినది యోగ్యము గాదు
కులసంరక్షణ కీర్తి నిలుపుటకు
అందరి బాధ్యత వున్నదిగా॥ 14

నీవు కన్యకా జచ్చిన పిమ్మట
విష్ణువర్ధనుడు మమ్ములను
కపట కల్పనల నైశ్యు లనియును
మమ్ముల గూడా జంపునుగా॥ 15

శుభంబు గాని అశుభము గాని
కులగౌరవమును త్యజింపగా
జగత్తునందు కీర్తిని నిలిపి
ప్రాణము తృణముగ విడచెదము॥ 16

భాస్కర గురుని ఎవరు గోరెదరో
వారు మాత్రమే వుండుడయా
ఇష్టము లేనివారు బొండని
నుడువగ సభికులు ఇట్లనిరి॥ 17

భద్రశ్రేష్టి ప్రతిజ్ఞ వినియు
తన వృత్తాంతము జెప్పియును
సంతస మొంది మనమును గూడ
అగ్నిలో బడుదుము అని బల్కె॥ 18

భద్రశ్రేష్టి మాటలు వినగా
వైశ్యులు సంతోషించియును
పట్టణమంతా చాటించిరిగా
దానిని జెప్పెద వినరండి॥ 19

ప్రాణభీతులు అయిన వారలు
ఇప్పుడె పరుగులు ఎత్తండి
కులగౌరవమునకు ప్రాణ మిత్తు మన
అనుసరింపుడు మాధర్మం॥ 20

బాలవైశ్యుడగు ధర్మశ్రేష్టి
వారల చెంతకు వచ్చియును
అగ్నిలో నేను దుముకుదు గాన
అగ్రతాంబూలము యిమ్మనెను॥ 21

బాలవైశ్యుని జూచి యిట్లనిరి
నూటయిబ్బండ్రు నగరజులు
ఓరీ బాలుడ నీ వాక్యంబులు
యోగ్యము గావు పొమ్మనిరి॥ 22

దిట్టతనంబున బాలుడు వైశ్యుల
జూచి ధైర్యముగ బల్కెనుగా॥
కులగౌరవములు పెద్దలకేనా
బాలులు కులస్థులు గారేమో॥ 23

పాడు శరీరము నిలుపుటకంటె
కీర్తి శరీరము నిలుపుదును
అందున వీరకంకణ మిడుడు
అగ్ని ప్రవేశింతును ఆజ్ఞిండు॥ 24

వైశ్యబాలకుని మాటలు వినియు
భాస్కర గురుడు వైశ్యులును
పరమాశ్చర్యము బొందిన వారై
శిరసులు బాగుగ వూపిరిగా॥ 25



జయనామ సం॥ర మార్గశిర శు ౧౦ కి

అమ్మవారి పుష్పరథోత్సవము

కోలారు ఆర్యవైశ్యమండలి



అగ్నిగుండ ప్రవేశ నిశ్చయమునకు 102 కన్యకలు, దంపతులు
వీరకంకణధారణ

అట్లే యనియు భాస్కర గురుడు
యారుతమాల దళములతో
నూగు పోగుల గూర్చిన దారము
వైశ్యబాలునకు ఇచ్చెనుగా॥ 26

భాస్కర గురుడు సభికుల యెదుట
ఇట్లు బల్కెను వినరండీ
ఈ బాలకుడు వంశము కొరకడు
పాత్రిణ నిడుచునూ॥ 27

వైశ్యులు ధర్మము జేయు వేళలో
ధర్మశ్రేష్టి బాలకుని
దలచి దానమును జేసిన యెడల
వంశము వృద్ధి యగు ననియె॥ 28

వైశ్యసభికులు ఆ మాటలు విని
అట్లే జేతుము అని జెప్పి
బాలుని దలచి దాన మిత్తు మని
అందరు పలికిరి ఒకమారు॥ 29



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## అష్టాత్రింశో ఽధ్యాయః (38)

మణిగుప్తాది వైశ్యుల తోడ
సాలంకాయన ఋషి పల్కె
మాటల నేర్పరి శ్రేష్ఠుండైన
భాస్కరచార్యులు బల్కిరిగా॥ 1

వీరకంకణ ధారణంబును
వైశ్యు లందరు జేయు డికన్
అనగ సభికులు ధీరత్వంబున
కుసుమ శ్రేష్ఠితో యిట్లనిరి॥ 2

కుసుమ శ్రేష్ఠి మే మందరము
కులరక్షణముకు ప్రాణములు
విడుచుట కేమో సిద్ధుల మైతిమి
ఒక అనివార్యము దోచెనుగా॥ 3

(అనుమానము)

అతిసుందరవతి ఈ సాధ్వీమణియు
వాసవ కన్యక శరీరమున్
త్యజించు బుద్ధి యున్నదో లేదో
ఆమె యిష్టము దెలుపు డికన్॥ 4

సభికుల పలుకులు వినిన వెంటనే
కుసుమ శ్రేష్ఠి పుత్రునితో
స్వగృహంబుకు వెడలి నంతనే
సభికులు గృహముల కెళ్ళిరిగా 5

కుసుమ శ్రేష్ఠి భోజన మైన
పిమ్మట శయనా గృహ మందు
మృదువగు తల్పము పైన గూర్చొని
నిట్టూర్పు లిడుచుచు యోచించె॥ 6

అకటా కర్మము ఎట్లు మారెను
సంతాన హీనత జెందియును
పుత్రకామేష్టి యాగము జేసి
పొందరాని పుత్రిక బొందితిని॥ 7

ఈ కుమార్తెను గొప్ప వంశమున
యవ్వన సుగుణ పూజ్యు డగు
వరునకు కన్యాదానము జేసి
అత్తింటికి బంపగ దలచితిని॥ 8

ప్రతి పండుగలకు కుమార్తె నల్లుని
ఆహ్వానించి వుభయులకు
ఆభరణంబులు దివ్యవస్త్రములు
వేడుక నిత్తును ననుకొంటి॥ 9

కుమార్తె నల్లుని పరస్పర ప్రేమలు
జూచిన సంతసము జెందుటకు
అయ్యో నిత్యము కోరిక గోరి
పొంగుచు చింతను గలిగుంటి॥ 10

ఆహా ఏమి అకస్మాత్తుగా
పూర్వదుష్కర్మము యిట్లాయె
అకటా వింతా ఆశ్చర్యంబు
యోచించిన అనివార్యముచే॥ 11

యిక చింతనతో పని ఏమున్నది
జరుగున దేమో జరుగునుగా
అని ధైర్యంబును దెచ్చుకొన్నను
మరల చింతన గల్గెనుగా॥ 12

వాసవ కన్యక సుకుమారియును
అబల కోమల దేహి గదా
ఆకాశ మంటెడి అగ్నిజ్వాలలో
అయ్యయ్యో ఎటు పడవైతు॥ 13

అగ్నిమంటల జూచిన వెంటనే
వాసవ కన్యక భయపడినా
వైశ్యవంశముకు మలినము గల్గును
ఏమి జేయవలె తోచదుగా॥ 14

స్త్రీల చిత్తమును దెలుసుకొనుటకు
బ్రహ్మకునైనా తరమగునా
చంచలమైనది స్త్రీ హృదయంబు
అకటా యేమి జేతు ననెన్॥ 15

యోచన జేయుచు తండ్రి వుండగా
అంతలో వాసవ కన్యకయూ
గోరు వంకనూ చేత బట్టుకొని
తండ్రివద్దకు అరుదెంచె॥ 16

శిరమును వంచి యోచన జేయుచు
నుండిన తండ్రిని గాంచగనే
చిరునగ వొప్పి ముద్దు బల్కులలో
వాసవి తండ్రితో యిట్లనియె॥ 17

విచారంబుచే తపించుటకును
వినుపించుము నాకు ఏదైనా
పుత్రులకంటే పుత్రిక మిక్కిలి
వంశ పావనమురాలు గదా॥ 18

నాకు జెప్పని రహస్య మేది
వినుపించుము నాకు యేదైనా
అని బల్కగనే కుసుమశ్రేష్ఠి
భార్యతో గూడి దీనత నిట్లనియె॥ 19

మంగళవతియగు ముద్దుపుత్రికా
ఏమని నీతో దెల్పుదును
పుష్పమువంటి నీ దేహంబును
అకటా అగ్నిలో నెట్లిడుదూ॥ 20

ప్రాణము కంటే తీపగు వస్తువు
లేనే లేదు లోకములో
అయ్యో ప్రాణరక్షణ కొరకై
దారాసుతులను విడుతురుగా॥ 21

యిట్టి సమయమున ప్రాణంబులను
వంశము కొరకై విడుచుటయా
భూలోకములో ఎవ డున్నాడు
అయ్యయో ఏమి బల్కెదను॥ 22

అనుకూల వరునకు నిన్నొసంగి
మీ దాంపత్యము జూచుటకు
యువ్విళ్యూరుచు వుండిన నాకు
యిట్టి దౌర్భాగ్యము గల్గినది॥ 23

దుఃఖించుచును బలుకుచుండెడి
తండ్రిని జూచి ధైర్యముతో
తండ్రీ నీకు చింత ఎందుకు
దేహాబంధము ఇది గాదా॥ 24

చలించు చుండెడి రావియాకు కొన
బిందువు వంటిది యీ దేహం
రోగంబులకు ఆలయంబగు (పుట్టినిల్లును)
అశుద్ధ మస్థిర మైనదిగా॥ 25

యిట్టి దేహము తృణప్రాయము
విద్వాంసులు లెక్కింపరుగా
ఋణానుబంధము పశుపత్న్యాదుల
ఏటికి భ్రాంతులు గాగాదు॥ 26

షడూర్మంబులు దేహధర్మములు
ఆత్మనిత్యుడు అచలుండు
పంచభూతములు ఏమి జేయవు
శస్త్రంబులు భేదింపవుగా॥ 27

జనన మరణములు ఆత్మకు లేవు
దేహము అనిత్యమైనదిగా
వంశము కొరకు దేహము విడచి
తండ్రి కైలాసము వెడల మనె॥ 28

ధీరవచనముల విన్నను తండ్రి
చింత జేయుచు నుండంగా
వాసవి దేవి చిరుభిగ వొప్పగ
గొప్ప సంగతి దెలిపెనుగా॥ 29

దుర్లభమైన కైలాసంబు
తొల్లి నీకు నాచే వరంబుగా
యిచ్చి వుంటిని అట్టి కాలము
సమీపించినది యీ సమయం॥ 30

తల్లి దండ్రులు బంధుబలగము
శత్రులు మిత్రులు లేరు గదా
అన్ని లోకముల తల్లియు నేను
ప్రపంచ రూపిణి నే గానా॥ 31

నాకును నీవు తండ్రివి గాదు
నేను నీ కుమార్తెను గాను
మాయచేతను యిట్లు తలచితివి
యిక అజ్ఞానము వదల మనెన్॥ 32

అన్ని లోకముల దేవత నేను
ఒక కారణమును నీకు నేను
పుత్రిక గాను గనబడుచుంటి
ఇట్టి దృష్టి నీవు వదలు మికన్॥ 33

నన్ను జూచుటకు నీకు శక్తియు
లేద బాగుగా దెలియు మనెన్
ఎవడు నన్ను గోరునో వానికి
మృత్యువు అగుదును నే ననియెన్॥ 34

ఇట్టి వాక్యముల విన్న తండ్రియు
అత్యం తాశ్చర్యము జెంది
అమ్మా నేను యీ వాక్యములను
ఎట్లు నమ్మకము నా కగును॥ 35

బంధు బలగముకు ఎట్లు జెప్పుదు
వారిని నమ్మించుట ఎట్లమ్మా
ఓతల్లి నాకు నిజము జెప్పుము
నేను యడుగుదును యని బల్కె॥ 36

కోటి మెరపుల సమాన కాంతి
మెరపు తీగ వలె దేహంబు
సూర్య చంద్రాగ్నుల సమ తేజంబు
సమస్త దిక్కుల నిండించె॥ 37

నాల్గు భుజంబుల పరా దేవివై
సుందరమైనా కనుబొమ్మలతో
పరిశుద్ధంబగు చిరునగ వొప్పగ
తాటకంబుల ప్రకాశము॥ 38

గండదేశము గల్గి నట్టిది
కిరీట హారము లొప్పగను
భుజకీర్తులు మణిమయంబులై
అందెల తోడ వొప్పినది॥ 39

సువర్ణ చీర ధరించినదియు
వీణ బట్టుకొని యుండినది
చిలుకను చేత పట్టుకొన్నది
అట్టి రూపము ఎదుటుండా॥ 40

కుసుమ శ్రేష్టి ఆ రూపమును
జూచుట కశక్తు డాయెనుగా
వాసవకన్యక ముందు కార్యముకు
దివ్యదృష్టిని వొసంగెను॥ 41

కుసుమ శ్రేష్టి దివ్యదృష్టిచే
జూచి శిరస్సును వంచియుంనూ
నమస్కారించి స్వేచ్ఛగ జూచి
స్తోత్రము జేయ మొదలిడెను॥ 42

త్రిలోక మాతా నీకు నమస్కారము
భక్తపావనీ వందనమూ
మహాదేవి పరమేశాని
దేవదేవేశ్వరి వందనముల్॥ 43

సంసారంబున మునుగు వారి
తరించు లోకామాతవుగా
నిన్ను జూచుటకు శక్తుడ గాను
చాలించుము యని ప్రార్థించె॥ 44

అంతలో దేవి పూర్వరూపమును
ధరించి కన్యక ఆయెనుగా
ముందర జరుగు కార్యము లన్ని
దివ్యదృష్టితో జూడు మనెన్॥ 45

చేతిలోని వుసిరిక వలెనె
జూచిన తోచెను వివరింతు
యీ ఘట్టమును నడపిన భక్తుడు
రామలింగా శ్రేష్టేగా॥ 46

విష్ణువర్ధనుని మరణము గాంచె
విరూపాక్ష వైశ్యుల యాత్ర
అగ్నిగుండ ప్రవేశంబును
పుత్రుని పట్టాభిషేకోత్సవము॥ 47

సమస్తంబును దివ్యదృష్టిచె
జూచి ఆశ్చర్యంబును బొంది
పరమానందము బొందినవాడై
హృదయము బొదలుచు నుండెను గా॥ 48

కొల్లేపర వంశోద్భవుడు
రామలింగ మను భక్తుడును
ఈ ఘట్టమును జేసి కీర్తిని
బొంది సుఖించెను వింతగను॥ 49



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## ఏకోనచత్వారింశోఽధ్యాయః (39)

సాలంకాయన ఋషి వైశ్యులకు
జెప్పెను విచిత్రి వింతగను
కాంతులతోడ మెరయుచుండెడి
మునుపటి మంటపమును జేరి॥ 1

మంటపంబునకు వైశ్యులు రాగా
కుసుమశ్రేష్టి తెలిసియును
అంతలో వాసవి తండ్రిని గాంచి
వేడుకతోడ యిటు బల్కె॥ 2

ముద్దుల గుల్కెడి మాటలతోను
వాసవి నేను వత్తుననా
తండ్రియు మారు మాటాడకనే
చెంతనె నిడుకొని వెడలెనుగా॥ 3

వచ్చిన వెంటనె సభికుల గాంచి
వందనంబులు జేసియును
భాస్కరాచార్యుల పూజించియును
వుచితాసనమున గూర్చుండె॥ 4

వైశ్యుల గురుడగు భాస్కరచార్యులు
వెంటనె శిష్యుల గాంచియును
ఎవరు అగ్నిలో ప్రవేశింతురో
వారు కంకణాల్ గొనుడనియె॥ 5

ఈ మాటలను గ్రామ మంతట
చారులు శీఘ్రమె చాటింప
ఈ వార్తను వినిన వైశ్యులగు
షట్‌శత గోత్రులు భయపడిరి॥ 6

కపటము తోడ ఇట్లు పరస్పర
పల్కులు జరిగెను వినరంఢీ
కొందరు వైశ్యులు అగ్నిలో బడిన
తక్కిన వైశ్యుల రాజపుడు॥ 7

అగ్నిలో జచ్చిన వారల గానక
మమ్ముల ప్రశ్నించియు రాజు
తప్పక మనల ప్రాణము దీసి
వంశ నిర్మూలము జేయునుగా॥ 8

దీనికి కారణ మంతయు జూడగ
వాసవ కన్యక కారణము
ఈమె దుష్కృత్యము వలననె మనకు
ఇంత అనర్థము వచ్చె గదా॥ 9

కృత త్రేతముల రేణుక సీత
ద్వాపర యుగమున ద్రౌపతియు
కలియుగంబున వాసవి యగుచు
మృత్యు వాయెను వైశ్యులకు 10

వాసవి కన్యక చచ్చిన ఏమి
వంశము లన్నియు నిలచునుగా
నకతె చావుకు ప్రాణము లిడిచె
వైశ్యులు మనము నద లెదమా॥ 11

ఈ పట్టణముకు ఈ దేవతలకు
ఈ గురువునకు వందనముల్
చాలును మనము బ్రతికి యుండిన
భద్రంబులను బొందెదము॥ 12

ఇచ్చట ఉండిన గురుడై మనలను
భాస్కరచారి శాసించు
వీరి శాసనము నవలంబించిన
మనము బొందునది ఏముంది॥ 13

ఇప్పటి నుండి యీవైశ్యులకు
మనకు సంబంధము వలదండి
వంశము వలన గురుని వలనను
వచ్చెడి శుభములు ఏముంది॥ 14

పలువిధంబులా సంభాషణలు
జరుగుచు నుండగ కొందరును
ఈ ఉపాయము బాగున్నదని
మరల బల్కిరీ వినరండి॥ 15

మన మందరము గాజుతో జేరి
దర్పము చేత వాసవిని
రాజున కిచ్చి పెండ్లి జేసియు
రాజు మన్ననల బొందెదము॥ 16

షట్శత ద్వాదశ గోత్రజు లపుడు
రాజు రాజ్యమున కరుదెంచి
నూటారెండు గోత్ర వైశ్యుల
ప్రయత్నము భటులకు వినుపించె॥ 17

వాసవ కన్యక మాయ చేతను
వీరి మాటలు నిజ మని నమ్మకను
వైశ్యుల గాంచి ఆగ్రహంబునా
దండన జేతుము యని రపుడు॥ 18

వైశ్యాధములు రాజభటులచే
తిరస్కారింపులు విని నంత
ప్రాణభీతులై గద్గద స్వరమున
ఇచ టుండ తగదని వెడలుచునూ॥ 19

నాలు దిక్కులకు ప్రాణభీతులై
భార్యాపుత్రుల సమేతులై
మానంబుగను మాటలాడక
పరుగు లెత్తుకొని పోయిరిగా॥ 20

# శ్రీ వాసవికన్యకా పురాణ శోహరాగానము

చత్వారింశో౽ధ్యాయః (40)

నూటారెండు గోత్ర వైశ్యులు
వుత్సాహంబున బొంగుచును
భార్యాపుత్రులు బంధుబల్గములు
గుంపులు గూడి వెళ్ళిరిగా॥ 1

రేపటి దినము అగ్ని ప్రూజయు
యెల్లుండి వివాహము జేతు మన
చాటింపులతో కోలాహలమున
కంకణ ధారణ జేయు డనెన్॥ 2

వైశ్యుల నందరి గాంచి గురుడు
కుసుమ శ్రేష్టితో నిట్లనియె
నీ పుత్రిక నీ కేమి జెప్పినది
శీఘ్రిమె దెల్పుము అంత యనెన్॥ 3

కుసుమశ్రేష్టి వాసవి ముఖమును
చూచుచు వూరక నిలబడెను
వైశ్యు లందరు చూచుచు నుండగ
శక్తి ప్రత్యక్షం బాయెనుగా॥ 4

శక్తి రూపమును జూచుట యందు
అశక్తులైరి వైశ్యులుగా
దివ్య దృష్టిని దేవి యివ్వగ
చూచిరి వైశ్యులు వినరండి॥ 5

కోటి సూర్యుల సమాన కాంతి
పదునెనిమిది భుజంబులు
సర్వాభరణ ప్రకాశంబుతో
పట్టువస్త్రముల ధరించియు॥ 6

దివ్యగంధము అలందు కొనియు
భూమ్యాకాశము నంటియును
పరివార సమేతంబగు శక్తి నపుడు
జూచి వైశ్యులు బొగడిరిగా॥ 7

గౌరీదేవి మంగళ మమ్మ
అమ్మా స్తోత్రములు వినవమ్మా
భక్తుల పాలిటి కల్పతరు వని
బహువిధంబుల గొనియాడ॥ 8

సూర్యచంద్రులు వుండు వరకును
మీ కీర్తులు తప్పక నిలచు ననెన్
వీరల పూర్వ వృత్తాంతంబు
జెప్పిన దంతా వినరండీ॥ 9

కృతయుగ మందు ప్రభయులు మీరు
సమాధి సురధుం డను వారు
వాయువు నుదకము ఆకులు తినియు
క్రోధము జయించి యుంటిరిగా॥ 10

అహంకార మమకారము లొదలి
పాృణాపానముల త్యజించి
నన్ను ధ్యానము జేసియు మీరు
అధిక తపస్సును జేసితిరి॥ 11

నీ తపస్సుకు నేను మెచ్చియు
ప్రత్యక్షంబుగ నగబడితి
అపుడు మీరు సంతోషించి
నన్ను స్తోత్రము జేసితిరి॥ 12

నేను మిమ్ముల వరముల గోరు మన
గోరెను సురధుడు వరంబును
ధర్మమార్గమున రాజ్యము నేలి
వీరస్వర్గమును బొందెనుగా॥ 13

మరల సమాధి వరమును గోరెను
నేను యిచ్చితి వరంబును
నీవును బ్రహ్మ వేత్తుడ వగుచు
వంశము తోడను రమ్మంటి॥ 14

అప్పుడు సమాధి మరల గోరెను
తల్లిదండ్రుల వంశములో
మామ వంశము తోబుట్టు వంశము
కుమార్తె వంశము బంధువులు॥ 15

మొత్తము నూట ఒక వంశంబు
మోక్షము నిమ్మని అడుగగనే
నీ భక్తికిని మెచ్చి యిచ్చితిని
అంతర్ధానము పొందితిని॥ 16

నీవే కుసుమశ్రేష్టివైతివి
నేను వాసవిగ బుట్టితిని
గుణశాలులగు మీరందరును
అగ్నిలొ తప్పక పొందు డికన్॥ 17

మీరు అగ్నిలో నిర్భయంబున
ప్రవేశించిన పొందెదరు
పరమ మంగళ మగు స్థానమున
తప్పక మీరు వుండెదరు॥ 18

చిత్రకంఠు డను గంధర్వుండే
విష్ణువర్ధనుండై వున్నాడు
వానిని నేను సంహారించియు
గంధర్వ లోకముకు బంపెదను॥ 19

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లందరు
వేదోక్త కర్మమును బొందితిరి
యిప్పుడు మీరలు నా వాక్యమున నే
నడచిన ధన్యులు అయ్యెదరు॥ 20

షట్ శత ద్వాదశి గోత్రజులకును
మీకును సంబంధము లేదు
ఇకపై మీరలు వేదమంత్రముల
వదలి పురాణోక్తము నడుపు డికన్॥ 21

గాయత్రి జప మంత్రము మీరు
పఠించి పవిత్రు లయ్యెదరు
సాలంకాయన ఋషి జపంబును
తప్పిన వ్యర్థులు అయ్యెదరు॥ 23

వివాహంబుల ఆరు రాత్రుల
దీక్ష వహించి యుండియును
ఏడవ దినమున కంకణ విడుదల
తప్పక మీరు జేయు డనెన్॥ 23

మేనరిక ధర్మము జెప్పి తప్పిన
మీరు భ్రష్టులు అగుదురుగా
యిట్టి ధర్మముల నడుపుడు మీరని
దేవి శాసనము నియమించె॥ 24

వెంటనె ఋషులు వైశ్యుల గాంచి
శీఘ్రమె అగ్నిలో దుముకు డనెన్
అట్లు జేయక కన్య నిచ్చినా
వర్ణసంకరం బగు గాదె॥ 25

ఇట్లు జేసియు మీ రందరును
కీర్తి ప్రతిష్టలు బొందియును
వంశంబులను భూమిలో నిలిపి
సుఖసంపత్తులు పొందండీ॥ 26

ఇట్లు జెప్పిన ఋషులను గాంచి
వైశ్యులు అనుమానము తోడ
పురాణోక్తము అవలంబించియు
వేదోక్తము వదలిన దోష మన 27

ఈ ప్రశ్నకు ముని శ్రేష్టులును
తీర్మానంబును జెప్పిరిగా
సాలంకాయన భాస్కర గురుడు
జెప్పిన కర్మల జేయు డనెన్॥ 28

విప్రులు వేదోక్తంబుల వలన
పొందెడి ఫలములు మీరలును
పురాణోక్తమున బొందెద రనియు
నిర్ణయించిరి ఋషు లంతా॥ 29

దేవి యపుడు మరల బల్కెను
వైశ్యులా రందరును
సాహసించి అగ్నిలో బడిన
వంశము లేకపోవునుగా॥ 30

నేను జెప్పిన రీతిగ మీరు
ముప్పూరు ఋషులకు ఒక గోత్రం
సమానుడు ఋషులు గోత్రంబులలో
ఒకడు మాత్రమే బడవలయు॥ 31

ఒక ఋషి గోత్రంబున బుట్టినచో
ఒక్కడు మాత్రమె బడవలయు
ఈ ప్రకారముగ వైశ్యులందరు
బడుచు వంశము నిలపండి॥ 32

ఇట్లు అగ్నిలో బడిన వారలకు
మణుల కాంతి గల విమానము
అందున మీరు కూర్చొని సుఖముగ
కైలాసంబును బొందెదరు॥ 33

అగ్నిలో బడక నిలచిన వైశ్యులు
వంశధర్మము నిలపియును
సూర్య చంద్రులు వుండు వరకును
సంతతి వృద్ధిగ నుండునుగా॥ 34

ఇట్లు జెప్పిన పిమ్మట దేవియు
అంతర్ధానము పొందెనుగా
వైశ్యు లందరు నిర్మల చిత్తులై
సందేహము వదలి యుండిరిగా॥ 35



వాసవాంబ స్త్రీలకు విశ్వరూపము చూపుట

యజమాన్ బి. పట్టాభిరామయ్య, ధర్మపత్ని సూరమ్మ గార్లు

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## ఏ క చ త్వా రిం శో ఽ ధ్యా యః (41)

దేవి అదృశ్యం బొందిన వెంటనె
గుణ శ్రేష్ఠులగు వైశ్యులును
వంశప్రతిష్ఠకు ప్రాణంబులను
తృణముగ నెంచిన పుణ్యాత్ముల్॥ 1
వైశ్యశ్రేష్ఠులు బాలుల బిలచి
వారితో నిట్లు నుడివిరిగ
ప్రాణరక్షణకు ఈషణ సహితులై
వైశ్యాధములు బోయిరిగ॥ 2
పారిపోయిన వైశ్యులతోడ
సంబంధ భోజనంబులు గాని
జేసిన ఘోరనరకము బొంది
వంశహీనులు అగుదు రనెన్॥ 3
వంశధర్మ క్రమమును దెలపి
ఆశీర్వాదము జేసిరిగా
మీకు నగరేశ్వర కృపయు గల్గును
చాలా వృద్ధిని జెందెదరు॥ 4
బాలకులారా మీ రందరును
ఇంకొక మర్మము మరువకుడు
మేనరికంబు నడుపుడి మీరు
దేవి శాసనము తెలిపెదము॥ 5

మేనల్లుండ్లను మామలు చాల
అక్కర చేత జూడవలెన్
అల్లుని లెస్సగ బూజించినచో
మీరు ఘనతనూ బొందెదరు॥ 6

మేనల్లునికి కన్ను పోయినను
రోగము గల్గిన వాడైనా
తెగిన పెదవులు గల్గిన గాని
చదువని వాడైనను గాని॥ 7

తోబుట్టువురాలి కుమారునకును
వావివరుసలు జూడకను
నుడిదోషములు కనుబొమ్మలుముడి
వీటి నెంచక యీయవలెన్॥ 8

బొత్తిగ జెవిటి గ్రుడ్డివానికి
మూగికి కుంటి వానికిని
నపుంసకునికి పిచ్చివానికి
ధనాశకు కన్యక నివ్వకుడు॥ 9

మేనమామల కుమార్తెలకును
వయసు ధర్మంబునుబట్టి
భగినీ పుత్రుల వరుసనుబట్టి
వివాహ కార్యాల్ జేయుడనె॥ 10

గర్భవతిగ మేనత్తుండినచో
ప్రసవానంతరమే వివాహమున్
మేనల్లునకు అర్హత గల్గును
ఈ మాటలను మరువకుడీ॥ 11

పుత్రులు లేకుండిన మేనల్లునికి
యింకొక పుత్రిక నిచ్చియును
వివాహంబును జేసిన యెడల
మంగళకరమే నమ్మండి॥ 12

మేనమామకు యిద్దరు భార్యలు
యిద్దరు పుత్రిక లుండినచో
తోబుట్టువుకు సుతులు లేకున్నా
సవతి కుమార్లకు యివ్వావచ్చునుగా॥ 13

వివాహ ధర్మాల్ చాల జెప్పిరి
వాటిని వచనంబున గనుడి
కొన్ని మాత్రము దేవి వ్రాయించెను
మాండవ్యఋషి ధర్మంబులను॥ 14

మేనరిక ధర్మాచారము
తప్పి నడచిన వారలకు
బ్రాహ్మణవధను జేసిన పాపము
తప్పక బొందుదురని బల్కె॥ 15

పెనుగొండ వైశ్యులా వుదార బుద్ధిచే
ప్రకాశింపబడిన గ్రంధములు
నలుబది ఒకటవ అధ్యాయమున
వివాహ ధర్మాల్ జూడండి॥ 16

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ద్విచత్వారింశో౽ధ్యాయః (42)

అగ్ని ప్రవేశము చేసెడి వైశ్యులు
అంత్యస్నానముల జేసియును
అలంకారముల ధరించు కొనియు
దాన ధర్మములు జేసిరిగా॥ 1

సంతుష్ట హృదయులై కులగౌరవముల
శాశ్వతంబుగా నిలుపుటకు
శివకేశవులను పూజించియును
గురుని సమీపము జేరిరిగా॥ 2

వచ్చిన వైశ్యుల భాస్కర గురుడు
మీ గోత్రములను లెక్కింపు మన
లెక్కను జేయుచునుండు వేళకు
సాలంకాయన ఋషి వచ్చె॥ 3

వచ్చిన ఋషిని ఆదరించియు
నమస్కరించి బల్కిరిగా
స్వామీ తమరు వచ్చుటచేత
ధన్యుల మైతిమి మేమనిరి॥ 4

పవిత్రులైన వైశ్యులగాంచి
ఋషివరు డిట్లు బల్కెనుగా
ఒక రహస్యము చెప్పెద మీకు
వినుడు జాగ్రతా యని బల్కె॥ 5

వైశ్యసంతతికీ అగ్నిప్రవేశము
గల్గిన వెంటనె గోత్రములు
అప్పటినుండి ప్రాకృత మేర్పడి
పురాణోక్తము వెలువడును॥ 6

వైశ్యవంశ మను సముద్రమందు
వైశ్య శ్రేష్ఠులు అమృతంబు
పరుగు లెత్తిన వైశ్యులందరు
విషంబగుదు రని ఈశుడనె॥ 7

రాధాఖ్యామను కాలమునందు
వైశ్యులు పూరువు లందును బుట్టె
వైవస్వత మను కాలంబునను
గోకర్ణంబున బుట్టెరిగ॥ 8

అందులో మీరు సత్వగుణస్థులు
తమోగుణస్థులు వెడలిరిగా
తమోగుణస్థులు శ్రేష్టుల మనుచును
బూటకంబులు జేతురుగా॥ 9

బూటక వైశ్యుల వలననె మీకు
పురాణోక్తము వెలువడును
కీర్తి నామిక వివాహమందు
నంది జెప్పిన ధర్మములే॥ 10

భాస్కరగురుడు వాటిని జెప్పును
అష్టై కర్మల జేయు డనెన్
యీ విషయంబును ఋషియు జెప్పగ
మరల ప్రశ్నను జేసిరిగా॥ 11

మీ గోత్రములు యిప్పటినుండి
గోకర్ణంబున జనించినా
కూటస్థ పురుషుల పేర్ల చేతను
గోత్రము లొప్పును యిది మొదలు॥ 12

వాటిలో ముప్పది నాల్గు గోత్రములు
ఇద్దరు ఋషులు గూడినవి
పదిహేడు ప్రవరులు జెప్పబడినవి
జేరి పదునెనిమిది గోత్రాలు॥ 13

ముగ్గురు ముగ్గురు ఋషులు గూడియు
ఆరు గణప్రవరు లాయెనుగా
పది పది గోత్రంబులు ఒక ప్రవరగును
డెబ్బదిపడు గూడినచో॥ 14

ఒక్కొక్క ఋషితో జేరి నట్లయిన
డెబ్బదిఏడు గణాప్రవరుల్
ఈ ప్రకారము గోత్రములన్ని
నూటారెండు ప్రవరులుగా॥ 15

వైశ్యులు సాలంకాయన ఋషితో
ప్రశ్నను జేసిరి బాగుగను
ఈ గోత్రముల ఇద్దరు ముగ్గురు
నలుగురు పదుగురు ఒకటైరి॥ 16

నలుబది రెండవ అధ్యాయంబున
వీటి వివరములు జూడండి
గోత్ర కులస్థుల పేర్లను జెప్పి
మరల ఋషివరు డడుగమనె॥ 17

మరల వైశ్యులు ఋషివరు నడుగ
వెనుకటి వివరంబును జెప్పి
బ్రహ్మలోకములో ఒక సమయంబున
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులుగా॥ 18

అందరు జేరి వుండిన వేళ
పితామహుడు గోత్రము లడుగ
మా వంశజులు ఎక్కువవుండి
అట్టహాసము జేసిరిగా॥ 19

ఆ సమయంబున వైశ్యాధములు
శాపము బొందిన వివరంబు
దేటగ దెలిపి ఋషివరు డంతా
ఆశ్రమమునకు వెడలిరిగా॥ 20

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

త్రిచత్వారింశో౽ధ్యాయః (43)

శౌనకుడంతా సూతమహర్షితో
శ్రేష్టంబగు వైశ్యుల చరితంబు
నీవు జూచిన దంతయు వివరము
సవిస్తరంబుగ జెప్పుమనెన్॥ 1

శౌనకమహర్షి నీకు మంగళము
తీర్థయాత్రలకు నే వెడలినది
గోదావరినది బ్రహ్మగుండమున
వినినది కనినది నే జెప్పెదను॥ 2

సాలంకాయనఋషి వెడలగను
వైశ్యులు సంతోషము జెంది
తమ గృహంబులకు వెడలియును
మరుచటి దినమున వైశ్యులును॥ 3

స్నానములాడి సంధ్య దీర్చుకొని
భోజనంబులు జేసుకొని
నగరేశ్వర మంటపమునకు వచ్చి
సంతోషముతో గూర్చొనిరి॥ 4

కుసుమశ్రేష్టి అంతలో రాగ
వైశ్యులు లేచి నిలబడిరి
సువర్ణపీఠమునందు వాసవి
కుసుమశ్రేష్టి కూర్చొనిరి॥ 5

చిరునగు ముఖముల వైశ్యులందరు
పీఠమునందు కూర్చొనగా
ఆ సమయంబున గురు డరుదెంచగ
వైశ్యులు లేచి కూర్చొనిరి॥ 6

వైశ్యులు కొందరు ఏకాంతముగా
నాలోచింప సాగిరిగా
స్త్రీల హృదయము చంచలమైనది
వాసవి ప్రాకృత స్త్రీ గాదు॥ 7

భాస్కరాచార్యులు జెప్పిరి గాన
రాజభటులు గావలియున్నారు
ముందర పనులు ఎట్లగునోయన
వాసవి దేవితో ఇట్లనిరి॥ 8

వాసవి యపుడు చిరునగు వొప్పగ
కాంతి సమూహము లొప్పగను
ఎర్రని అధరము విచిత్రముగను
గనపడి వైశ్యుల కిట్లనియె॥ 9

మీరు అడిగిన స్త్రీ చిత్తంబులు
స్వభావ మిట్టిది దెలియండి
స్త్రీల మాటలు వుదకములందు
వ్రాసిన మాటల లిపిగాద॥ 10

స్త్రీల హృదయము వజ్రాయుధము
నడవడి వక్రమైనదిగా
భయంకరంబగు విషముతో గూడి
భోగాశక్తియు గలవారు॥ 11

నేనునుగూడ యిట్టి స్త్రీనని
మీరు ఎన్నటికి దలచకుడీ
కోకిల కాకుల నలుపొకటైన
కూతలో మీకు తెలియునుగా॥ 12

నా మహాత్మ్యము దెలియక మీరు
మరల యిట్లు బల్కితిరే
నేను దృష్టిని మీ కిచ్చితిని
నా రూపమును జూడమని॥ 13

కోటి సూర్యుల సమానకాంతి
కోటి చంద్రుల చల్లదనం
కోటి మెరుపుల ధగధగ కాంతులు
ఆశ్చర్యంబుగ గనబడెను॥ 14

సూర్యాగ్నులతో సమమగు కన్నులు
విశాలంబగు ముఖంబును
మనసు నేత్రముల కగబడనట్టి
దివ్యరూపము జూచిరిగా॥ 15

అట్టి రూపమును జూచిన వైశ్యులు
గడ గడ వణకుచు నిలబడిరి
నమస్కరించి స్తోత్రముచేసి
యీ రూపము చాలించుమన॥ 16

జరిగినదంతా జరుగబోవునది
అన్నియు వైశ్యుల కగపడగా
అంతలో కన్నులు విప్పి జూడగా
వాసవికన్యక అగబడియె॥ 17

యిదంతయు వారికి స్వప్నము రీతిగ
భ్రాంతిరీతిగ తోచెనుగా
గగుర్పాటు దేహంబులతోడ
ఏమి తెలియక నిలబడిరి॥ 18

వాసవికన్యక అగ్నిప్రవేశము
విధాన వివరంబును దెలుపకనే
లేదని గురుని అడుగుచుండగా
వాసవి కరుణతో బల్కెనుగా॥ 19

స్త్రీలు మానము రక్షించుటకై
ప్రాణము విడుతురు నిశ్చయము
నేను పూర్వము వేదవతినై
అగ్నిగుండములో బడియుంటి॥ 20

మరల సీతగా జన్మించితిని
రావణుడంతా గొనిపోయె
నామూలమున నాశము జెందెను
అవమానము నే సహించను॥ 21

దక్షుని దూషణ ఓర్వలేక
నగ్నిలో దేహము విడచితిని
ఆమెయె నేను యిప్పుడును గూడ
అగ్నిలో తప్పక బడుదునుగా॥ 22

ఈ నియమంబును వినిన వెంటనె
విష్ణువర్ధనుని శిరంబును
వెయ్యి ప్రక్కలుగ పగులును గాక
నేను పార్వతి దెలియుడికన్॥ 23

వాసవికన్యక ఇట్లు బల్కగా
పది దిక్కులు ఘోషించగనూ
ఒక శబ్దంబు బయలు వెడలగ
పరమాశ్చర్యము బొందియును॥ 24

తల్లీ మేము నీ ప్రభావము
దెలియక మరల అడిగితిమి॥
మా తప్పులను క్షమించి నీవు
అమ్మా మమ్ముల రక్షించు॥ 25

వైశ్యులు అగ్నిప్రవేశంబుకు
సిద్ధంబుగను వుండగను
గురుడు గాంచగా వైశ్యులందరు
కంకణంబులు జేసికొనిరి॥ 26

వైశ్యశ్రేష్టులు శాస్త్రవిహితముగ
అగ్నిగుండముల జేయుటకు
పనివాండ్రులకు ఆజ్ఞ చేయగ
అగ్నిగుండముకై వెడలిరిగ॥ 27

ఇట్టి నిశ్చయము జేసి వైశ్యులును
భాస్కరగురుడు కవీశ్వరుల్
విద్వాంసులును స్తోత్రము జేయగ
స్వగృహంబులు జేరిరిగ॥ 28



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## చతుశ్చత్వారింశోఽధ్యాయః (44)

సూతుడు శౌనకఋషులతో జెప్పె
వైశ్యులు మంటపమును జేరి
తమ తమ పుత్రుల పిలపించుకొని
ఇట్లు బల్కిరీ వినరండీ॥ 1

బాలకులారా శివకేశవులను
లక్ష్మి పార్వతి మాతలను
ప్రతి నిత్యంబు సేవించుచును
భాస్కరగురుని నమ్మండి॥ 2

మీకు గలిగిన ధన ధాన్యంబులు
అన్ని వస్తువుల త్యాగమున
గురున కిచ్చుచు పూజించుచును
వారి ఆజ్ఞను నడువండీ॥ 3

వైశ్యులు భాస్కరచార్యుని జూచి
వారితో నిట్లు నుడివిరిగా
మా వంశమునకు తగిన కర్మను
మీరు జెప్పుడు సూత్రములు॥ 4

అన్యవంశముల యాచింపకుడు
వైశ్యవంశమున ధనంబులన్
తాము గ్రహించి ధన్యులజేసి
వంశగురులు మీరగుడు॥ 5

మాధనంబులో ఒక భాగంబు
గురువరునకు నర్పించవలెన్
రెండవ భాగము ధర్మంబునకు
మూడవ భాగము పుత్రులకు॥ 6

నాల్గవభాగము పితరులకును
ఇట్లు జేయుడి యనిదెల్పి
గురుడు వైశ్యుల గాంచియు నపుడు
భాగము వలదు మాకనెను॥ 7

వైశ్యుల గురువునకు శాశ్వతంబుగ
జీవనంబులు నడుపుమని
సూర్య చంద్రులు వుండువరకును
నడుపునట్లుగా లిఖించిరి॥ 8

మేము లిఖించినరీతిగ గురునకు
కట్నంబులను ఇవ్వవలెన్
అట్లు ఇవ్వక తప్పినడచిన
ఘోరనరకముల బొందెదరు॥ 9

చారుల కపుడు ఆజ్ఞను చేసిరి
గ్రామ మంతటా తోరణముల్
విధవిధంబులగు అలంకారముల
వీధులన్నియు చాటింపుడనెన్॥

ఈ మాటలను వినిన మల్లాణుడు
వృద్ధవైశ్యులతో ఇట్లనియె
మీరు చెప్పినరీతిగ మేము
ముందే జేసియుంటి మనె॥ 11

మా విన్నపమును మీరును వినుడు
మాతండ్రీ మీతో జేరుమనె
మీరు ప్రాణము విడుచుటచేత
మేము అగ్నిలో బడెదమనె॥ 12

మీరు ఆజ్ఞను ఇవ్వకుండిన
మా దేహంబుల ఖడ్గముతో
ఖండించు కొందుమని ధైర్యంబుగను
బలికి ప్రయత్నము జేసిరిగా॥ 13

భటులు జేసెడి కృత్యంబునకు
వైశ్యులు భయపడు చుండగను
భాస్కరగురుడు వారల కప్రుడు
దీవనంబుల నర్పించె॥ 14

వైశ్యులు వీరకంకణంబులను
ధరించి గురుని అడిగిరిగా
భృగుపాతంబు జలపాతంబు
ప్రయోపవేశ మగ్నిపాతంబు॥ 15

నాలుగు మరణ విధుల లోపల
అగ్నిలో మరణము గల్గినది
ఈ సమయంబున ఏకాంతంబున
ప్రాణమిడచిన మోక్షమున|| 16

బ్రహ్మచె పూర్వము నిశ్చయింపబడె
అశ్వమేధము జరుగు కాలమున
గోదావరి తీరంబునందున
బ్రహ్మగుండము స్థానమనె|| 17

భాస్కరగురుడు మల్హాణుతోడ
అగ్నిగుండముల వివరంబు
ఇట్లు చేయమని ఆజ్ఞాపించె
వాటి వివరము వినరండి|| 18

మధ్యభాగమున ప్రధానగుండము
దాని పార్శ్వములో నవ గుండములు
మరియొక పార్శ్వమున అష్టగుండములు
మరియొక ప్రక్కన రెండనియె|| 19

చక్రాకారమున నారుమూలల
ఆరు గుండముల నేర్పరచి
పదమూడు గుండముల సుంద్రంబుగను
అరువదినాల్గు నియమించె|| 20

నూటారెండు గుండంబులను
మల్హారియును నిర్మించు
స్వామీ నేను అగ్నిని బొందుట
నా గుండమున కే స్థానమనె॥ 21

నూటారెండు గోత్రంబులకు
వుత్తరదిక్కుకు వెలుపల భాగమున
మూడు గుండములు నిర్మించుమని
భాస్కరచార్యులు జెప్పిరిగా॥ 22

మల్హాణుండు గుండంబులను
నిర్మించితినని వైశ్యులకు
గురుసమ్ముఖమున జెప్పినంత నే
వివాహంబని చాటింపుమనె॥ 23

విష్ణువర్ధనుని వద్దనుండియు
వృద్ధపురోహితు డరుదెంచె
పురోహితుని సన్మానించి
సంతోషబెట్టిరి వైశ్యులుగా॥ 24

పురోహితుడు వైశ్యులగాంచి
రేపటిదినము లగ్నమన
డెబ్బదియిద్దరు ప్రముఖులతోను
రాజు వెడలి వచ్చునని॥ 25

వివాహ మందు మీ కార్యంబులు
ఏమున్నవో యవి దెల్పు డనెన్
వైశ్యులు గురుని అడిగి దెలియు దని
పలికి వూరక యుండిరిగా॥ 26

భాస్కరచార్యులు పురోహితునితో
ప్రస్తావంబును జెప్పెనుగా॥
ఏడు దినములు వివాహ ముందు
అగ్ని పూజయు మొదలేగా॥ 27

ముందు జరిగిన కార్యము లన్ని
నీకే తెలియును బ్రాహ్మణుడా
వైశ్యుల వివాహ కార్యము నందు
ఈ రీతిగను జేయ వలెన్॥ 28

గంగా దేవిని గంధము తోను
పుష్ప ధూప దీపంబులతో
పాటలు పాడి పూజను జేసి
వివాహ వేదిక జేయ వలెన్॥ 29

వేదిక చుట్టు అయిదు స్తంభములు
పంచ రంగుల అన్నమును
మంత్రంబులతో బలి చేయ వలె నని
వైశ్యుల వంశాచార మనె॥ 30

వధూవరుల సంరక్షణకు
దిక్పాలకుల పూజయును
రెండవ దినమున ముప్పది మూడు
కోట్ల దేవతల పూజయును॥ 31

మూడవ దినమున గోత్ర పూజయు
నాల్గవ దినము నాగవలి
కామధేనువును పిండితో జేసి
ప్రీతితో బంధుల కొసగ వలె॥ 32

అయిదారు దినంబు లందు
నావిక పూజ చేయ వలె
ఏడవ దినమున కంకణ విడుదల
ఈ ప్రకారము నిర్ణయము॥ 33

ముందు జరిగెడి కార్యము లన్ని
జూచి సంతసము నొందెదవు
అని జెప్పియును వచ్చిన విప్రుని
విడిది గృహమున వుంచిరిగా॥ 34

విడిది గృహంబులో సౌఖ్యములకు
విప్రుడు చాలా సొక్కియును
రాజు కార్యము మరచిన వాడై
భోగంబులలో మునిగుండె॥ 35

వైశ్యులు స్నానంబులు జేసియును
దానధర్మములు గావించి
అగ్ని ప్రవేశము చేయుట కొరకై
ఒకరిని ఒకరు పిలువగనూ॥ 36

వాసవ కన్యక అలంకారములకు
వైశ్యస్త్రీలు అరుదెంచి
ఒక సతి స్నానంబును జేయించె
కొందరలంకారములు జేసిరిగా॥ 37

వాసవకన్యక కలంకరించిన
స్త్రీ లందరును దుఃఖముతో
అయ్యో కష్ట మయ్యో కష్ట మని
దైన్యభాషణములు చేసిరిగా॥ 38

వైశ్య స్త్రీల దీనత గాంచి
వాసవి దేవి నిజరూపం
దర్శన మిచ్చి స్త్రీ లందరికి
పరమానందము గలిగించె॥ 39

అనంతరంబు వాసవి దేవి
నాశికాభరణం వుంచుకొని
దివ్యరూప మంతర్ధానము బొందా
విస్మయంబును బొందిరిగా॥ 40

ఈ కన్యక ఒక దివ్య శక్తి యని
వైశ్య స్త్రీలకు గురువరుడు
వృత్తాంతంబు బాగుగ దెలపి
శీఘ్రమె వెడల వలయుననని॥ 41

కుసుమ శ్రేష్టి వైశ్య శ్రేష్టులు
స్నానము లాడి వాసవితో
గృహంబు నుండి బయలు దేరగా
అందరు వైశ్యులు వెడలిరిగా॥ 42

కుసుమ శ్రేష్టి ఏనుగ నెక్కి
వాసవి కన్యక పల్లకిలో
బయలు దేరిరి మంటపంబుకు
వైభవంబుతో వెడలిరిగా॥ 43

నగరేశ్వరస్వామి వింధ్యవాసిని
జనార్దన కోనకమలలను
విధవిధంబులా స్తోత్రము జేసి
పాటలు చాలా పాడిరిగా॥ 41

భేరీ ధ్వనులు స్తోత్రధ్వనులు
వీణామృదంగ ధ్వనులు
పెనుగొండ పట్న మంతట నిండె
అగ్ని పూజ యని బల్కిరిగా॥ 45

రాజభటులు యీ వాక్యము వినియు
ఏమి జేయక యుండిరిగా
వైశ్యులు రాజమార్గమున వెడలి
భాస్కరగురునితో బల్కిరిగా॥ 46

అగ్ని చక్రగుండ నిర్మాణాల్
మాకు దెలియ జేయుడన
వారి వారికి తగిన గుండముల్
దెల్పి గురుడు బంపెనుగా॥ 47

భాస్కరగురుని ఆజ్ఞనుబొంది
వుత్తరదిక్కుకు వెడలిరిగా
వీరి కీర్తి అందరు బొగడ
ఏమని నేను వర్ణింతూ॥ 48



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

## పంచచత్వారింశో ఽ ధ్యాయః (45)

సూతుడు శౌనకఋషితో జెప్పె
వైశ్యాంగనల వర్ణనము
యవ్వనవతులగు వైశ్యస్త్రీలు
కపోలంబులు చమటలచే॥ 1

చలించు చుండెడి తారహారముల్
యందెల ఝూంకారము నొప్ప
ఏనుగువంటి కుచకుంభములు
రత్నఖచిత వడ్డ్యాణములు॥ 2

రాజహంసల నడకలు గల్గి
మెరపు తీగల దేహముతో
చలించు చుండెడి ముంగురు లొప్పగ
పైట చెంగులు బిగించియు॥ 3

కుండలలోన మంచినీళ్ళను
శ్రీగంధోదక జలంబులన్
కుసుంబ పుష్ప మకరందములను
కస్తూరి కుంకుమ పువ్వులతో॥ 4

ఒక స్త్రీ పచ్చకర్పూరంబును
పుడిని పూయగ చంద్రునవలె
కొన్ని ముఖంబులు పద్మంబుల వలె
కమలకు వింతగ గనుపించె॥ 5

వైశ్యాంగనలు గుంపులు గూడి
విధవిధంబులగు క్రీడలతో
పురుషులు మంగళ వాద్యంబులతో
వైభవంబుగా వెడలిరిగా॥ 6

## శ్రీ కన్యకాపరమేశ్వరీ పుష్పాలంకార వేడుకలు

హోసూరు ఆర్యవైశ్య ధర్మసత్రములోని ఛాయాచిత్రము



శ్రీ చిద్గగనానంద స్వామివారు, నిఖిలానందగుప్త, మునిరామయ్య,

వి. కె. సుబ్రహ్మణ్యంగార్లు.

కోలార్ ఆర్యవైశ్య భాగవతోత్తములు



విద్యాప్రకాశానందస్వామీజీ (శక్తిబ్రహ్మాశ్రమము, కాళహస్తి)

విష్ణువర్ధనుని రాజభటులు
పెనుగొండ వేశ్యాలవలపులలో
మునిగి దేలుచు మదోన్మత్తులై
శబ్దము ఏమని అడిగిరిగా॥ 7

వేశ్యస్త్రీలు ఈ శబ్దమును
వివాహ సన్నాహంబులన
వినియును గాఢనిద్రలోపల
సుఖించి సోక్కి యుండిరిగా॥ 8

పెనుగొండ పట్నముకు రెండుక్రోసుల
దూరముందు బ్రహ్మగుండమున్నకై
ఉత్తర దిక్కుకు బయలు దేరియు
వైశ్యులు గుంపుగ బరుగిడిరి॥ 9

బ్రహ్మగుండమున భయంకరంబగు
మంటసమూహము మింటికినీ
మిణుగురు లెగురుచు మంట మండెడి
అగ్ని జ్వాలలా జూచిరిగా॥ 10

ధీరవైశ్యులు ధైర్యంబుగను
అగ్నిగుండమున బడగానె
అగ్ని దేవుడు దహించలేక
వెంటనె చల్లబడిపోయె॥ 11

నేను గూడ కైలాసము విడచి
ఇచ్చట నేను వుండనుగా
రాజు రాక ముమపే మమ్ము
తప్పక దహింపుమని వేడె॥ 22

వాసవాంబ ఆజ్ఞ మేరకు
అగ్నిహోత్రుడు జ్వలించెను
మరల వైశ్యులు స్నానములాడి
అగ్నిగుండములో దుమికిరిగా॥ 23

విరూపాక్షుడు మొదలగు వైశ్యుల
గాంచి వాసవి శాసించె
మీరు ఆచార్యుల సేవ జేయుడు
ఈ ప్రకారమే వరుడనే॥ 24

ధనము గోరెడి వారగుచుండిన
నా మంత్రంబుల జపించుచు
శ్రీచక్రమున పూజ చేయుడు
నన్నారాధన జేయవలెన్॥ 25

నన్ను విగ్రహంబుగ వుంచియును
పూజలు సర్వద జేయుడనెన్
వివాహమందు శుభకార్యంబుల
కలశారాధన జేయవలెన్॥ 26

ఎవ్వరు ఈ మాటలు వినకా
కులదేవత నర్పింపకను
దేవత లెవ్వరి నారాధించిన
ఫలితము సున్నే యగుగాక॥ 27

సకల కష్టముల కోర్చి యైనను
కులదేవత నారాధించ వలెన్
జేసిన వారల రక్షింతు నని
ఈ ప్రతిజ్ఞను జేసెనుగా॥ 28

ఇట్లు బల్కుచు కోపము తోడ
వైశ్యుల వాక్యము వినగానె
రాజు శిరస్సు పగిలి మృతుండగు
అని శపించిరి ఇట్లనియె॥ 29

వైశ్య వంశమున ఓ పితామహా
రూపవంతులగు కన్యలను
సృజింప కుండగ సాధ్వీమణుల
సృజింపుమని అగ్నిలో దూకె॥ 30

అంగుష్ట ప్రమాణంబగు దేవి
బాలచంద్రుని కూడియును
నాలుగు భుజముల సుందర దేవి
అందరి కెదుట గనుపించె॥ 31

భాస్కర సుతుడు వైశ్యులందరు
విస్మయ మొంది జూడగను
చంద్రశేఖరుడు నిజరూపంబున
గౌరితో గూడి గనబడియె॥ 32

వైశ్యులు పార్వతి వల్లభు జూచి
సాష్టాంగంబులు జేసియును
గద్గదవాక్కుల కంటిధారలతో
పులకాంకితులై వుండిరిగా॥ 33

వాసవిదేవి యీశుని గూర్చి
బహువిధంబులా బొగడెనుగా
ఈశుడు వరమును గోరు మనంగను
వాసవి గోరెను వినరండి॥ 34

ఓ దేవేశ వీరలు నన్ను
ఎడబాయకను వుండుటన
అల్లే యనియు మరల యడుగు మన
వాసవి మరలా గోరెనుగా॥ 35

కుసుమశ్రేష్టికి పూర్వము నేను
వరంబు ఇచ్చి యుంటినిగా
అందువలన నీ సాన్నిధ్యంబును
వీరికివ్వుడు యని బల్కె॥ 36

వాసవి దేవిని విశ్వేశ్వరుడు
అర్ధశరీరంబున జేర్చె
ఇవి అన్నియును వైశ్యులు చూడగ
ఈశుడు అదృశ్యుం డాయెనుగా॥ 37

వైశ్యులు పరమానందము జెంది
భాస్కరచార్యుల పూజించి
అగ్నిగుండముల ప్రవేశించగా
విమాన మొచ్చె వైశ్యులకు॥ 38

విమానంబులో వైశ్యు లందరు
కైలాసంబుకు వెడలిరిగా॥
ఈశుని సన్నిధి బహు కాలంబు
కైలాసమున యుండిరిగా॥ 39



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

షట్చత్వారింశో ఽధ్యాయః (46)

సూతమహర్షి శౌనకాదులతో
ఇటు వివరించే వినరండీ
భాస్కరచార్యుల ఉపదేశమున
బాలవైశ్యు లిటు జేసిరిగా॥ 1

శ్రీగురుమూర్తి చక్కని మాటల
దుఃఖము వదలి శ్రద్ధగను
వేదవేదాంగాల్ లెస్సగ దెలిసిన
బ్రాహ్మణోత్తముల బిలపించి॥ 2

శాస్త్రోక్తముగా సర్వ కర్మలు
పితరుల గూర్చి జేసియును
దూడల తోడ నలంకరించిన
కపిల ధేనువుల దానంబు॥ 3

అధికంబైన ధనరత్నములు
శాలువ మొదలగు వస్తువులు
పితరుల ప్రీతిగ దానాల్ చేసి
సుఖమున బాలులు యుండగను॥ 4

వైశ్య దంపతులు అగ్నిలో గాలిరి
విష్ణువర్ధనుడు చచ్చెనుగా
దేశములందు మారుమూలలా
కీర్తి నిందలు ప్రబలెననా॥ 5

శౌనకాదులు ప్రశ్నల జేసిరి
మహర్షిచంద్రా మరి దెల్పు
రాజభటులకు దెలిసెనో లేదో
దూతలు అచటికి పో లేదా॥ 6

పుత్రవంతుండై శూరుండైన
విష్ణువర్ధనుని వేడుకలు
వివాహంబునకు వచ్చెనో లేదో
ఏమి జరిగెనో దెల్పు డనా॥ 7

సూతమహర్షి మునులను గాంచి
వినుడు జెప్పెదా నని దెల్పె
వైశ్యోత్తములు అగ్నిలో బడిరని
అంతయు భటులకు దెలిసెనుగా॥ 8

ఆహోహో ఏమి సాహసం బని
తమ్మును తామే తిట్టుకొని
తమ ప్రమాదముకు భయభ్రాంతులై
స్వామిద్రోహులా మను కొనియు॥ 9

కర్ణకఠోరంబగు ఈ వార్తను
దెల్పిన రాజు జంపునుగా
ఐనను గాని యదార్థంబును
వినుపింతు మని వెడలిరిగా॥ 10

విష్ణువర్ధనుడు తన పురంబున
సభ గావించి వేడుకతో
వందిమాగధ గాయకజనులు
మంత్రులతోడ నిట్లనెనూ॥ 11

వివాహంబుకు మన మీరాత్రి
మూడు జాములు గడువగనే
మహోత్సవముతో వెళ్ళగ వలెను
చాటింపు డికా పూరంతా॥ 12

రాజరాజనరేంద్రుడు ముందుగ
నాల్గువిధంబుల సైన్యముతో
పెనుగొండ పట్నము ప్రవేశించియు
పెండ్లిప్రయత్నాల్ జేయ వలే॥ 13

విష్ణువర్ధనుని విధిని మీరక
పుత్రుడు కవులను పాటకుల
వికట హాస్యము వేశ్యల నందర
ముందర నిడుకొని వెళ్ళెను గా॥ 14

పుత్రుని బంపి విష్ణువర్ధనుడు
మన్మధ బాణంబుల చేత
కంపిత చిత్తము గల వాడగుచు
అంతఃపురమూ జేరెను గా॥ 15



# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

సప్తచత్వారింశోఽధ్యాయః (47)

శౌనకాదులకు సూతుడు జెప్ప
అర్థే సాలంకాయనుడు
వైశ్యమునులకు జెప్పిన విషయము
విను డు వైశ్యులు శ్రద్ధగను॥ 1

విష్ణువర్ధన రాజున కపుడు
అగ్నిజ్వాలల వేడిమిచే
గొప్ప యాకలి జనించగా నే
అన్ని వికటముగ మారెనుగా॥ 2

శాఖంబులచే పచనమైనవి
పరిమళంబులతో ఒప్పునవి
భక్ష్యభోజనములు పాత్రలలోపల
వడ్డించి ముందర బెట్టియును॥ 3

భక్తిశ్రద్ధల తాళవృంతముతో
విసరుచు నిలబడి యుండిరిగా
రాజు పదార్థంబుల గాంచగనూ
దుర్గంధంబుగ దోచెనుగా॥ 4

దుష్టమాంసము రీతిగ దోచె
రక్తము చీము అశుద్ధము
కాలకూటము విషము రీతిగ
కండ్లకు ఇట్లు అగబడగా॥ 5

రాజు కోపముతో వంటవాండ్రను
మాటి మాటికి బెదరించె
ఎవరు వీటిని తయారు జేసిరి
యదార్థంబుగా బల్కుడనెన్॥ 6

వంటవాండ్రు భయపడి వణకుచు
మేమే వంటను జేసితిమి
పక్వము ఎట్లు వున్నదో గాని
మాకు తెలియదు అని రంత॥ 7

అన్నము విడచి విష్ణువర్ధనుడు
దప్పిక గొన్న వాడగుచు
క్షీర పాత్రను ఇమ్మని అడుగగ
ముందర క్షీరము నుంచిరిగా॥ 8

ఇటునటు ప్రాకులాడు చుండెడి
పురుగుల నన్ని జూచియును
చిరాకు జెంది క్షీరము విడచి
పరితాపంబును బొందెనుగా॥ 9

నిట్టూర్పులను విడచుచు రాజు
తల్పము మీద బొర్లుచును
దిక్కులు జూచుచు అకారణంబున
నవ్వులాడుచు నుండెనుగా॥ 10

దుఃఖితు డైన రాజు వద్దకు
అంతఃపుర కాంతలు అరుదెంచి
రేపటి దినము వివాహ కార్యము
ధైర్యము పొందుడు యని రపుడు॥ 11

స్త్రీల మాటలను వినియును రాజు
కొంచము స్వస్థత బొందెనుగా
అంతలో నిద్రా పరవశు డాయె
విచిత్ర స్వప్నము గనె నంతా॥ 12

వాసవ కన్యక అగ్నిలో బడగా
అందొక శక్తి వుద్భవమై
శక్తితో వాసవకన్యక జెప్పె
రాజు శిరస్సు ఛేదించు మనే॥ 13

కరాళమైనా వక్త్రము గలది
నాల్గు భుజంబుల గలదియును
శూలము ధరించి కొండ రీతిగా
శిరస్సు బగుల గొట్టినది॥ 14

పాదంబులచే గొంతు రొమ్మును
త్రొక్కుచు భయంబు బెట్టియును
గొప్ప గోర్లు భయంకర రూపమును
జూచి వణకుచు వుండియును॥ 15

పాముల వలె నిట్టూర్పు లిడుచుచు
అయ్యో చచ్చితి చచ్చితిని
ఎమి వింత యని దిగ్గున లేచి
దిక్కుల జూచుచు నిలబడెను॥ 16

యంతఃపురములో వృద్ధులు కొందరు
రాజును జూచి ఇట్లనిరి
వివాహంబుకు ముందుగ మనము
గ్రామదేవతకు బలు లివ్వవలె॥ 17

రాజు వాళ్లకు ఆజ్ఞాపించెను
నూరు బారువుల బీయమునూ
నూరు మేకల గ్రామదేవతకు
బలి యొసంగుడు యని బల్కె॥ 18

రాత్రి స్వప్నమును చింతన జేయుచు
ప్రాతఃకాలము కాగానే
మురుపును జెంది పరివారముతో
కల్యాణ ప్రయత్నము జేసిరిగా॥ 19

సేనాపతులు పురోహితులును
యాస్థానంబుకు వచ్చిరిగా
వివాహ కార్యాల్ ప్రయత్నంబులతో
సంతోష ప్రసంగాల్ జరిగెనుగా॥ 20

ప్రాతఃకాలము బయలు దేరియు
భగ్నమను పురి జేరియును
పెనుగొండ నుండి వచ్చిన దూతలు
రాజుకు ఎదట నిలబడిరి॥ 21

రాజు దూతలను జూచిన వెంటనె
సకలము సిద్ధము యని అడిగె
దూతలు మాటలు చెప్ప లేకను
గజగజ వణకుచు నిలబడిరి॥ 22

దూతలారా భయ మెందులకు
యథార్థంబును బలుకు మనె
వైశ్యు లందరు వివాహ మనుచు
వాసవ కన్యతో కాలి రనె॥ 23

ఈమాటలను వినిన వెంటనె
ఆహో ఏమి ఇది యనియు
ఉలిక్కి పడుచు భయభ్రాంతుడై
తపింప బడెను ప్రాణములు॥ 24

అంత భయంకర కాళీదేవి
అతని యెదుట నిలచెనుగా
ఆ సమయంబున దాని జూచుటకు
శక్తి లేని వాడయ్యెనుగా॥ 25

అనేక ముఖముల ఆకారంబును
శూలము చేత ధరించియు
క్రోధము తోడ భయంకరం బగు
అట్టహాసము జేసెనుగా॥ 26

పిడుగుల ధ్వనితో సమానమైన
కంఠ ధ్వనిని వినగానే
విష్ణువర్ధనుని శిరస్సు అపుడు
వేయి ముక్కలు ఆయెనుగా॥ 27

పిమ్మట కాళి మృత్యురూపిణియై
ఏనుగు గుఱ్ఱము సైన్యముల
గదతో గొట్టి క్షణ కాలంబున
యమాలయముకు బంపించె॥ 28

విష్ణువర్ధనుని దేహము నుండి
నిప్పు వంటి ఒక మంటయును
బయలు దేరియు వాసవి దేవి
పాదంబులలో లీన మయేన్॥ 29

సిద్ధులు సాధ్యులు విద్యాధరులు
పురుగులు స్తోత్రము జేసిరిగా
పరమేశ్వరుని ప్రియురా లపుడు
కైలాసమును బొందెనుగా॥ 30

వాసవి వాక్య వజ్రాయుధముచె
శిరస్సు చూర్ణము లై బడియె
సైన్యం బంతా క్షణ కాలములో
మృత్యు ముఖంబున జేరిరిగా॥ 31



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

అ ష్టా చ త్వా రిం శో ఽ ధ్యా యః (48)

భయపడి పారి పోయి భటులు
దారుణమైన మరణమును
రాజరాజేంద్ర యువరాజునకు
తెలియ జేసిరీ భటులంతా॥ 1

హా తండ్రీ యని ఏడ్వ సాగియు
ఎట్లు జచ్చెను చెప్పుడనా
వాసవ కన్యతో వైశ్యు లందరూ
అగ్నిప్రవేశము జేసిరనా॥ 2

జెప్పు చుండగనె రాజు శిరస్సు
హఠాత్తుగానే పగిలెనుగా
కరాళ వక్త్రము కోరలు కలది
మండి మీాదను బడి నట్లు॥ 3

శూలము ధరించి భయంకరంబుగ
సైన్యము జేరి ఒక శక్తి
తన నేత్రాగ్నిచె క్షణ కాలమున
అందరి భస్మము జేసెనుగా॥ 4

పిడుగు ధ్వనిని వినిన వెంటనె
పిచ్చి బట్టినా వారైరి
ఆ యద్భుతము చెప్పగ లేమన
భటులు వర్ణన జేయగను॥ 5

కఠోర వాక్కులు వినిన యువరాజు
చాలా దీనత నొందెనుగా
మంత్రులు కొంత నూరడించిరి
అంతతో శాంతుడు గాకుండె॥ 6

పురోహితులైన ధౌమ్యాచార్యులు
చల్లని వాక్కుల ఓదార్చి
పరలోక క్రియలు జరిగించియును
నీకు మంగళము గల్గుననే॥ 7

యువరాజపుడు తండ్రి చచ్చుటకు
కారణ మాచార్యుల నడుగ
పూర్వ వృత్తాంతంబగు గల కథను
జెప్పెద నేను విను డనియె॥ 8

వ్యాసుని చేతనే విని యుంటి
నీకు జెప్పెద విను మనియె
మన్మథ దహాన భస్మము నుండి
భండాసురుడు బుట్టెనుగా॥ 9

ఆది శక్తి యని ఎవరిని యందురో
ఆ శక్తే దాక్షాయణిగా
ఆ యమ్మే లలిత రూపమై
భండాసురుని ద్రుంచెనుగా॥ 10

భండాసురుడు మృత్యుడై మరల
శుంభుండను నామము నొప్పే
లలితా దేవి చెండిరూపమై
వానిని మరల మర్దించె॥ 11

శుంభుడు మరల గంధర్వుడు గాగ
దేవిని ఆరాధించెనుగా
దేవి ప్రసన్న చిత్తముగలదై
మానుష జన్మము బొందు మనే॥ 12

మీా తండ్రీ మానుష రూపుడై
వాసవి దేవి చండికగా
ఆ వరంబుకు మీా తండ్రిపుడు
దేవిస్థానము బొందెనుగా॥ 13

సమాధి వైశ్యుడు కుసుమశ్రేష్ఠి
అతడు వరమును బొందుండె
ఈ కారణమున అతడు వైశ్యులు
కైలాసంబును జెందిరిగా॥ 14

పరాశక్తి కృతయుగంబునా
రేణుక దేవి యాయెనుగా
త్రేతాయుగమున వేదవతియు
ద్వాపరంబునా ద్రౌపతియు॥ 15

కలియుగంబునా వాసవి దేవై
ఆమె సప్త రాత్రులును
వైశ్యుల భక్తికి దర్శన మిచ్చును
పోయి దర్శనము జేయుమనే॥ 16

ఈమాటలను వినిన యువరాజు
దుఃఖము విడచి కర్మలను
విధి ప్రకారంబుగ జేసియును
పెనుగొండ పట్నముకూ వెడలె॥ 17



# శ్రీ వాసవికన్యకా పురాణ శోహరాగానము

ఏకోనపంచాశోఽధ్యాయః (49)

పెనుగొండ పట్నమున బాలవైశ్యులు
పితరుల మరణంబును గూర్చి
దుఃఖించు చుండగ భాస్కర గురుడు
జ్ఞానబోధ జేయుచు నుండె॥ 1

ఆ సమయంబున మంత్రులు రాజు
వచ్చిన వార్త వినగానే
బాలవైశ్యులు భయపడి గురుని
ఏమి దిక్కని అడుగగనూ॥ 2

మిమ్ముల రాజు ఏమి జేయడు
మీరు మహాత్ములు యని దెలసి
మీ క్షమాపణ బొందుట కొరకై
యువరా జొచ్చెను యని బల్కె॥ 3

బాలవైశ్యులు నగర స్వామి
మంటపంబునా గూర్చొనియు
కథలను జెప్పు కొనుచు నుండగా
యువరా జప్పుడు గనబడెను॥ 4

రాజును జూచి బాలవైశ్యులు
లేచి నిలబడి వుండగనే
యువరా జపుడు బాలుల నందరి
ఆలింగనము జేసుకొని॥ 5

మృదువాక్యములతో ఇట్లు బల్కెను
ఘోరంబగు కార్యము జరిగె
ఇది అంతయును జేసిన కర్మలు
తప్పక జరిగే తీరునుగా॥ 6

బ్రహ్మ గాని శివుడు గాని
దేవతలైన మునులైన
పూర్వము జేసిన కర్మ లన్నియు
శుభాశుభంబులు జరుగునుగా॥ 7

మీర లందరు దుఃఖము విడచి
విరూపాక్షుని అధిపతిగా
భావన జేసి శాశ్వతంబుగా
వంశ వృద్ధిని బొందు డనెన్॥ 8

ఇది మొదలుగా మీకును మాకును
స్నేహము వృద్ధి బొంద వలె
మీకును మాకును పితృల వియోగము
గల్గి హృదయములు గాలెనుగా॥ 9

నా రాజ్యమున అర్ధరాజ్యము
మీకును గూడ యిచ్చెదను
అని వినయంబున విన్నవించినా
రాజనరేంద్రుని గాంచియును॥ 10

పితరుల ఋణము దీర్చకొరకు
గయకు బాలులు పోయెదరు
ఇచ్చట వృద్ధులు శిశువులు యుందురు
గురువు వీర్ల కాపాడు మనె॥ 11

గురుని మాటలు వినిన రాజేంద్రుడు
నలుగురు బ్రాహ్మణులను ఇచ్చి
వారికి దక్షిణ నేనే యిత్తును
ఇది గాకిత్తును విను డనియె॥ 12

నా రాజ్యమున అర్ధము గూడ
మీరే పాలన జేయు డన
నందీ అంశ సంభూతుం డగు
విరూపాక్షుడు ఇట్లనెను॥ 13

మాకు ధర్మముల్ గోరక్షణ వ్యాపారము
రాజ్యముతో పని ఏమి
పూజ్యంబైనా కాశికి వెడలి
తప్పక కర్మలు జేతు ననా॥ 14

రాజనరేంద్రుడు కర్మకార్యముల
కడ్డము బల్కుట పాప మని
పూహా జేసి విరూపాక్షుని
కాశీపురికి వెళ్ళ మనె॥ 15

మేము పట్టణంబునకు బోయి
మీరలు వచ్చు పర్యంతం
ఒక్కే పూట భుజించు చుండి
దర్భల పైన నిద్రింతుమ్॥ 16

మిమ్ముల జూచు వ్రతమును బూని
బ్రహ్మచర్యము బూనియును
కృశించు చుండెడి మనస్సు తోడ
వాసవి ధ్యానము జేయుదుము॥ 17

వాసవి దేవికి అర్ధ రాజ్యము
తప్పక నేను ఇత్తు ననా
ఆకాశవాణి అట్లే యగు నన
వైశ్యులు సంతోషించిరిగా॥ 18

వైశ్యులు బహుమతు లన్నియు దెచ్చి
రాజనరేంద్రుని కివ్వగనూ
రాజనరేంద్రుడు పరిగ్రహించి
మంత్రుల తోడ వెడలెనుగా॥ 19

రాజనరేంద్రుడు నిజగృహంబుకు
జేరి ధౌమ్యఋషిని గాంచియును
వాసవి దేవి అనుగ్రహంబుకు
ఏమి జేయవలె జెప్పు డనెన్॥ 20

ధౌమ్యాచారి దివ్యదృష్టితో
జూచి నరేంద్రున కిట్లనియె
వాసవి దేవి నిశ్చయంబుగా
నీ కనుకూలము జేయునుగా॥ 21

మనోహరంబగు పెనుగొండ పురమున
సంవత్సరాంతము వాసవియు
ఏడు రాత్రులు తిరుగుచు నుండు
అందుకు నీవు ఇట్లుండు॥ 22

జితేంద్రియుండై మితహారియునై
సంవత్సర కాలము దీక్షుండు
నీ భక్తికినే వాసవి మెచ్చి
ప్రత్యక్షంబున వర మిచ్చు॥ 23

ధౌమ్యాచారి వాసవి దేవి
మంత్రంబులను జెప్పెనుగా
ఆ మంత్రంబు ప్రతి నిత్యంబు
పఠించు చుండెను వినరండీ॥ 24

దుర్గా యనియు కాళీ యనియు
కన్యక దేవి కుముదనియు
శారద అనియు అంబిక యనియు
చెండి వైష్ణవి యని జెప్ప॥ 25

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

పంచాశోఽధ్యాయః (50)

బాల వైశ్యులు పెనుగొండ పురమున
పదునైదు దినంబులు వుండియును
పితృకార్యములను విధ్యుక్తముగా
జరిపి దానముల జేసిరిగా॥ 1

బ్రాహ్మణ కన్యకలను పూజించి
ముత్తైదులకు వస్త్రములు
గోదానములను విశేష మిచ్చి
కర్మలు బాగా జేసియునూ॥ 2

భాస్కరచార్యుల వెంట నిడుకొని
తీర్థము కొరకై వెడలిరిగా
వచ్చు వరకును పిష్టాహారము
వేయిమంది విప్రులతోను॥ 3

పుణ్యకథలను గురునిచె వినుచు
ప్రయాగ వేగమె జేరిరిగా
సూర్యుడు మకర రాశి యుండగ
గంగా యమున సరస్వతి॥ 5

అనంతరంబు వైశ్య శ్రేష్టులు
శివరాత్రికి కాశీ జేరియును
గంగాస్నానము శివపూజయును
వుపవాసంబులు జేసియును॥ 5

పంచాక్షరి వుపదేశము బొంది
రాత్రి జాగరణము జేసి
వుత్సాహంబున ఒక నెల గడిపి
గయకు వెడలిరి అటనుంచి॥ 6

శుచివ్రతులై పితరుల కొరకు
పిండ తిలోదక క్రియ లిడగా
దివ్యరూపులై పితృదేతలు
స్వీకరించిరి ప్రీతిగను॥ 7

బాలకులారా వాసవాంబను
పూజలు భక్తిగ జేయు డికన్
మేము కైలాసము పొందినా మని
దిక్కుల శబ్దము నిండెనుగా॥ 8

అంతలో మెరపు కాంతి గల్గిన
వాసవ కన్యక అగబడియె
వైశ్యులు వేడుక వాసవి దేవిని
బహువిధంబులా స్తుతించిరి॥ 9

వాసవిదేవి ప్రసన్నురాలై
పుత్రులారా విను డనియె
నేనూ మీ వంశజులను గూడ
సుఖంబుగాను వున్నాము॥ 10

మీరలు తప్పక ప్రతిదినమైన
రెండు మాసంబులకైనా
రెండు అయనముల కొాక మారైన
తుదకు వత్సరంబునకైన॥ 11

శుక్రవారము నందు భక్తిగా
శక్తి కొలది పూజింపు డికన్
ఇట్లు జేసిన వార్లకు నేను
తప్పక శుభములు జేకూర్తు॥ 12

వైశ్యాధములతో సంబంధము
ఎన్నటికైనా వల దికను
దశవిధంబుల పూజలు జేసి
ధన్యులు కాండని నుడివెనుగా॥ 13

విరూపాక్షుడు దశవిధ పూజలు
జేయు మనంగను వినగానే
ఆ క్రమంబును దెల్పు మనంగా
దేవి మరల ఇటు బల్కెనుగా॥ 14

నా పూజలను క్రమముగ సాంగము
సావరంబు నా మంత్రికము
ఆది యందు పరిణావం బగును
దాని క్రమంబు విను డనియే॥ 15

మాయా బీజము బ్రహ్మబీజము
చంద్రము అమృతా బీజంబు
వీటితో చేరిన మంత్రి రాజమును
వినుడని ఈ మంత్రము దెలిపె॥ 16

ఓం హ్రీం శ్రీం హంసం వాసవ కన్యకే
మహ్యాం సర్వ సౌభాగ్యం దేహి
దేహి స్వాహా యను అక్షరముల్
షడ్వింశోఽక్షర మంత్రింబు॥ 17

సమాధి వైశ్యుడు ఋషియే యగును
చందస్సగును ఈ జగతి
అమృత బీజము సౌభాగ్యమె కీలకం
చరమ పదంబె శక్తగును 18

వాసవి కన్యక మంత్రి రాజమును
యే వైశ్యులు జపంబు చేసెదరో
వారికి సర్వసౌభాగ్యముల్ గలిగి
సత్సంతానము సిద్ధించు॥ 19

సమాధి ఋషికి జెప్పిన మంత్రిము
అంగకరన్యాసంబులతో
జపించు వారికి సంతతి వ్యాప్తి
తప్పక లభింప జేతునని॥ 20

ఆలయంబుల ప్రతిమల పూజ
వివాహ మందు కలశములు
తక్కిన శుభ కార్యముల యందును
కలశారాధన జేయ వలె॥ 21

అగ్నిదుర్గను కనక దుర్గను
ద్వారదుర్గను వేదాదుర్గను
జాత వేదసి భ్రమరీ దుర్గను
పక్షుదుర్గను దుర్గను గా॥ 22

గణపతి క్షేత్రపాలుని పూజ
సప్తమాతృకల పూజయును
దిక్పాలకుల నవగ్రహంబుల
నన్ను శ్రీసూక్తంబున పూజా॥ 23

భూలోకమునా ఈ నామంబుల
ఈ క్షేత్రముల వెలసెదను
క్షేత్రాల్ నామాల్ వినుడని వాసవి
వివరంబులు ఇటు దెల్పెను గా॥ 24

కాశిలో దుర్గ, వరాహమున విజయ
భద్రేశ్వరమున భద్రకాళియునూ
వైష్ణవి యనియూ మాతృక లోన
శ్రీశైలమున మాధవియు॥ 25

పెనుగొండ క్షేత్రంబున కన్యకయు
హస్తినపురమున కృష్ణనియు
చెండిక యనియు అమరుక లోన
మాయానగరమున మాయ యని॥ 26

సిద్ధవనమున అంబిక యనియు
సుపార్శ్వంబునా నారాయణియు
రుద్రక్షేత్రమున ఈశాననియు
బ్రహ్మక్షేత్రమున శారదయు॥ 27

మానస క్షేత్రంబున కుముదయుగా
ఈ పదునాల్గు నామముల
పూజ్యురాలైన నన్నర్చింపుడు
సర్వఫలంబుల పొందు డని॥ 28

మరల వాసవి బాలుల చేతికి
కలశద్వయముల నిచ్చెనుగా
కలశంబులలో అమృతము పోకలు.
నిండి యుండెను గాంచిరిగా॥ 29

అటుపై వాసవి బాలకులారా
మీ భక్తికి నే మెచ్చితిని
కోరుడు వరమును యని బల్కగనే
వరంబు వైశ్యులు వేడిరిగా॥ 30

అమ్మా పెనుగొండ పట్ణము నందు
దర్శన మిమ్మ నవరత మనా
ఏడు రాత్రులు దర్శన మిత్తు
ఈ ధర్మములు విను డని యె॥ 31

బ్రహ్మ అంశు డగు భాస్కరగురుని
వంశ పరంపర పూజించి
ఇంత వరకు నే జెప్పిన ధర్మాల్
నడిపిన శుభములు గల్గునని॥ 32

దేవగణములు సిద్ధసమూహము
సేవించుచును యుండగను
సింహ విమానము అధిష్ఠించియు
యంతర్ధానం బాయెనుగా॥ 33



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ఏ క పం చా శో ఽ ధ్యా య ః (51)

వాసవి దేవి యంతర్ధానము
గల్గిన వైశ్యులు గుంపులుగా
గయాక్షేత్రమును వదలిన వారై
నైమిశారణ్యము జేరిరిగా॥ 1

గదాధరస్వామి వుపాసకుండగు
పుండరీకు డను ఋషి గాంచి
విష్ణువుని మహిమ జెప్ప మని
వైశ్యులు వేడా యిట్లనియే॥ 2

హిమవత్ పుత్రిక పార్వతి దేవి
నందుం డను వాని గృహంబునా
కృష్ణదేవునికి సోదరి యైనది
ఆ దేవే మీా వాసవియు॥ 3

వైశ్య వంశమును రక్షించునది
వాసవి దేవి నమ్మండి
ఆమె చరిత్రము చెప్పుట కర్హుడు
భాస్కరచార్యులు దెలియండి॥ 4

గదాధరుం డగు విష్ణుమూర్తిని
ఆరాధించినమహాత్ములు
పరమ పదంబు పొందినట్టియు
ఒక కథ చెప్పెద వినరండి॥ 5

గదాధరుండు వీరి ముఖమునా
సర్వవ్యాప్తితో తృప్తోంది
అది యెట్లనగా వినిపించెదను
వినుడు వైశ్యులు వివర మనే॥ 6

కవ్యభాగమును పితృరూపమున
స్వీకరించి సంతస మొంది
హోమము లందున హవ్యభాగమును
దేవరూపుడై గ్రహించునూ॥ 7

చేయని పనిని చేసియు నైన
పిండప్రదానము దర్భలపై
విధి ప్రకారం జేసిన విష్ణువు
వంశవృద్ధినీ గలిగించు॥ 8

బ్రహ్మమానస పుత్రుండైన
సనత్కుమారుడు వక సమయం
మార్కండేయ ఋషికి దెలిపెను
ఆ మహిమంబే తెలిపెదను॥ 9

బ్రహ్మపుత్రు డగు సనత్కుమారుడు
మార్కండేయ మహర్షికి
శ్రౌతము స్మార్తము కర్మవిభాగము
గదాధర మహత్మ్యము వినుపించె॥ 10

అవ్యక్త విష్ణువు పితృరూపంబున
దేవరూపమును ధరియించి
శ్రౌతస్మార్త కర్మజాలమును
ననుభవించుచు నుండునుగా॥ 11

పితృరూపంబున కవ్యభక్షణ
దేవరూపంబున హవ్యమును
శ్రాద్ధాదుల యందిచ్చెడు పిండము
మిక్కిలి తృప్తిగ భుజించును॥ 12

కృతయుగంబున వత్స్యాయుడను
విప్రుం డొకడు యుండెనుగా
అతనికి పద్గురు పుత్రులు గల్గిరి
వారు నిరక్షర కుక్షులుగా॥ 13

అరణ్యా మందు జలముల యందు
తిరుగుచు కాలము గడుపగను
అంతలో తండ్రి మరణము నొంద
తల్లి అగ్నిలో బడిపోయె॥ 14

పుత్రు లందరు తల్లిదండ్రులకు
పరలోక క్రియలు జేసిరిగా
పిల్లకు విద్య లేకుండుటచే
అవమానంబులు గల్గెనుగా॥ 15

అన్నదమ్ములు ఒక చో గలసి
అయ్యో విద్య లేదనియు
ఖేదము నొంది విద్య నేర్చుటకు
ప్రయాగ క్షేత్రం జేరిరిగా॥ 16

ప్రయాగ లోన భరద్వాజ ఋషికి
తమ వృత్తాంతము జెప్పగను
మహర్షి కరుణతో వేదాధ్యయనము
వీర్లకు జేయు మొదలిడెను॥ 17

ఎంత విద్యను జెప్పిన గాని
వీర్లకు పాఠము కాకుండె
దీనికి కారాణంబు దెలిసియు
ఒక కర్తవ్యము నిర్మించె॥ 18

బ్రాహ్మణ పుత్రులు భార్గవ మహర్షి
హోమధేనువును గాచుచును
ఒక సమయంబున ధేనువు మేపుచు
తండ్రి శ్రాద్ధమును మరచిరిగా॥ 19

శ్రాద్ధదిన మని జ్ఞప్తి దెచ్చుకొని
అన్నదమ్ములు బహు విధంబులా
శ్రాద్ధము జేయుట నిశ్చయించు కొని
హోమధేనువును జంపిరిగా॥ 20

భార్గవ మహర్షి హోమధేనువు
మాంసము శ్రాద్ధంబున నుంచి
విధి పూర్వకముగ శ్రాద్ధకర్మను
అగ్నౌకరణము చేసిరిగా॥ 21

సాయింకాలము అన్నదమ్ములు
ఋషి ఆశ్రమమును జేరిరిగా
గోవును గానక భార్గవ మహర్షి
ధేనువు ఏదని అడిగెనుగా॥ 22

గురువును గాంచి అన్నదమ్ములు
పులియు తినె ననిరి
మహర్షి దివ్య దృష్టితో జూచి
వీరి కృత్యము దెలసి కొని॥ 23

మూర్ఖులారా గోవును జంపి
శ్రాద్ధకర్మను జేసియును
పులి జంపె నని అసత్య వాక్యము
గురుద్రోహమును జేసితిరి॥ 24

కోపావేశము బొంది మహర్షి
శాపము బెట్టెను తీవ్రముగా
బ్రహ్మ హత్య కంటెను మిగుల పాప
ఫలంబు బొందుడు యని పల్కె॥ 25

పిమ్మట ఏడ్గురు తేజోహీనులై
అనేక జన్మము లెత్తియును
తుదకు మానవ జన్మము బొంది
మహర్షి జేరి తరించిరి॥ 26

గాన మీరలు కష్టము కోర్చి
తప్పక శ్రాద్ధముల్ జేయ వలెన్
విడచిన వారు పాపము బొంది
ఘోర నరకమున గూలెదరు॥ 27

పుండరీక మహర్షి వలనను
కథలను వినినా వైశ్యులును
పరమానందము బొందిన వారై
వెడలి కాశిని జేరిరిగా॥ 28

విశ్వనాథుని అన్నపూర్ణను
అనేక విధముల అర్చించి
తిరిగి వచ్చుచు జగన్నాథమున
జగన్నాథుని పూజించె॥ 29

పూరీ జగన్నాథము నుండి
పురముకు తిరిగి వచ్చుచును
పద్మపురమను పట్టణమునకు
తీర్థ కావళ్ళతో జేరిరిగా॥ 30

పద్మపురంబను పట్టణమందే
దీక్ష వహించి యువరాజు
వైశ్యుల రాక ఎదురు జూచుచు
వైశ్యులు వచ్చుట తెలుసుకొనె॥ 31

బంధు వర్గము పురోహితులతో
రాజనరేంద్రుడు వైశ్యులను
ఎదుర్కొనియు నాలింగనమున
కుశల ప్రశ్నలు గావించె॥ 32

మీర లందరు ఈ దినంబున
ఇచ్చట వుండుడు యని వేడ
ఆ దినంబున వైశ్యశ్రేష్ఠులు
పద్మపురంబున యుండిరిగా॥ 33



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

ద్వి పం చ శో ఽ ధ్యా య ః (52)

పద్మపురమున వైశ్యోత్తములు
ప్రాతఃకాలము వెడలియును
వైభవంబున దివ్యంబైన
పెనుగొండ పట్నము జేరిరిగా॥ 1

మల్లికార్జున మంటపంబున
వింధ్యవాసిని దేవతల
ధర్మపూజలు వేడుక జేసి
తమ గృహంబులు జేరిరిగా॥ 2

మరుచటి దినమున వైశ్య శ్రేష్ఠులు
భాస్కరాచార్యుల జేరియును
అమృత కలశ స్థాపనవిషయము
గురునిచే విధిని తెలుసుకొని॥ 3

పుణ్యాహవచన పూర్వకంబుగా
అమృత కలశము దీసుకొని
నగరేశ్వర స్వామి సాన్నిధ్యంబున
స్థాపన జేసిరి అందరునూ॥ 4

రాజరాజేంద్ర భూపతియును
దేవాలయముకు అరుదెంచె
రాజాగమనము వినిన వైశ్యులు
నెదుర్కొని సన్మానించిరిగా॥ 5

ఆ సమయంబున ధౌమ్యాచార్యులు
పెనుగొండ పురమునకు అరుదెంచె
భాస్కరచార్యులు ధౌమ్యాచార్యులు
అన్యోన్య భాషణల్ జరిగెనుగా॥ 6

రాజేంద్రుండు సభికుల గాంచి
క్షమార్పణంబులు వేడియును
అపరాధమును శాంతి జేయుటకు
అర్ధరాజ్యమును ఇత్తుననె॥ 7

విరూపాక్షుడా నీవీరాజ్యము
పాలించ వలె నని బల్కెనుగా
రాజ్యము మాకు వలదని బల్కి
విరూపాక్షునితో యిట్లనియె॥ 8

రాజేంద్రుండు సమ్మతించక
మీరు రాజ్యము వలదన్న
నే నిచ్చటనే ఉపవాసంబున
ప్రాణ మిడుతు నని దెలిపెనుగా॥ 9

ఆ సమయంబున ఆచార్యులునూ
పండిత ఋషులు ఎల్లరును
రాజేంద్రునకు శాంతిని జెప్పి
వైశ్యుల తోడ యిట్లనిరి॥ 10

నిష్కల్మషులగు వైశ్యులారా
మా మాటలను విను డికను
రాజుచే నియ్యబడిన రాజ్యము
దేవికి అర్పణ జేయు డికన్॥ 11

ఈ వాక్యములను వినిన వైశ్యులు
మా ధర్మంబులు గావనగా
రాజేంద్రుండు దీనత బల్కెను
నేను ప్రాణము విడుతున నె॥ 12

సభికు లెల్లరు యీ వార్తను విని
చికాకు జెందిన మనస్సుతో
సర్వ శరణ్యు రాలగు దేవిని
భక్తిప్రపత్తుల వేడిరిగా॥ 13

వీర్ల స్తోత్రము విన్న మాత్రమున
వాసవి దేవి సభ యందు
కలశము నందు వుద్భవ మొంది
దివ్యరూపమును గనుపించె॥ 14

అంబిక దేవికి ఇరు పార్శ్వముల
కలకల ధ్వనులు నిండెనుగా.
గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర
స్తోత్ర నాదములు వినబడెను॥ 15

చిరునగు ఒప్పెడి ముఖంబు తోడ
కోటి మెరుపుల రీతిగను
చిలుక కమలముల హస్తము బట్టిన
అభయాస్తముతో నుండెనుగా॥ 16

కంఠహారముల్ భుజకీర్తనులు
మణిఖచితం బగు వడ్డాణం
అందెల ధ్వనులతో నొప్పు పాదములు
కనక వస్త్రమును ధరించియు॥ 17

స ప్తమాతృకలు సేవించగను
ఎనిమిది దుర్గల సహితంబు
దాక్షాయణియు గణపరివారము
ఇన్ని వైభవముల అగబడియె॥ 18

ఇట్టి రూపమును మహర్షు లందరు
చూచిన వెంటనె నిలబడియు
విధవిధంబుల స్తోత్రము జేయగ
వాసవి ఋషులతో ఇట్లనియె। 19

ఓఋషులారా మీరు వరంబును
కోరిన ఇత్తును దెలుపు మన
ధౌమ్యాచారితో గూడిన ఋషులు
వాత్సల్యంబున అడిగిరిగా॥ 20

దేవీ నీ కపరాధము జేసిన
విష్ణువర్ధనుని కుమారుడు
నిన్నే శరణము బొంది యున్నాడు
ఇతనిని బ్రోవుము అనగాను॥ 21

దేవీ యపుడు యనుగ్రహించి
రాజనరేంద్రా నా వలన
ఏమి కావలెనో అడిగిన నేను
కోరిన యిచ్చెద నని బల్కె॥ 22

అమ్మా నాచే యివ్వగ బడెడు
రాజ్యము గ్రహించి బ్రోవ వలె
అని స్తోత్రమును జేయుగ దేవి
మరల వరమును గోరుమనే॥ 23

అధిక సంపద సత్సంతానము
చలనము లేని బుద్ధియును
నాతండ్రిని నే నిపుడు చూచెడి
ఈ వరంబులు ఇవ్వ మనెన్॥ 24

అట్లే యగునని వాసవి దేవి
ప్రసన్న వాక్కులు బల్కగనే
దివ్య దేహము గల్గిన తండ్రిని
రాజనరేంద్రుడు గాంచెనుగా॥ 25

తండ్రిని జూచి నమస్కరించగ
విష్ణువర్ధనుడు ఇట్లనియె
నీ రాజ్యంబును వాసవి దేవికి
ఇచ్చెడి సుపుత్రుడ వినుమనియె॥ 26

ఓకొమారుడా ప్రతినిత్యంబు
వాసవ కన్యక అర్చనయు
స్తోత్రము జేసి కీర్తిని బొంది
మోక్షస్థానము బొందు మనె॥ 27

ఈ మాటలను విని యువరాజు
వాసవి దేవిని బొగడగను
దేవి అమృతమును వర్షించుచును
వైశ్యు లందరితో ఇట్లనియె॥ 28

రాజనరేంద్రుడు ఇచ్చెడి రాజ్యము
స్వీకరించియు మీరలును
బ్రాహ్మణులకును దానము జేసి
మీరలు కీర్తిని బొందు డనె॥ 29

వాసవి దేవి ఆజ్ఞను వినియు
వైశ్యులు అట్లే జేతు మని
అంజలి బద్ధులై స్తోత్రము జేసి
ఆనందంబున యుండిరిగా। 30



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

త్రిపంచ శోఽధ్యాయః (53)

రాజరాజ నరేంద్ర భూపతి
గంభీరమున యిట్లనియె
విరూపాక్ష శ్రేష్టి నీవు
రాజ్యాభిషేకము బొందు మనె॥ 1

విరూపాక్ష శ్రేష్ఠి యిట్లనె
సర్వేశ్వరి యగు వాసవికే
పట్టాభిషేకము జేయ వలయును
సమస్త లోక దేవతకు॥ 2

విరూపాక్షుని వచనంబులకు
ఋషులు వైశ్యులు సభికులును
సంతసంబును జెందిన గాంచి
భాస్కరఋషియు త్వర పడియె॥ 3

రాజరాజేంద్ర భూపతి వెంటనె
జ్యోతిష్కులను బిలిపించి
శుభలగ్నమును నిశ్చయించియు
సకల వస్తువుల నొనగూర్చె॥ 4

పెనుగొండ పురము అలంకరించుటకు
పరిచారకులకు ఆజ్ఞాపించిరిగా
వైశ్యులు గూడి తమ గృహంబులకు
శీఘ్రమె వెడలి పోయిరిగా॥ 5

పరిచారకులు పెనుగొండ పట్నము
విచిత్ర తోరణంబులతో
వున్నతమైనా ధ్వజముల తోడ
మకర తోరణా పతాకముల్ ॥ 6

చందన జలములు జల్లియు అంతట
ముత్యాల ముగ్గులు బెట్టిరిగా
అరటి స్తంభములు పోకచెట్లతో
అలంకరించి దెలిపిరిగా॥ 7

రాజనరేంద్రుడు స్నానం బాడి
మునుల ఋషులతో గూడుకొని
ధౌమ్య భాస్కరాచార్యుల వెంట
నగరేశ్వర సన్నిధి కొచ్చిరిగా॥ 8

బ్రాహ్మణ వృద్ధులు సుజనులు గుంపులు
స్త్రీలందరును వేడుకతో
పట్టాభిషేకము జూచుట కొరకై
కోలాహలమున వచ్చిరిగా॥ 9

కర్నాటక రాజులు సింహళ రాజులు
కురుర కోసలా రాజులును
ఘూర్జర దేశము కోసల దేశము
పాండ్య కేరళ రాజులును॥ 10

వివిధ దేశముల రాజు లందరు
మంత్రుల చేత బిలువ బడి
శృంగారముల వైభవంబుతో
పెనుగొండ పట్నము జేరిరిగా॥ 11

విరూపాక్షుడు వైశ్య శ్రేష్ఠులు
స్నానము లాడి శుభ్రముగా
ఆభరణంబుల వస్త్రంబులతో
మంటపంబుకు వచ్చిరిగా॥ 12

రాజనరేంద్రుడు సంతోషంబున
తగిన ఆసనంబుల నిచ్చి
భాస్కరచార్యుల అధ్యక్షతలో
పట్టాభిషేకము జేయమనె॥ 13

భాస్కర గురుడు వాసవి పేర
విరూపాక్షునకు కంకణము
శాస్త్రోక్తముగా గట్టించియును
కార్యంబునకు మొదలిడిరి 14

గంగ గోదావరి కృష్ణ కావేరి
మొదలగు పుణ్య జలంబులా
వేదిక పైన వేయి కలశములు
స్థాపన జేసిరి గురువరులు॥ 15

అపరార్క ఋషి విధ్యుక్తంబుగ
అగ్ని ప్రతిష్టను జేసియును
మంత్రంబులతో సత్క్రియ జేసి
నాజ్యము సమిధుల పాయసము॥ 16

అగ్నిగుండమున హోమము జేయగ
అగ్నిహోత్రుడు జ్వాలలతో
ప్రకాశించగా సర్వహోమమును
ఋత్విక్కులచే వేల్చబడే॥ 17

భద్రపీఠమున వాసవి దేవికి
నాల్గు వేదముల మంత్రముల
వేదవేదాంగ వృద్ధ బ్రాహ్మణులు
పట్టాభిషేకము జేసిరిగా॥ 18

భాస్కరాచారి ధౌమ్యాచారి
పట్టాభిషేకము జేసిరిగా
గాలవ్యాది మహర్షు లందరు
మంత్రాభిషేకము జేసిరిగా॥ 19

రాజనరేంద్రుడు వాసవి దేవికి
పాదంబులపై బడగానే
వాసవ కన్యక సంతోషించి
ఖడ్గము మణిని యిచ్చెనుగా॥ 20

అంత దుందుభులు జణజణ మ్రోగే
జలజల పువ్వులు గురిసెనుగా
ఇంపుగ సొంపుగ వాద్యము లన్ని
విశేష నాదము గలిగెనుగా॥ 21

అనంతరంబు వాసవి ఆజ్ఞచే
విరూపాక్షు డలంకరింప బడే
యువరాజు పట్టాభిషేకము జేసి
కిరీటంబును వుంచిరిగా॥ 22

భద్రి గజమ్ముపై విరూపాక్షుడు
రాజనరేంద్రుడు గూర్చోనియు
బంధువర్గము వాహనంబుల
పురిప్రదక్షిణ జేసిరిగా॥ 23

ఏనుగుపైన వుభయులు గూర్చోని
వూరేగింపు జేయుగను
జూచిన జనులకు ఇంద్రోపేంద్రుల
రీతిగ కనులకు గనబడిరి॥ 24

భద్రిగజంబును దిగీ వుభయులు
స్త్రీలచె హారతు లందు కొని
ధౌమ్యమహర్షి ఆజ్ఞ మేరకు
వాసవి దేవికి అర్పించి॥ 25

మోహారి దండలు ధరించి నట్టి
వేయిమంది దాసీ జనులా
మత్తగజంబులు గుర్రంబులను
గోవులు పెక్కుగ యిచ్చెనుగా॥ 26

వాసవి దేవి కుబేరు గాంచి
నవనిధులతో వైశ్యభవనముల
నింపు మనగను కుబేరు డంతా
ధనరాసులతో నింపించే॥ 27

విరూపాక్షుడు రాజేంద్రునకు
బహుమతు లధికము నిచ్చియును
వాసవి దేవికి నమస్కరించి
రాజనరేంద్రుడు వెడలెనుగా॥ 28

పేదు రాత్రిలు వైశ్యు లందరు
పగలూ రాత్రి దెలియకను
వుత్సాహముచె మగ్నత చెంది
సంతోషముతో పొంగిరిగా॥ 29

విప్రు లందరికి వైశ్యోత్తములు
దానము లిచ్చిరి వివరింతు
తొమ్మిది కోట్లు బంగరు రాసులు
నూరు వేల గోవ్రులును॥ 30

షోడశ దానంబులను జేసిరి
దానము లెన్నో యిచ్చిరిగా
దానము లెన్ని యిచ్చిన గాని
ధనము తరుగనూ లేదాయె॥ 31

వాసవి దేవి పట్టభిషేక
మహోత్సవంబును వర్ణింప
ఇంతింతనియు జెప్పగ రానిది
కొంత మాత్రమె జెప్పినది॥ 32

విష్ణుసోదరి యైన వాసవి
దేవి యనుగ్రహంబును బొంది
వైశ్యభక్తులు శక్తి కొలదిగా
తమ సేవలను జేసిరిగా॥ 33

ఈ చరిత్రము విన్న వారికి
ఆయురారోగ్య ఐశ్వర్యాల్
సంతతి వృద్ధి బాగుగ గల్గును
యదార్థం బని నమ్మండి॥ 34



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

చతుః పంచాశో ఽధ్యాయః (54)

వాసవి దేవి పట్టాభిషేకం
బునకు వచ్చిన మునులకును
దానధర్మములు విశేష మిచ్చి
వార్లను ప్రశంస జేసిరిగా॥ 1

ఏ ధర్మముచే సిద్ధి పొందెదమో
అట్టి ధర్మమును జెప్పు మనా
అంతలో మునులు వైశ్యుల తోడ
దేవి జెప్పు నని నుడివిరిగా॥ 2

వాసవి దేవి ప్రసన్నురాలై
గంభీరముగా ఇట్లనియె
మహాత్ముడైన దైవము చేత
కర్మరూపము సృష్టి మయ్యె॥ 3

కర్మము చేత ధర్మాధర్మాల్
అందున ప్రపంచ ధర్మంబు
ధర్మము వలన ఊర్ధ్వలోకము
అధర్మంబుచే నరకముగా॥ 4

ఇట్లుండుటచే ప్రయత్న పడియు
ధర్మము తప్పక నడువ వలెన్
ధర్మస్వరూపము సూక్ష్మము దెలుపుమ
శ్రద్ధగ వినుడు కిరార లనే॥ 5

వేదము యజ్ఞము బ్రాహ్మణు లందరు
హరిహర బ్రహ్మ మహేశ్వరుల్
పంచభూతములు జగజాలములు
వేదంబులకు ఆశ్రయము॥ 6

వేదము బ్రాహ్మీ మూలము గాన
బ్రాహ్మీమూర్తిని నేనునుగా
పూజించెదను మీరలు గూడ
బాహ్మీమూర్తిని పూజింపు డికన్॥ 7

అహర్నిశంబులు ఆదరణంబున
దానసన్మానంబుల తోను
సేవ జేసియు కలియుగంబున
పావను లగుదురు యని బల్కె॥ 8

కామక్రోధ లోభము చేత
బ్రాహ్మణ దూషణ జేయకుడీ
వైశ్యుల గురు వగు భాస్కరచార్యుని
బాగుగ పూజలు జేయు డికన్॥ 9

సాలంకాయన ఋషి చెప్పిన
మంత్రము లన్నియు వేదములు
యేయే యుగముల యే వర్ణములకు
యేది చెప్పిన జేయు డికన్॥ 10

అట్లు జేయకా ఋషి వాక్కులకు
విరుద్ధంబుగ నడచినచో
రౌరవ నరకము తప్పక గల్గును
శేషధర్మములు దెలియు డికన్॥ 11

వివాహంబు జేయు వేళలో
మాతాపితురుల వంశమును
బాగుగ దెలసి సంబంధంబు
జేసి వృద్ధిని బొందు డికన్॥ 12

విరూపాక్షుడు వాసవి దేవిని
ప్రశంస జేసి వినయమున
అమ్మా సంబంధము లక్షణములు
ఎట్లు వుండ వలె జెప్పు మనా॥ 13

వంశము ప్రవర గోత్రము ఋషియు
దానము క్షేత్రము దీపమును
జపసంఖ్యయును జలము తటాకము
దేవుడు ఇవియూ పది యగునూ॥ 14

పది లక్షణములు గురుని చేతను
లేక వృద్ధుల వలన నైన
తెలసి బాంధవ్యము జేయ దగు నని
వాసవి దేవి వినుపించె॥ 15

వాసవి దేవి యిట్లు జెప్పగా
వైశ్యులు మరల అడిగిరిగా
అమ్మా వాటిని నీవే దెల్పుము
దశ లింగముల వివరంబు॥ 16

బిడ్డలారా శ్రద్ధగ వినుడు
దశవిధ లింగంబుల గుర్తు
వంశ మనంగా మాండవ్య జాతి
గోమతు లనియె జెప్ప బడు॥ 17

ప్రవరా యనగా ఏకార్షేయము
ద్వ్యార్షేయ త్ర్యార్షేయంబు లని
చతురార్షేయ దశార్షేయములు
ఇవి ప్రవరు లని నుడివిరిగా॥ 18

గోత్రం బనగా కూటస్థ పురుషుడు
ఋషు లన మునుల నామంబు
దానం బనగా పితరుల ప్రీతికి
జేయు కర్మకు దానంబు॥ 19

క్షేత్రం బనగా మీ శుభంబులకు
స్థలము దానము ఇచ్చుటయు
దీపం బనగా వృద్ధుల వలన
దెలసి అఖండము బెట్ట వలె॥ 20

జపం బనగా గాయత్రి జపంబు
స్థలంబులను మీ పెద్దలును
తిరిగిన క్షేత్రంబుల నామములు
ఇవియే దశవిధ లింగములూ॥ 21

వైశ్యులు మరల దేవిని గాంచి
నూటాారెండు గోత్రజుల
యే ధర్మంబులో క్రమములు వాటిని
జెప్పుమనియునూ ప్రార్థింప॥ 22

సోదరులారా గోత్రంబులకు
పది లక్షణముల జెప్పెదను
ఆస్తిక భావన గలవార్లకు నే
దీనిని జెప్పగ వలె ననియె॥ 23

దీనిని శ్రద్ధగ వినిన వార్లకు
పాపము లన్నియు బోవునుగా
వంశాభివృద్ధి నా యనుగ్రహాము
మహాదైశ్వర్యము గల్గునుగా॥ 24



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

పంచ పం చా శో ఽ ధ్యా యః (55)

వాసవ కన్యక వైశ్య సంతతికి
ఏ గోత్రము కే లింగ మన
జెప్పిన పద్ధతి నంతయు మీారు
వచన రూపమున జూడ వలెన్॥ 1

ఏబది అయిదవ అధ్యాయంబున
నూటారెండు గోత్రముల
ధర్మము లన్నియు వాసవి దేవి
వినిపించిన వే నమ్మండీ॥ 2

అన్ని ధర్మముల వినియు వైశ్యులకు
ఆనంద బాష్పములు రాలగను
కపోలంబులు తడుప బడినవై
గద్గద స్వరముతో స్తుతించిరి॥ 3

వాసవి దేవి వైశ్యుల గాంచి
నాచే మీరలు విను నదియు
యింక యేదైన అడిగిన గాని
తప్పక జెప్పెద అడుగ మనె। 4



## శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

షట్ పంచ శో ఽ ధ్యాయః (56)

వైశ్య శ్రేష్ఠులు వాసవి దేవికి
నమస్కారములు జేసియును
వంశాచారము దెలుప మన గాను
తెలియ జేసెను వాసవియు॥ 1

కృతయుగంబున ప్రపితామహులు
శైలాస్యాదిని జేరియును
ఈశ్వర సేవా తత్పరు లగుచు
కీర్తికన్య కల్యాణములో॥ 2

పెద్దలు జేసిన విధిని దెలిపెదను
వినుడు వైశ్యులు అని జెప్పె
యింద్రుని అగ్నిని వరుణ కుబేరుని
చంద్రుని స్థంబ రూపముగా॥ 3

చంద్రాదులను స్థంబాల్ రూపము
విధ్యుక్తముగా పూజించి
భక్తితో అయిదు స్తంభంబులనూ
తూర్పు ముఖముగా నిలిపిరిగా॥ 4

ఒక వరునకును ఏకలగ్నమున
యిద్దరు కన్యల వివాహము
కన్య భేదమున అగ్ని గుండములు
వేరు ప్రతిష్టగ జేయ వలెన్॥ 5

కన్యక నిచ్చెద మని మాటిచ్చి
యివ్వక పోయిన దోషంబు
ఆరు మాసములు నిరీక్షించియు
మరియొక వరునకు యివ్వవలె॥ 6

కన్యాదాత గృహీత యిద్దరు
తాంబూలంబుల గ్రహించియు
వివాహంబుల తప్పి నడచిన
యిద్దరు దోషము బొందెదరు॥ 7

వివాహ కార్యంబునకును ముందు
గంగా పూజను జేయ వలె
ప్రాతః సాయంకాలము లందున
అగ్ని పూజను జేయ వలె॥ 8

ముప్పది మూడు కోట్ల దేవతల
పూజయు రెండవ దినంబున
భోగ సంపద వృద్ధి కొరకునై
పసుపు గౌరియు పూజయును॥ 9

ఏక లగ్నమున అధిక వివాహముల్
జేయు పక్షమున పూజలును
వేరు వేరుగనె జేయవలయును
ఆవల గోత్ర పూజయును॥ 10

నాల్గవదినమున తొలి జామునను
కామధేనువు పూజయును
వధూవరులును వుభయులు గూడి
తప్పక పూజను జేయ వలెన॥ 11

కృతయుగంబున చాటును మనువు
కాలము నందు పిత్రులునూ
కామధేనువు గర్భము నందు
ఒక సంవత్సరము వుండిరిగా॥ 12

కామధేనువు సవ్యదక్షిణ
కర్ణ రంధ్రముల ద్వారమున
సుఖంబు గాను వుద్భవించగా
వారి వివాహముల్ జరిగినవి॥ 13

వివాహంబున నాల్గవ దినము
రాత్రి మూడవ జామున
శేష హోమము సమాప్తి జేసి
ఓడ పూజయు జేయ వలెగా॥ 14

చిత్రకంఠుని మాయను మీరి
గౌరి యను గృహమును బొంది
ఓడలో వచ్చిరి గాన వైశ్యులు
నౌకా పూజా జేయ వలె॥ 15

ముత్తైదువులు కన్య లందరు
ఆరవ దినము వేదికపై
పార్వతి దేవిని పూజించియును
పోలి స్థంబముల పూజయును॥ 16

ఏడవ దినమున నంది పూజయు
బాల వైశ్యుల భోజనముల్
గురువు నాజ్ఞను బొంది మీరలు
జేసిరి కంకణ విసర్జన॥ 17

ఆ దినంబున బంధు బలగము
మంగళ వాద్యంబుల తోడ
భార్యాభర్తలు వుభయులు గూడి
గృహాప్రవేశము జేయ వలెన్॥ 18

కలశంబునకు అలంకరించియు
వివాహ మందు నిత్యమును
ధూప దీపముల పూజలు జేసి
విధి ప్రకారము జేయ వలెన్॥ 19

వివాహ మందు నన్నారాధన
జేయని పక్షంబున మీరు
దరిద్రులగుదురు గాన మీరలు
పూజను తప్పక జేయు డనే॥ 20

వంశాచారము వినిన వైశ్యులు
ఆనందమును జెందియును
వాసవి దేవి పాదంబులకు
ప్రణిపాతంబును జేసిరిగా॥ 21

## శ్రీ కన్యకాపరమేశ్వరీ పంచకలశారాధన ఘట్టము



సమయమంతుల పెదగున్నయ్య, ఆదిలక్ష్మి గార్లు

తుని



బండారు స॥ కుమారులు 5 మంది. ఇందులో జ్యేష్ఠుడు

అప్పలరాజు, ధర్మపత్ని చిట్టమ్మగార్లు, తుని

# శ్రీ వాసవికన్యకా పురాణ తోహరాగానము

సప్త పంచ శో ఽ ధ్యా యః (57)

విరూపాక్ష వైశ్య శ్రేష్టులు
దేవిని యిట్లు ప్రార్ధింప
వేదిక పూజ విషయము మాకు
సందేహంబు గలిగె నన॥ 1

జగదాంబ బపుడు భీకర వాక్కుల
పరమ రహస్యము జెప్పెనుగా
యీా వృత్తాంతము బయలు పరచక
రహస్యంబుగ వుంచు డనె॥ 2

బాలకులారా చిత్రకంఠుని
మాయాకృత్యము గలుగగనె
సుదంతి వరుడు కీర్తి నామికా
వుభయులు మూర్ఛా బడిపోగా॥ 3

నందీశ్వరుడు వివాహంబుకు
వచ్చి చూచెను ఈ వింత
దేవిని గూర్చి ధ్యానము జేయగ
ఇద్దరు శక్తులు వచ్చిరిగా॥ 4

కోనకమలయే లక్ష్మీదేవి
వింధ్యవాసిని పార్వతియు
వీర లిద్దరు నందిస్తోత్రమున
కలశ రూపమును బొందిరిగా॥ 5

ఆ సమయంబున వధూవరుల
ప్రాణము సూక్ష్మరూపమున
కలశంబులలో ప్రవేశించియు
ప్రాణప్రతిష్ట గలిగెనుగా॥ 6

నందీశ్వరుని ఆజ్ఞను బొంది
జేత బట్టుకొని కలశముల
వైశ్యులు కల్పవృక్షము క్రింద
సప్తరాత్రులు వుంచిరిగా॥ 7

చిత్రకంఠుని మాయాశక్తిని
లక్ష్మిపార్వతి కలశములు
మాయను ధ్వంసము చేసి వుభయుల
గాపాడినవి ఆ శక్తుల్॥ 8

అందు వలన మీ రందరును
కలశ పూజను శ్రద్ధగను
జేసి ఔదార్యము సౌశీల్యంబు
సద్ వృత్తులును గలుగునుగా॥ 9

ఈ రహస్యము జెప్పి వాసవియు
వైశ్యులారా మీ రికను
ఇంకా దేనిని విన గోరితిరో
అడుగుడు శీఘ్రమె యని బల్కె॥ 10

విరూపాక్షుడు స్తోత్రము జేసి
ఈ ధర్మమును వేడెనుగా
కలిదోషములు అంటకుండెడి
ధర్మకార్యమును జెప్పు మనె॥ 11

వినాకు మంగళము గల్గును గాక
నేను జెప్పెడి రహస్యము
దుర్మార్గులకు మరపుచె నైన
జెప్పక దాచి యుంచు డనె॥ 12

మకర మాసము సమీపించగ
వైకుంఠ ద్వారము తెరువగను
దేవత లందరు భూలోకమునకు
వచ్చి విప్రుల జేరెదరు॥ 13

అందున మీకు భక్తిభావమున
బ్రాహ్మణ పూజ జేయ వలె
వారి పూజను జేసిన వారికి
పాపము లన్నియు దగ్ధ మగు॥ 14

కలియుగంబున దేవత లందరు
విప్రుల రూపము నుందురుగా
కలిదోషంబు నివారించుటకు
వారల పూజ జేయ వలె॥ 15

